# READING BOOK

FOR

## ZENANAS AND ADVANCED CLASSES

IN

## GIRLS' SCHOOLS.

---

## చదువరులగు

స్త్రీలకొరకు కల్పించిన

బాలామనోరంజనియను

వచనకావ్యము.

---

SECOND EDITION, 1,500—TOTAL COPIES, 3,000.

---




MADRAS:

THE CHRISTIAN VERNACULAR EDUCATION SOCIETY.

S. P. C. K. PRESS, VEPERY.

---

1886.

# READING BOOK

FOR

# ZENANAS AND ADVANCED CLASSES

IN

# GIRLS' SCHOOLS.

---

## చదువరులగు

స్త్రీలకొరకు కల్పించిన

బాలామనోరంజనియను

వచనకావ్యము.


SECOND EDITION, 1,500—TOTAL COPIES, 3.000.

MADRAS:

THE CHRISTIAN VERNACULAR EDUCATION SOCIETY,

S. P. C. K. PRESS, VEPERY.

1886.

# ఉ పా ధ్యా యు న కు.

ఈ గ్రంథము ఆరునెలల పాఠములుగా విభజింపబడెను. నెలకు మూడు పాఠములు క్రొత్త పాఠములు చెప్పి నాలుగవ పాఠము చింతన చేయించవలసినది. వినోదముకొరకు మతసంబంధులున్ను నీతిబోధకములున్నైన పాఠములు సోమవారమునాడున్ను బుధవారమునాడున్ను; శరీరారోగ్యమును బోధించు పాఠములు మంగళవారమునాడున్ను; పిల్లలను పెంచే విధమును బోధించే పాఠములు గురువారమునాడున్ను; శాస్త్రమునున్ను శిల్పమునున్ను బోధించే పాఠములు శుక్రవారమునాడున్ను వచ్చునట్లు ఏర్పరచబడెను.

ఈ పాఠములలో కొన్నిటియందు వేదవాక్యములున్నవి. వాటిలో కొన్నిటిని కంఠపాఠము చేయవలసినది.

# విషయసూచిక.

## మతసంబంధులున్ను నీతిబోధకములున్నైన

## పాఠములు.

## పిల్లల ఆరోగ్యమునుగురించిన పాఠములు.

## పిల్లలకు మతివిషయములున్ను నీతములున్ను నేర్పుటకు ఉపయోగించు పాఠములు.

## శిల్పశాస్త్రములు మొదలగువాటిని బోధించు పాఠములు.

బాలామనోరంజని యను

# వచనకావ్యము.

## మొదటి నెల.



### ౧ ప్రారంభ పాఠము.

| | |
|---|---|
| పద్ధతి. | విధము. |
| అభ్యసించుట. | నేర్చుట. |
| పెక్కు. | అనేకములు. |
| ముద్రింపబడును. | అచ్చువేయబడును. |
| అంతఃపురము. | రాణివాసము. |
| నిర్బంధించుట. | స్వాతంత్ర్యము లేకుండునట్లు చేయుట. |
| సమర్థులు. | శక్తిగలవారు. |

ఇదుగో! ఆడపిల్లలు చదివే పాఠపు పుస్తకము. ఇది ఒక క్రొత్తపద్ధతిని అనుసరించి వ్రాయబడినది. పూర్వకాలమందు ఈ దేశపువారు

స్త్రీలు చదువులేకుండా ఉన్నప్పుడే చెడ్డవారై ఉండగా, చదివితే మరీ చెడ్డవారు అగుదురని తలంపుచేత వారిని చదువనంగీకరింపరైరి. కొన్ని సంవత్సరములవరకు హిందుస్థానమందు మర్యాదగల ఏ స్త్రీయున్ను ఒక అక్షరమునైనా చదువనేరక ఉండెను. ఇప్పుడైతే పెక్కువేలకొలది స్త్రీలు చదువుకొనుచున్నారు. వారిలో కొందరు భాగ్యవంతులైనవారి యొక్కయును, గొప్పవారియొక్కయును, భార్యలున్ను కొమార్తెలున్ను అయి ఉన్నారు; తక్కినవారు బీదవారి పిల్లలు. (ఈ భాగమందు) అనేక భాషలవారు కలరు. గనుక వారి ఉపయోగమునిమిత్తము ఈ పుస్తకము సుమారు పండ్రెండు భాషలలో ముద్రింపబడును.

ఇప్పుడు ఆడపిల్లలు ఏ హేతువుచేత చదివింపబడుచున్నారు? ఈ దేశమందు క్రీస్తుమతము చాలా వ్యాపకమై ఉండుటచేతనే. హిందువులున్ను, మహమ్మదీయులున్ను, తమ భార్యలనున్ను, కొమార్తెలనున్ను అంతఃపురములందే ఉంచుచుండిరి. వారు స్త్రీలు మిక్కిలి చెడ్డవారని అనుకొని, వారికి చదువుటనున్ను వ్రాయుటనున్ను నేర్పుటకు భయపడిరి. తమదగ్గిర బంధువులలో కొందరిని తప్ప మరి ఎవరిని చూచుటకును వారికి సెలవు ఇవ్వరైరి. ఇంగ్లీషుదొరసానులు బాగా విద్య నేర్చుకొనుచున్నారు; వారిని అంతఃపురములందు నిర్బంధించుట లేదు; దీనివల్ల వారు ఎక్కువ బుద్ధిమంతులే అగుచున్నారు. అలాగుననే హిందూదేశపు స్త్రీలున్ను జ్ఞానవంతులుగానున్ను మంచివారుగానున్ను ఉండవలెనని మేము కోరుచున్నాము. వారు అట్లు చేయ సమర్థులగుటకు దేవుని పరిశుద్ధగ్రంథమును చదివి దానియందు భక్తి తాత్పర్యము ఉంచవలెను.



## ౨ పాఠము.

### ఆరోగ్య వ్యాధులను గురించి.

| | |
|---|---|
| వివేకశూన్యులు. - - - | జ్ఞానహీనులు. |
| స్వస్థులము. - - - | ఆరోగ్యవంతులము. |
| జాడ్యము. - - - - | రోగము. |
| భుజించుట. - - - | తినుట. |
| వ్యాధులు. - - - - | రోగములు. |
| అనుమతి. - - - - | అంగీకారము, ఇష్టము. |

ఆరోగ్యము గొప్ప మేలు; స్వస్థులమై ఉన్నప్పుడు మన పనులు మనము నెరవేర్చుకొని, ఇతరులకు మేలుచేయుటకు సమర్థులమగుదము. జాడ్యమువల్ల మన బలము పోవును. అప్పుడు మనదగ్గిర ఉండువారికి మనము ఎంతో భారముగా ఉందుము, గనుక మన ఆరోగ్యము కొరకు మనము చాలాజాగ్రత కలిగి ఉండవలసినది. వివేకశూన్యులగు జనులు జాడ్యము తనంతట అదే వచ్చును అనిన్ని, లేదా కోపించిన దుష్టదేవతలచేత పంపబడుచున్నది అనిన్ని అనుకొనుచున్నారు. కారణములేకుండా మనకు వ్యాధి ఎప్పుడున్ను తటస్థింపదు. మనకు దేనివల్ల జాడ్యము వచ్చినదో మనము చెప్పలేకపోవచ్చునుకాని తెలివికలిగిన వైద్యులు చాలా సంగతులలో చెప్పగలరు. మన చెయ్యి కాగుచున్న నీళ్లలో పెట్టితే అది కాలును. మనము విషము పుచ్చుకొంటే చత్తుము. ఈ రీతిని చాలా జాడ్యములు పుట్టవచ్చును. మనము విస్తారము పచ్చికాయలు తినుటవల్లనైనా, లేక చిరితిండి తినుటవల్లనైనా, మన కడుపులకు జబ్బు కలుగును. తడిబట్టలు కట్టుకొంటే జలుబుచేయును; మనము బురదనీళ్లు వాడుకొంటే జ్వరమువల్ల కష్టపడుదుము. ఇవి కాక ఇంకా అనేక కారణములవల్ల రోగములు వచ్చును.

కొంతమంది హిందువులు మశూచికము వ్యాధులను పుట్టించే ఒక దేవతవల్ల కలుగుచున్నదని చెప్పుచున్నారు. మరి కొందరు దయ్యముల కోపమువల్ల వాంతిభ్రాంతి అను రోగము కలుగుచున్నది అని అనుకొను

చున్నారు. ఇట్లు అనుకొనుట గొప్ప పొరబాటు. మశూచికమును కలుగజేసే దేవత లేదు; వాంతిభ్రాంతిన్ని ఇంకా ఇతర వ్యాధులున్ను కలగచేసే దుష్టగ్రహములున్ను లేవు.

దేవునికి తెలియకుండానున్ను ఆయన అనుమతి లేకనున్ను ఏదిన్ని సంభవించదనేది వాస్తవము. అయితే మన పరలోకపు తండ్రి ఎల్లప్పుడు దయతోనున్ను జ్ఞానముతోనున్ను (సర్వమును) చేయుచున్నాడు. ఆయన కారణము లేనిది మనలను ఎప్పటికి శిక్షించడు. ఏ విధముచేతనైనా ఒక చెడ్డపని చేసితే మనకు రోగము సంభవించుచున్నది. గనుక అందరున్ను జాడ్యము రాకయుండునట్లున్ను ఆరోగ్యము కలిగియుండునట్లున్ను ప్రయత్నము చేయవలసినది. ఇంక కొన్ని సంగతులు ముందు రాబోవు పాఠములలో చెప్పబడును.

## 3 పాఠము.

### విశాలమార్గమును గురించిన్ని, ఇరుకుమార్గమును గురించిన్ని.

| | |
|---|---|
| ఒడుదుడుకు. - - - | మెరకపల్లము. |
| వరకాటము. - - - | సాగుడులేని లోతు. |
| వికసించుట. - - - | విప్పుకొనుట. |
| తెరవు. - - - - | మార్గము. |
| నగరు. - - - - - | రాజగృహము. |

ప్రపంచమందుండే జనులు రెండు మార్గములను నడుచుచున్నారు. ఒకటి విశాలమైనదిన్ని సమముగానుండేదిన్ని అయియున్నది. మంచి ఫలములచేత నిండిన చెట్లవల్ల దానికి నీడ కలుగుచున్నది. ఆ మార్గమందంతట చక్కని పుష్పములవల్ల సువాసన వ్యాపించుచున్నది. విశాలమైన మార్గము నిమ్మళముగా నడుచుచున్నటువంటిన్ని, అక్కడక్కడ పడియున్న పుష్పములను ఏరుకొనుచున్నటువంటిన్ని జనులతో నిండి ఉన్నది. రెండవ మార్గపు ద్వారము ఇరుకైనది; దారి ఒడుదుడుకుగా

నున్ను వరకాటముగానున్ను ఉన్నది. ఈ దారిని పోవు మనుష్యుల సంఖ్య బహు స్వల్పము.

కొంతదూరము పోయిన తరువాత దారులు మారును. విశాలమార్గమున పోవువారు తాము పోగుచేయు పుష్పములు వెంటనే వాడిపోవుననిన్ని, తాము తినబోవు పండ్లు తమనోట పెట్టుకొన్నప్పుడే మన్నై పోవుననిన్ని, తెలుసుకొందురు. చివరకు అకస్మాత్తుగా భయంకరమగు వరకాటపు స్థలమునుండి అగ్నిమయమైన మడుగులో పడుదురు. అక్కడ ఎల్లప్పుడున్ను ఏడ్పున్ను పళ్లుకొరుకుటయున్ను కలిగియుండును. రెండవది యగు మెట్టపల్లముగానుండే ఇరుకుమార్గము క్రమక్రమముగా నునుపుగానున్ను విశాలముగానున్ను ఉండును. రాళ్లకు బదులుగా మెత్తనిగడ్డి కనుపడును; పుష్పములు వికసించును. చక్కని పండ్లగెలలు ఆహారమునకై ఉపయోగించును. చివరకు ఈ మార్గస్థులు తమ పరలోకపు తండ్రినగరులో ప్రవేశించి, అక్కడ తెల్లనివస్త్రములనున్ను ప్రకాశమయమైన కిరీటములనున్ను ధరించుకొని, బంగారపు వీణెలను చేత పట్టుకొని సంచరించుచుందురు.

దీని అర్థము మీకు తెలుసునా!

పాపమనే విశాలమార్గము మరణమును కలుగచేయును. ఇరుకుదారి అమరత్వము నిచ్చును. యేసు చెప్పినమాటలు వినండి; మీరు "ఇరుకుద్వారమున ప్రవేశించండి, ఎందుచేతనంటే నాశనమునకు పోవు మార్గమున్ను ద్వారమున్ను విశాలమై యున్నది. అనేకులు ఆ త్రోవనే పోవుచున్నారు. ఎందుచేతనంటే నిత్యజీవనమును కలుగచేయు మార్గమున్ను ద్వారమున్ను ఇరుకైనవి; గనుక ఈ తెరవున నడిచేవారు బహుకొద్దిమంది." (మత్తై. 7: 13, 14.)



# ౪ పాఠము.

## చెప్పుటకంటె చేసి చూపించుట మంచిది అనేదానినిగురించి.

ఇరుపార్శ్వములు. - - రెండువైపులు.
తొలగుట. - - - - మళ్లుట.

పీత అను ఒక జంతువు కలదు; దానికి కాళ్లు ఇరుపార్శ్వముల యందు ఉన్నందున, అది ఎప్పుడున్ను కుడికైనను ఎడమకైనను నడుచును.

ఒక కథలో ఒకతల్లి పీత తిన్నగా నడిచిపోక పక్కలకు నడుచుటచేత తన పిల్లలను నిందించెను. చిన్నపీతలు "అమ్మా! నీవుకూడా పక్కలకే నడుచుచున్నావని చెప్పెను." పిల్లలు మనము చెప్పినదానియందు లక్ష్యముంచక, మనము చేసేది చూచి చేతురు అనునది ఈ కథవల్ల తెలియవచ్చును. "చిన్నపిల్లలకు మంచిబుద్ధి చెప్పి చెడునడత కనుపరిచితే, పరలోకమునకు ఇదే మార్గమని తలవూచి సయిగచేసి చేయి పట్టుకొని నరకమునకు తీసుకొనిపోవునట్టు ఉండును" అని ఒక బుద్ధిమంతుడు పలికెను.

ఈ ప్రపంచమందు ఏ మనుష్యుడున్ను తనకొరకే జీవించడు. మనము చేయు పనులవల్ల మన చుట్టుపట్లనుండువారికి కీడైనను మేలైనను చేయుచున్నాము. ముఖ్యముగా చిన్నపిల్లలు ఇతరులను అనుసరించి నడుచుటకు సిద్ధపడి ఉందురు. వారు వినేదానికంటె చూచేదానిని ఎక్కువగా గమనింతురు. గనుక పిల్లల యెదుట మీరు ఏమి చేయుదురో దానిని గురించి జాగ్రతగా ఉండండి. "పిల్లల యెదుట పాపము చేసేవాడు రెండుమార్లు పాపము చేయుచున్నాడు" అనే సామెత నిజమై యున్నది.

యేసువలె ప్రవర్తించుటకు పరిశుద్ధాత్మ సహాయమువల్ల ప్రయత్నము చేయుడి. మీ యావత్తు హృదయముతో దేవుని ప్రేమించుడి. తరుచుగా ఆయనను ప్రార్థించుడి; ఆయన చెప్పినట్టు చేయుటకు యత్నించుడి. మీ చుట్టుపట్లనుండేవారియందు దయగానుండుడి; ఎవరిని

మోసపుచ్చకుడి; చెడుమాటలు ఉచ్చరించకుడి, ఈ విధముగా పిల్లలు నేర్చుకొనవలసిన విధమును మీరు వారికి నేర్పుదురు. వారు ముసలివారైనప్పుడు ఇట్టిమార్గమునుండి తొలగిపోరు.

## ౫ పాఠము.



చక్కదనము తెచ్చుకొనుటను గురించి.

| | |
|---|---|
| బెజ్జములు. - - - - - | రంధ్రములు. |
| ముక్కుకమ్మి. - - - - | నత్తు. |
| బంధించుచున్నారు. - - - | కట్టుచున్నారు. |
| తూలుట. - - - - - | ఇటుఅటు కదలుట, జోగుట. |
| అందము.- - - - - - | సొగసు. |
| విద్యాహీనులు. - - - - | మూఢులు. |
| విద్యావంతులు. - - - | చదువుకొనినవారు, అనగా పండితులు. |

అనేక జాతులవారు తమకు మనస్సువచ్చినట్టు సౌందర్యమును కలుగచేసుకొనుటకు అనేకరీతుల యత్నించుచున్నారు. కొన్ని దేశములందు చౌకపు తల అందమని ఎంచెదరు. గనుక వారు ఆ రూపము కలుగుటకు పసిపిల్లల తలలు కొయ్యల మధ్య పెట్టి ఒత్తుదురు. ఇతర జాతులవారు పొడుగుగా నుండేటటువంటిన్ని మొన తేలినటువంటిన్ని శిరస్సు సొగసైనదని అనుకొని, పసిపిల్లల తలలను గుడ్డలతో చుట్టూ కట్టుదురు. కొన్ని జాతులవారికి పైకి ఎత్తుకొనిన ముక్కులు సంతో

షకరములు. మరి కొందరు చిన్నప్పుడే ముక్కు పొట్టిగానుండుటకు యత్నించుదురు. ఈ దేశమందు కొందరు స్త్రీలు చెవులకు గొప్ప రంధ్రములు ఉంటే చక్కదనమని ఎంచుచున్నారు. చెవులకు బెజ్జములు వేసిన తరువాత, కమ్మలు చుట్టలు పెట్టి వాటిగుండా కోడిగుడ్డు దూరిపోవునంతమట్టుకు పెంచుదురు. హిందూదేశమందు అనేకమంది స్త్రీలు ముక్కుకమ్మి మొదలగు భూషణములు ధరించుటకు ముక్కులు కుట్టించుకొందురు. ఒకచోట జనులు బుగ్గలకు బెజ్జములు పొడిచి వాటిలో చిన్నరాళ్లు పెట్టితేనే గాని అందము లేదని ఎంచుచున్నారు. చీనాదేశమందు చిన్నపాదములు చక్కగానుండునని అనుకొని, శిశువులగు స్త్రీలపాదములు ఎదుగకుండా బంధించుచున్నారు. చీనాదొరసాని తూలుచు నడుచునే కాని తిన్నగా నడువలేదు.

కొంతమంది దేశస్థులు శరీరములకు రంగు వేసుకొనుచున్నారు. తూర్పుదేశస్థులు పండ్లకు కప్పు వేసుకొనుచున్నారు. ఇది ఎందుకంటే, "కుక్కపండ్లవలె మా పండ్లు తెల్లగానుండవలసినదా" అని అందురు.

ఇటువంటి ఆచారములు మంచివి కావు; దేవుడు సృష్టించినట్టే మన శరీరములు ఉంటే అప్పుడు అవి బహు అందముగా కనుపడును.



## ౬. పాఠము.

### విద్యాలాభమును గురించి.

బడికి వెళ్లుట అనేక విధముల మంచిది. వివేకశూన్యులైనటువంటిన్ని, దుర్మార్గులైనటువంటిన్ని, తలిదండ్రులు కొందరు తమ పిల్లలను బడికి పంపక, వారిమనస్సు వచ్చినట్టు ఆడుకొనుటకు సమ్మతించుచున్నారు. ఆ పిల్లలు చెడ్డవారి సహవాసముచేసి జూజములాడడమున్ను దొంగలించడమున్ను నేర్చుకొందురు. బడికి వెళ్లే పిల్లలైతే దుర్మార్గులతో సహవాసము చేయక, పరిశుభ్రముగానుండి కృషిచేయువారుగా చేయబడుచున్నారు.

చదువుటకు శక్తికలిగి ఉంటే మనము ఇంకొక విధముచేత తెలుసు కొనలేని అనేక సంగతులు గ్రహించవచ్చును. పుస్తకములు చదు వలేనివారు చూచిన అంశములకంటె ఎక్కువ అంశములు విస్తా రము తెలుసుకొనలేరు. అట్టివారు తాము నివసించే దేశమునుగురించి గాని దాని చరిత్రమునుగురించి గాని ఏమిన్ని చెప్పలేరు. పుస్తకముల మూలముగా ప్రపంచమందుండు దేశములనుగురించిన్ని, సూర్యచంద్ర నక్షత్రములను గురించిన్ని, ఇంకా అనేక సంగతులనుగురించిన్ని నేర్చు కొనవచ్చును. విద్యాహీనులు సాధారణముగా కూలివాండ్రవలె బహు కష్టపడి జీవింతురు. విద్యావంతులైతే విస్తార శ్రమలేకుండా పెద్దజీత ములు తెచ్చుకొని జీవింతురు.

విద్య నేర్చుకొనినందున వచ్చే గొప్ప లాభమేమంటే, దేవునిగురిం చిన్ని రక్షణమార్గమునుగురించిన్ని బాగా తెలుసుకొనవచ్చును. దేవుడు ప్రపంచమును సృష్టించినరీతిన్ని, మనుష్యుడు పాపముచేసిన విధమున్ను, అన్నిటికంటె ఎక్కువగా లోకరక్షకుడైన యేసుక్రీస్తును గురించిన్ని బైబిలులో మనము చదువగలము. ఈ రీతిని బంగారముకంటె ఎక్కువ విలువగలిగినటువంటిన్ని, కెంపులకంటే రవ్వలకంటే ప్రశస్తమైనటువం టిన్ని నిజమైన జ్ఞానము మనకు కలుగును.

మొగపిల్లలకు వలె ఆడపిల్లలకున్ను విద్య నేర్పవలసినది; పురుషులకు వలె స్త్రీలకున్ను ఆత్మలు కలవు. తల్లులు తమ పిల్లలను పెంచురీతి బాగా గ్రహించుటకై తమంతట తాము విద్య నభ్యసింపవలసినది.

## ౭ పాఠము.

### తేమయింటిని గురించి.

యోగ్యురాలు. - - - మంచి నడతగలది.

వివేకశూన్యురాలు. - - తెలివిలేనిది.

ఒక దొరసాని ఒక రోజున చాలాదూరముననున్న తన సహో దరిని చూచుటకు వెళ్లెను. ఈ సహోదరి యోగ్యురాలే కాని

వివేకశూన్యురాలు. ఆమె కుటుంబసహితముగా పర్రకు సమీపమందున్న ఒక ఇంటిలో కాపురము ఉండెను. ఆ ఇల్లు వానకాలమందు నీళ్లు లోపలికి వచ్చి నిలుచునంత పల్లముగా నుండెను. ఈ చూడవచ్చిన దొరసాని ఆ ఇంటివారి ఆరోగ్యస్థితిని అడిగినప్పుడు, “మేమందరము ఏలాగో ఒకలాగున ఈ గృహమునందు దురదృష్టులమై ఉన్నాము. నా పెనిమిటి మిగుల జాడ్యపడి ప్రయాసముతో నడుచుచున్నాడు. నాకు జలుబు చేయకపోవుట అరుదు; ఇంతేకాదు, పోయిన సంవత్సరమందు జ్వరముచేత మేమందరమును బాధపడినప్పుడు, మా పిల్లలలో ఇద్దరు కాలముచేసిరి. ఈ మా దుర్దశ మాకు ఏలాగున కలిగెనో నేను చెప్పజాలను” అని ఆమె సహోదరి ప్రత్యుత్తరమిచ్చెను.

“నా ప్రియమైనదానా! మీరు దురదృష్టవంతులు కారు; మీరు వెర్రివారు. మీ కుటుంబమునకు వచ్చిన కష్టములు ఈ పర్రదగ్గిర ఉన్న ఈ తేమయింటివల్ల కలుగుచున్నవి. మీరు ఇక్కడ ఉన్నన్నాళ్లు ఇట్లాగే జరగక తప్పదు” అని చూడవచ్చిన ఆమె చెప్పెను.

“నీకు అలాగు రూఢిగా తోచుచున్నదా? సరే. నాకే ఈ హేతువు తెలిసినట్టయితే మరుదినము ఇక్కడినుంచి బైలుదేరి పోదును. అయినప్పటికి మేము ఎక్కడ ఉన్నా మాకు కష్టములు సంభవించున”ని ఆమె సహోదరి అనెను.

“మనము ఎక్కడ ఉన్నా కీడు సంభవించుట వాస్తవమే కాని, మనచేతనైనంతమట్టుకు హానికరమైన ప్రతిసంగతినుండి తప్పించుకొనుట మనకు విధియైయున్నది. మీరు మీ ఆరోగ్యమునిమిత్తము తగిన జాగ్రతె పుచ్చుకొననందున, మీ కుటుంబమునకు ఇటువంటి కష్టములు సంభవించుచున్నవి” అని చూడవచ్చిన దొరసాని పలికెను.

ఈ దొరసాని చాలా బుజ్జగించి, తన సహోదరి కుటుంబము మరియొక స్థలమునందు కాపురము ఉండునట్టు చేసెను. ఇక్కడ ఆమె పెనిమిటికి పుష్టి కలిగెను. తల్లి పిల్లలు అనేక సంవత్సరములవరకు బహు సుఖముగా జీవించిరి.



## ౮ పాఠము.

### అద్దమును గురించి.

ఒకానొకనికి ఒక కొడుకున్ను ఒక కూతురున్ను కలిగియుండిరి. కుమారుడు సుందరుడు, కూతురు అంత చక్కనిది కాదు.

ఒకదినమున ఆట్లాడు సమయమందు వీరిద్దరు అద్దములో తమ ముఖములు చూచుకొనిరి. చిన్నవాడు తన సౌందర్యమును చూచి బహు సంతోషించి, "నావలె సుందరముగా నుండుటకు నీకు ఇష్టములేదా" అని తన సహోదరితో అనెను.

వాని సహోదరి ఏడ్చుచు తండ్రివద్దకు వెళ్లి, తన సోదరుడు అద్దములో తన ముఖమును చూడకుండేలాగున చేయుమని ఆయనను వేడుకొనెను.

తండ్రి ఆ చిన్నదాన్ని ఓదార్చి ముద్దుపెట్టుకొని, దాని సోదరుని కూడా తన దగ్గిరకు పిలిచి వారితో చెప్పినదేమంటే—

"ఓ నా ముద్దుబిడ్డలారా! మీరిద్దరు ప్రతిదినము అద్దములో మీ ముఖములు చూచుకొనవచ్చును. నా కుమారుడా! నీ ముఖము సుందరముగా నున్నదని నీవు అనుకొంటివా! దుర్గుణమువల్ల గాని చెడ్డనడత వల్లగాని దానిని వికారపరచవద్దు. ఓ అమ్మా! ఈ నీ చక్కదనములో లోపమున్నట్టయితే నీ సుగుణములచేతనున్ను చక్కని బుద్ధిచేతనున్ను కమ్ముదల చేసుకొనుము."

"మనుష్యుడు పయి ఆకారమును చూచుచున్నాడు; దేవుడైతే హృదయము కనిపెట్టుచున్నాడు." (1 సమూయేలు, 16: 7.)



## ౯ పాఠము.

### విధేయతను గురించి.

పిల్లలకు నేర్పవలసిన సంగతులలో విధేయత మొట్టమొదటిది. ఇది లేకపోతే చేయు ప్రయత్నములన్నియు నిరర్థకములైపోవును. చెప్పి

నది చేయుటకు పిల్లలకు ఏ విధముగా నేర్పవలయును? నేర్పెడి పద్ధతి బహు సులభమైనది; నిరర్థకములైన ఆజ్ఞలను పిల్లలకు ఎప్పుడున్ను ఇవ్వవద్దు. అట్టి తల్లులు తమ పిల్లలకు ఏదైనా చేయుమని విధించున ప్పుడు, ముందుగానే బాగుగా ఆలోచింపవలసినది. మరిన్ని ఆజ్ఞను ఇచ్చినమీద పిల్లలు దానిని నెరవేర్చునట్లు చేయవలసినది.

ఒకప్పుడు ఒక దొర వర్షము కురియుచున్నందున ఒకరియింటికి వెళ్లెను. ఆరుగురు మోట మొగపిల్లలు తమ తండ్రితో ఆ దొర మాట్లా డుచుండగా, ఆయనమాట వినపడకుండునట్లు అల్లరి చేయుచుండిరి. అంతట "పిల్లలారా! అల్లరి చేయకుడని" తండ్రి కేకలువేసి చెప్పెను. వారు వర్షధ్వనికి ఎంత జడిసిరో తండ్రిమాటకున్ను అంతగా భయ పడిరి; (అనగా భయపడలేదు.) వెంబడే "పిల్లలారా! ఊరకుండుడి, లేక పోతే మీరు జీవించుట ఎంత నిశ్చయమో అంత నిశ్చయముగా మిమ్మును కొట్టుదును" అని తండ్రి కోపముతో కేకలువేసెను కాని, పిల్లలు ఇటువంటి వట్టిబెదిరింపులు అనేకములు ఇదివరకు వినియున్నం దున, యథాప్రకారముగా అల్లరి చేయసాగిరి.

తుదకు తండ్రి "ఈ వైపుననున్న పిల్లలలో నా పిల్లలు అతిమూ ర్ఖులు. నేను చెప్పినదానిని వినేటట్టు నేను చేయలేను" అని ఈ దొర గారితో అనెను.

తిన్నగా విచారించి చూచితే ఈ పిల్లలతండ్రి బహు వివేకశూన్యు డుగా కనుపించుచున్నాడు. ఎందుకంటే, తన చేతనైనంత మట్టుకు వారికి అవిధేయతను నేర్పుచుండెను. వారిచేత చేయించుటకు ఇష్టము లేని ఆజ్ఞలను తాను వారికి ఇచ్చుచుండెను. అది వారు బాగా తెలు సుకొనిరి.

పిల్లలు చిన్నప్పటినుంచి విధేయత గలవారై యుండునట్టు వారికి నేర్పవలసినది. కొంతమంది తలిదండ్రులు తమ పిల్లలకు విధేయత నేర్పు టకు ఈడు రాలేదని అందురు. సాధారణముగా అట్టివారు తరువాత వారికి ఈ బుద్ధి నేర్పుటకు కాలము మించిపోయినది అని పశ్చాత్తప్తు లగుదురు. ఇకను ఆ పిల్లలు తాము చెప్పినమాటలు బొత్తిగా వినరు.

కొద్ది మాసములు ఈడు కలిగిన శిశువునకున్ను, దానితల్లి ఇష్టప్రకారము జరిగించునట్టు దానికి నేర్పవచ్చును; నేర్పుటకు ఇదే మంచి సమయము.



## ౧౦ పాఠము.

### గృహోపకరణములను గురించి.

| | | |
|---|---|---|
| గృహోపకరణములు. | - | "గృహ" ఇంటిసంబంధులగు. |
| "ఉపకరణములు." | - | పనిముట్లు. |
| ఇత్యాదికములు. | - - | ఇటువంటివి మొదలుగలవి. |
| ఆసీనించుచున్నారు. | - | కూర్చుండుచున్నారు. |
| ద్రవద్రవ్యములు. | - - | స్రవించెడి, కారెడి వస్తువులు. |

ఇంటిలోనుండే బల్లలు, దీపస్తంభములు, పాత్రలు మొదలైనవి గృహోపకరణము లనబడును. కొయ్య, లోహములు, రాగిటిమన్ను, దూది మొదలగు పదార్థములతో ఈ గృహోపకరణములు చేయబడును.

బల్లలు, కుర్చీలు, మంచములు, పెట్టెలు ఇత్యాదికములు కొయ్యతో చేయబడుచున్నవి. కుర్చీలమీదనున్ను పీఠములమీదనున్ను ఆసీనించుచున్నాము. బల్లలు వస్తువులుంచుటకు ఉపయోగించును; అన్ని ఇండ్లలో మంచములు ఉండవలసినది. నేల పరచిన చాపలమీద నిద్రపోతే చలిన్ని, జ్వరమున్ను, వాయువునొప్పులున్ను వచ్చును; అట్లు నిద్రపోవువారిని పాములు కరుచును, జెఱ్ఱులు కుట్టును.

తరుచుగా వాడుకొనే కుండలున్ను, పింగాణులున్ను, అనేక విధములగు మన్నులచేత కుమ్మరవారు చేయుదురు. కుమ్మరవాడు ఒక పాత్ర చేయునప్పుడు, ఇంత రాగిటిమట్టి ముద్దతీసి గుండ్రటిచక్రము మధ్యను ఉంచి దానిని గిరగిర తిప్పును. అది తిరుగుచున్నప్పుడు ఆ ముద్దలో వాడు తన వేళ్లుపెట్టి వానికి ఇష్టమువచ్చిన రూపము గలదానినిగా దానిని చేసును. అది ఎండినప్పుడు దానిని ఆవములో

వేసి కాల్చుదురు. చిప్పలు మంచి తెల్లనిజిగట మట్టితో చేయబడును. అద్దము ఇసుకతోనైనను చెకిముకిరాతితోనైనను ఒక తరహా ఉప్పుతోనైనను చేయబడుచున్నది.

కుండలు దాకలు మొదలైనవి సులభముగా బద్దలవును. ఇత్తడి పాత్రలు ఒకప్పుడు వాడుకచేయబడును. వాటిని తోమకుండా ఉంచినట్టయితే వాటికి పచ్చనిచిలుము పట్టును; అది విషము. ఇత్తడిబిందెలు మొదలైనవాటిని ఎప్పుడున్ను శుభ్రముగా తోమవలసినది. వాటిలో ద్రవద్రవ్యములు చాలాసేపు ఉండనివ్వకూడదు. పారలు ఇనుముతో చేయబడుచున్నవి. ప్రశస్తములైన కత్తులను ఉక్కుతో చేయుదురు. ఇనుము రాక్షసిబొగ్గు పెగ తాకినందువల్ల ఉక్కు అవును. దూదితో కొన్ని సమయములయందు పరుపులు చేయుదురు.

## ౧౧ పాఠము.

### మంచి వెలగల నగలనుగురించి.

బాహ్యశోభ. - - - బయిట చక్కదనము, పైసొగసు.
ఆభరణములు. - - - అలంకారములు, సొమ్ములు.
తుచ్ఛములైనవి. - - - నీచములైనవి.

అనేకమంది స్త్రీలు సొగసైన బట్టలయందున్ను సొమ్ములయందున్ను మిక్కిలి ఆశగలవారై యుందురు. బీదలైన స్త్రీలు గాజుతోనున్ను ఇత్తడితోనున్ను చేసిన కడియములు (మొదలయినవి) ధరించుకొందురు. కొంచెము ఆస్తిగలవారు వెండిసొమ్ములు పెట్టుకొందురు. భాగ్యవంతులు బంగారపు నగలతో శరీరమంతను అలంకరించుకొందురు. బుద్ధిహీనులైన స్త్రీలు వారి బైటవేషమునుగురించే ఆలోచింతురుగాని, మరి దేనినిగురించి అంత శ్రద్ధచేయరు. నెమళ్లవలె బాహ్యశోభ కలిగియుందురు. ఇంగ్లాండుదేశపు రాణిగారు ఈ దేశపు భాగ్యవంతులగు స్త్రీలవలె గంపెడు సొమ్ములు పెట్టుకొని తిరుగరు. చిన్నపిల్లలవంటివారే

ఇటువంటి ఆభరణములను చూచి ఆనందింతురు. చిన్నపిల్లలకు సొమ్ములుపెట్టుట మంచిది కాదు. ఎందుకంటే, ప్రతి సంవత్సరము కొంతమంది పిల్లలు నగలవిషయమై చంపబడుట కద్దు.

స్త్రీలు ఒకరిసొమ్ము ఒకరికి చూపించుటకు ఇచ్ఛయింతురు. ఘనత గలదియున్ను భాగ్యవంతురాలున్ను అయిన ఒక రోమాదొరసానిని నీ భూషణములు చూపించుమని అడిగిరి. ఆమె తన కొమాళ్లవైపు చూచి, "వీరే నా సొమ్ములు" అని చెప్పెను. ఆమె ఇటువంటి తుచ్ఛములైన వాటినిగురించి లక్ష్యపెట్టక, తన పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పి వారిని యోగ్యులనుగా చేసెను. రోమపురిలో ఆమె కొమాళ్లు మిక్కిలి కీర్తిమంతులైరి. యోగ్యురాలైన వారితల్లి అటువంటి ప్రసిద్ధులయిన కొమాళ్లను కనుటవల్ల, రోమపురిలోనుండే తల్లులందరికంటే మిక్కిలి శ్రేష్ఠురాలని ఎంచబడెను. పట్టుచీరలకంటెనున్ను, బంగారపు కంకణములకంటెనున్ను, ముత్యాల హారములకంటెనున్ను, రవల ఉంగరములకంటెనున్ను, మిక్కిలి సుందరములైనటువంటివిన్ని అన్యాలంకారములు గలవు. వాటిని ఎవరూ దొంగిలించ లేరు; చనిపోయినప్పుడు శరీరముమీదనుంచి ఈ లౌకికాలంకారములను తీసివేసినప్పటికిన్ని వాటిని తీసివేయ లేరు; అవి నిత్యముగా నుండును.

"స్త్రీలు జడ అల్లిన వెంట్రుకలతోనైనా, బంగారముతోనైనా, ముత్యములతోనైనా, విలువ కలిగిన వస్త్రములతోనైనా, కాక, తిన్నటి వస్త్రముతోనున్ను, సిగ్గుతోనున్ను, శాంతముతోనున్ను, దైవభక్తి గల వారికి తగిన మంచి క్రియలతోనున్ను, తమ్మును తాము అలంకరించుకొనవలసినదని" అపొస్తలుడైన పౌలు చెప్పుచున్నాడు.

"దేవుని దృష్టికి మిక్కిలి గొప్పదైనటువంటివిన్ని, శాంతముతోనున్ను అణకువతోనున్ను కూడుకొనినటువంటివిన్ని, ఆత్మ యనే భూషణమునే స్త్రీలు ధరించుకొనుటకు యత్నము చేయవలసినద"ని అపొస్తలుడైన పేతురు చెప్పుచున్నాడు.

స్త్రీలు ఎడ్డెతనముగానుండక పరిశుభ్రముగా ఉండవలసినది; నగలు ఎంతమాత్రము ధరించుకొన కూడదని బైబిలులో ఎక్కడనూ చెప్ప

బడియుండలేదు. అయితే వాటిమీదనే ఎప్పుడు మనస్సు ఉంచు కొనకూడదు. ఇంతకంటె మిగుల శ్రేష్ఠమైన దానినిగురించి ఆలోచించు చుండవలసినది.

## ౧౨ పాఠము.

వ్యత్యాసముగానుండే ఇండ్లనుగురించి.

ప్రకాశమానము. - - - మెరయుచున్నది.
దండెము. - - - - - - కఱ్ఱ.
గృహిణి. - - - - - - భార్య.
గృహనిర్వాహకత్వము. - - ఇంటిపనులు నెరవేర్చుట.

నాతోకూడా బుచ్చమ్మ ఇంటికి రా, దాని చుట్టునుండు కోరడికి కంతలు లేక అది గట్టిగానున్నది; దొడ్డి బాగుగా ఊడ్చినారు. చెత్త ఒకమూల పోగుచేసి ఉంచక, అది కంటికి కనుబడకుండగా పారవేసినారు. ఆ ఇంటి గోడలున్ను నేలయున్ను పరిశుభ్రముగానున్ను నున్నగానున్ను ఉన్నవి; దాని కప్పు బాగుగానున్నది. ఆ కప్పు చివరలు సొగసుగా కత్తిరించినారు. సాలీడుగూళ్లు ఎక్కడను లేవు; ఆ యింటిలోపల ఎక్కడ ఉండవలసిన వస్తువులు అక్కడనే ఉన్నవి. వంట సామగ్రి ఉండవలసినచోటున నున్నది. ఇత్తడిచెంబులు, పళ్లెములు మొదలయినవి పరిశుభ్రముగానున్ను ప్రకాశమానమైనవిగానున్ను ఉన్నవి. ప్రతిదినమున వాడుకొను బట్టలు జాగ్రతగా ఒక దండెముమీద వేయబడినవి. తక్కినవి ఒక చక్కని పెట్టిలో ఉంచబడినవి. ఆ పెట్టెను దినదినమునా తుడిచెదరు; కుటుంబపు బైబిలునున్ను ఇంకా కొన్ని పుస్తకములనున్ను ఒక అలుమారులో చక్కగా ఉంచినారు.

వెంకమ్మ ఇంటిలో ఎట్లు ఉన్నది! వాకిటిలోకి వెళ్లుటతోనే లోపల పిల్లలు అన్నముకొనము కేకలువేయడమున్ను, తల్లి వార్గిని కూకలువేయ్యుటయున్ను వినబడును. దొడ్డినిండా ముళ్లున్ను చెత్తయున్ను ఉన్నది; నేలను ఊడ్వలేదు. ఇంటినిండా గుంటలు చాలా ఉన్నవి.

ఇంటిగోడ ఒక వైపున పడిపోయినది; కప్పులో కురుస్తుంది. వంటపాత్రలు ఇక్కడ కొన్ని అక్కడ కొన్ని ఉన్నవి. నూతిలో ఒకటి రెండు పాతతట్టలు పడియున్నవి.

పైని ఉదాహరింపబడిన ఇండ్లకు ఇంత భేదము కలుగుటకు ముఖ్య కారణమేమి? గృహిణులయొక్క స్వభావమే ముఖ్యకారణము.

చదువుకొనిన స్త్రీలు గృహనిర్వాహకత్వమందు ఇతరులను మించుటకు యత్నము చేయవలసినది. వారు తమరు విద్య నేర్చుకొనుటవల్ల తమ గృహములను బాగుగా నిర్వహించువారున్ను బుద్ధిమంతులయిన భార్యలున్ను యోగ్యులయిన తల్లులున్ను అయియున్నారని తమ క్రియలవల్ల చూపింపవలసినది.

## ౧౩ పాఠము.

### బైబిలు అను వేదగ్రంథమునుగురించి.

వాత్సల్యము. - - - పెద్దలకు చిన్నలయందుండు ప్రేమ.
సుందరము. - - - సొగసైనది.
దూత. - - - - - వార్త చెప్పేవాడు.
అధ్యాయము. - - - గ్రంథభాగము.

వాత్సల్యము గలిగినటువంటిన్ని, వివేకి అయినటువంటిన్ని, తండ్రి తన పిల్లలను విడిచిపెట్టి దూరదేశమునకు వెళ్లినప్పుడు, వారి నడత విషయమై మంచి బుద్ధులు చెప్పి, తరుచుగా వారికి ఉత్తరములు వ్రాయును. ఆ పిల్లలు తండ్రిమాట విని, ఆయనయందు ప్రేమ ఉంచితే, ఆయన వ్రాసిన ఉత్తరములను చాలా పర్యాయములు చదువుకొని, ఆయన చెప్పినట్టు చేయనుద్యోగింతురు. వారి తండ్రి, వారున్ను తానున్ను ఎల్లప్పుడు సంతోషముతో నివసించుటకు ఒక సుందరమయిన రాజనగరును కట్టించుచున్నానని వారితో చెప్పితే, వారు ఎంతగా సంతోషింతురు? ఆ గృహమునకు వెళ్లుటకు ఎంతో ఆశ గలవారై యుందురు.

మనకు ఇద్దరు తండ్రులు కలరు. ఒకడు భూలోకపు తండ్రి; మరి యొకడు పరలోకపు తండ్రి. మనము మన పరలోకపు తండ్రిని ఎప్పుడును చూడలేదు గాని, ఆయన మనలను ప్రేమించి మనకు ఎల్లప్పుడును మేలు చేయుచున్నాడు. మనకు కలిగియున్నది యావత్తు ఆయన కలుగచేసినదే. మనము నివసించే భూమిన్ని ఆ భూమియందుండే అంతయున్ను ఆయనవే. మనము ఆయనవల్లనే జీవించుచున్నాము. మనము ఆయన మాట విని, ఆయనను ప్రేమించే పిల్లలమై యుంటే, పరలోకమందుండే ఆయన రాజనగరుకు మనలను తీసుకొని వెళ్లుటకు మరణమే దూతయై యుండును.

మన పరలోకపు తండ్రి తననుగురించినటువంటివిన్ని, మన నడతను గురించినటువంటివిన్ని, మన పరలోకపు గృహమును గురించినటువంటివిన్ని, అనేకములైన ఉత్తరములు మనకు పంపించియున్నాడు. అవి అన్నియు బైబిలు అను గ్రంథమందు కనుబడుచున్నవి. దేవునివాక్యము ప్రేమతో మనము చదువవలసినది. మనము దానిని ప్రతిదినమున్ను చదివి, దాని సంగతులను ఆలోచింపుచు పరిశుద్ధాత్మ సహాయమువలన అది చెప్పే ఆజ్ఞలప్రకారము నడుచుకొనుటకు ప్రయత్నము చేయవలయును. ప్రతి దినమందు ఉదయకాలమున పాత నిబంధనలో ఒక అధ్యాయమున్ను, ప్రతి సాయంకాలమున క్రొత్తనిబంధనలో ఒక అధ్యాయమున్ను చదువుము. సాయంకాలమువరకు ఒకటి రెండు వచనములనుగురించి ధ్యానించితే బాగుగనుండును.

ఎల్లప్పుడు ప్రార్థన పూర్వకముగా బైబిల్ మనము చదువవలసినది. "నేను నీ వాక్యమునందు ఆశ్చర్యకరములైన సంగతులను చూచునట్లు నీవు నా నేత్రములను తెరువుము" అని చెప్పుము.



# ౧౪ పాఠము.

## పిల్లలకు ఏడ్పు నేర్పుటనుగురించి.

మకురుతనము. - - - మూర్ఖత్వము.
భక్ష్యములు. - - - పిండివంటలు.
నయితము. - - - - కూడను.

కొంతమంది పిల్లలు ఎల్లప్పుడు ఏడ్చుచు మకురుతనము చేయు చున్నారు; తల్లులే వారికి అట్లు నేర్పుదురు.

ఒక చిన్నపిల్లకు నీళ్లు పోయవలసివచ్చును. అట్లు పోయుట ఆ పిల్ల లకే మంచిది గాని దానికి ఎంతమాత్రము జబ్బులేదు. అయినప్పటికి మొట్టమొదట పిల్లకు ఇష్టము ఉండదు, గనుక ఏడ్వనారంభించును. బుద్ధిహీనురాలయిన తల్లి పిల్లకు నీళ్లు పోయుట మాని దానిచేతులో ఏమయినను పెట్టును.

ఒక తల్లి భక్ష్యములు వండెను; ఆమె కొడుకు వచ్చి, "దానిలో కొంచెము నాకు పెట్టుము"ని అడిగెను. "అబ్బాయీ! మాట్లాడక ఊరకుండుము, నీకు నేను పెట్టను" అని తల్లి అనెను. "నాకు అది కావలెను" అని పిల్లవాడు మరీ గట్టిగా అడిగెను. "నీకు నేను బొత్తిగా ఇవ్వను పో వెళ్లి ఆడుకొనుము" అని తల్లి చెప్పెను. ఆ పిల్లవాడు "ఏడ్చి నాకు కొంచెము పెట్టితేనేగాని వల్లకాదనెను." "ఈ పిల్లవాడు మిక్కిలి చెడ్డవాడు;" "నీకు నేను ఇవ్వనన్నవస్తువు తిరిగీ అడగకూ డదని ఇదివరకు ఇరువై పర్యాయములు చెప్పలేదా?" అని తల్లి కేకలువే సెను. "నాకు కొంచెము పెట్టుము"ని ఆ పిల్లవాడు పూర్వముకంటె మరీ ఎక్కువగా ఏడ్చెను. "ఇదిగో! ఇది తీసుకొని లేచిపో, ఇకను ఏడ్వకుము; ఇటువంటి పిల్లవానిని నేను ఎప్పుడును చూడలేదు" అని తల్లి అనెను.

"మీరు ఏడిస్తే మీకు కావలసినది దొరకున"ని తల్లులు పిల్లలకు నేర్పుచున్నారు.

తల్లి పిల్లకు నీళ్లు పోయుచున్నప్పుడు, అది ఏడ్చినప్పటికీ మానక దానిని బుజ్జగించి మెల్లమెల్లగా నీళ్లు పోయవలసినది. కొన్నిసారులు

ఈ చొప్పున జరిగినమీదట, ఆ పిల్ల ఏడ్చుట వ్యర్థమని అనుకొని, ఓరి మితో నీళ్లుపోయించుకొని పోసుకొనేటప్పుడు ఆడుకొనను సయితము ఆడుకొనును.

పిల్ల ఏడ్చినంతమాత్రముతోనే కావలసినది ఇవ్వక, ఇంకొక రీతిగా దానిని సంతోషపెట్టుము.

## ౧౫ పాఠము.

### పుష్పమువల్ల కలిగెడు లాభమునుగురించి.

శృంగారము. - - - - సొగసు.
నేత్రానందము. - - నేత్రములకు సంతోషమును చేయునది.
ఆదుర్దా. - - - - తొందర.

కొన్ని గులాబిపువ్వులున్ను ఇంకా కొన్ని ఇతర పుష్పములున్ను ఉంటే, ఇల్లు శృంగారముగా ఉండును. భూమి మంచిదయితే కొన్ని పువ్వులచెట్లు వేయింపవలసినది. పెద్ద పట్టణములలోను సయితము తొట్లలో మంచి పెంటమన్ను పోయించి పువ్వులచెట్లు వేయింపవచ్చును.

పుష్పములు నేత్రానందమును కలుగచేయునవే కాకుండా మనకు లాభకరములైన అనేక సంగతులను బోధించును.

గులాబిపుష్పము "నేను షెరానులో ఉండే గులాబిపుష్పమున్ను, కొండకనుమలలో పుట్టే తెల్లనిపుష్పమునున్ను అయి యున్నా"నని చెప్పే ఆయననుగురించి మనకు జ్ఞాపకము చేయుచున్నది. దేవుని పిల్లలు బట్టలు లేవని ఆదుర్దాపడియుంటే, ఈక్రిందవచ్చే మాటలను జ్ఞాపకము చేసుకొనవలసినది. అవి ఏవంటే, "పొలములో ఉండే పుష్పములు ఎంత శృంగారముగా నున్నవో చూడండి; అవి పనిచేయవు, వడకనూ వడకవు. కాబట్టి ఓ అల్పవిశ్వాసులారా! ఈ దినమునుండి రేపు పొయిలో వేయబడేటటువంటి గడ్డినే దేవుడు అంత చక్కగా ఉండేటట్టు చేస్తే, వాటికంటే ఎక్కువవారైన మీకు అంతకంటె ఎక్కువగా దయచేయునుగదా!" (మత్తై, 6: 28—30.)

పువ్వులు వాడి కిందపడిపోవుట మనము చూచేటప్పుడు, "సకల మనుష్యులు గడ్డివంటివారు; మనుష్యుని మహిమ గడ్డిపుష్పమువలె ఉన్నది. గడ్డి ఎండి దానిపువ్వులు రాలిపోవును కాని, దేవుని వాక్యము ఎప్పటికి నిలుచును" అనే మాటనుగురించి మనము ఆలోచించుకొనవలసినది. (1 పేతురు, 1: 24, 25.)

మనము క్రీస్తుతో కలసి ఉండుటకు యత్నముచేయుదము. ఎందుకంటే, "నేను ద్రాక్షచెట్టును, మీరు కొమ్మలు, ఎవడయినా నాయందున్ను నేను వానియందున్ను నిలిచియుంటే వాడే చాలాఫలములు ఫలించును. నావల్ల కాక మీరు ఏమిన్ని చేయలేరు." "ఎవరయినా నాయందు నిలువకపోతే, వారు తీగెవలె బయిట పారవేయబడి ఎండిపోదురు. అప్పుడు మనుష్యులు ఆ తీగెలను పోగుచేసి అగ్నిలో పడవేసెదరు; గనుక అవి కాలిపోవును" అని ఆయన సెలవిచ్చెను. (యోహాను, 15: 5, 6.)



# రెండవనెల.

## ౧౬ పాఠము.

### ఒంటెనుగురించిన కథ.

| | | |
|---|---|---|
| జోగుట. | - - - | తూలుట, ఊగుట. |
| యావచ్ఛరీరము. | - | శరీరమంతయు. |
| చొప్పించెను. | - - | ప్రవేశపెట్టెను. |
| ఆచారము. | - - | ప్రవర్తనము. |
| ఉద్యోగించి. | - - | యత్నించి. |
| ఆరంభము. | - - | మొదలు. |

యవనదేశస్థులు ఒక కథ చెప్పుదురు. అది ఏదనిన, ఒకడు ఒక దినమున తన గుడారములో పండుకొని నిద్రపోవుచుండగా, ఒక ఒంట్టె పిట్ట వచ్చి ఆ గుడారములో తన ముట్టెను పెట్టుటవల్ల వాడు ఉలికి

పడెను. "బయిట చాలా చలివేయుచున్నది; నా ముట్టెను మాత్రమే లోపల పెట్టుకొనియెదను" అని ఈ ఒంటె అనెను. వీడు మేధకుడు అయినందుననున్ను, నిద్రచేత జోగుచుండుటవల్లనున్ను, ముట్టెను లోపల పెట్టనిచ్చెను. కొంతసేపటికి "నా మెడనుకూడా లోపల పెట్టనిమ్మ"ని లొట్టిపిట్ట అనెను; తక్షణమే దీనికి వాడు సెలవు ఇచ్చెను. అటు తరువాత అది దాని ముందరకాళ్లు లోపల పెట్టుకొనుటకు సెలవును పొందెను. ఈలాగున క్రమక్రమముగా కొంచెము కొంచెముగానే యావచ్ఛరీరమును లోపటికి చొప్పించెను.

ఈ మనుష్యునికి వెంటనే తన స్నేహితునివల్ల తొందర కలిగెను. (అది ఎట్లంటే) దీనికిన్ని వీనికిన్ని ఆ గుడారము చాలకపోయెను. గనుక వీడు లొట్టిపిట్టతో మొరబెట్టుకొనినప్పుడు, "నీకు ఇక్కడ ఉండుటకు ఇష్టములేకపోతే నీవు లేచిపోవచ్చును. నేను ఇక్కడనే ఉందును" అని లొట్టిపిట్ట ప్రత్యుత్తరమిచ్చెను.

ఈ లొట్టిపిట్టవలెనే చిన్నపెద్దల హృదయములలో ప్రవేశించుటకు యత్నించే అనేకములున్నవి. ఒక చెడ్డ ఆచారమైనా ఒక పాపమైనా హృదయపు వాకిటిదగ్గిరకు మెల్లగా వచ్చి, "నన్ను లోపలికి రానిమ్మ"ని చెప్పినట్టయితే, మనము అక్రమము చేయనుద్యోగించి "ఇది బహు స్వల్పమైనది, ఈ పర్యాయమే" అని చెప్పుకొనుటకు ప్రయత్నపడుదము. కాబట్టి ప్రతి దురభ్యాసము ఆరంభమునందు స్వల్పముగా ఉండి తెలియకుండా ఆత్మలో చేరును; మాటిమాటికి అది శోధించుటవల్ల దానికి బలము కలుగును. ఈ రీతిని క్రమముగా ప్రతి దురభ్యాసము ఒకటి తరువాత ఒకటి హృదయమున చొచ్చి, దానియందుండు మంచితలంపులను వెళ్లగొట్టి, ఆ మనుష్యుని పాపమునకు అప్రుడయిన సేవకునిగా చేసును.

మీరు ఏమిచేయవలసినది? పాపముచేయక ఉండునట్టు జాగ్రతగా నుండి ప్రార్థించండి. పాపమును ఆరంభమునందే ఎదిరించి, మీ హృదయ ద్వారమును కాచుకొనండి; ఇట్లు చేసితే మీకు ఏ కీడు సంభవించదు. ఇది మీరు చేయుటకు దేవుని సహాయమును కోరండి.



## ౧౭ పాఠము.

### కుట్టుటనున్ను ఉతుకుటనున్ను గురించి.

ఆటివచ్చును. - - - - చాలి ఉండును.

వ్రయము. - - - - వినియోగము, కర్చు, సెలవు.

రోమకూపము. - - - - రోమపుకుదుళ్లు.

నిరర్థకము. - - - - వ్యర్థము.

ధనికులు. - - - - - భాగ్యవంతులు.

ప్రతి స్త్రీయున్ను కుట్టుటకు సమర్థురాలై యుండవలెను. "తరుణమందు కుట్టినకుట్టు తొమ్మిది కుట్లు లేకుండా చేసును" అనే ఇంగ్లీషు సామెత కలదు. బట్టలు కొద్దిగా చిరిగినప్పుడు తత్క్షణమే కుట్టకపోతే మరింత చిరుగును. చిరిగినప్పుడే కుట్టితే చాలా శ్రమ కలుగదు. కుట్టు నేర్చిన తల్లి తన పిల్లలబట్టలను ముచ్చటగా నుంచును. బట్టలు తిన్నగా కుట్టినట్టైతే చాలాకాలమువరకు ఆటివచ్చును. గనుక దానికి అయ్యే వ్రయము స్వల్పముగా నుండును. ఇంగ్లాండుదేశమందు పెక్కుమంది తల్లులు తమ కూతులకు కావలసిన బట్టలన్నిటిని కుట్టుదురు. ఈ విధమున దర్జీలకు అయ్యే కూలి ఇచ్చుటకు తగులుబడి లేకుండా చేసుకొందురు. హిందూదేశమందుండు తల్లులు నయితము ఈ రీతినే చేసితే ఎంత బాగా ఉండును! ఈ దేశమందు పిల్లలు (శరీరమందు) బట్టలు, ఉండీ ఉండనట్టు తిరుగుదురు. మర్యాదనుపట్టి విచారిస్తే వారికి తగిన బట్టలు ఉండవలసినదే; గనుక పిల్లలందరున్ను కుట్టు నేర్చుకొనవలసినది.

బట్టలు త్వరగా మాయును. శరీరమందుండు యావద్రోమకూపములవల్లనున్ను చెమట బయలుదేరును; ఇది విషమున్ను నిరర్థకమున్ను. ఈ చెమట బట్టలకు అంటును. అప్పుడు వాటిని విడిచి ఉతకకపోతే ఈ విషపుదార్థము కొద్దిగా శరీరములోకి పోవును. దీనివల్ల జాడ్యము సంభవించును; గనుక చర్మమును అంటుకొనియుండు వస్త్రములు తరుచుగా ఉతకవలసినది. పైన వేసుకొను బట్టలు దుమ్ముచేత మాసిపోవును.

శుభ్రమైన బట్టలు వేసుకొనువాడు మురికిబట్టలు కట్టుకొనువానికంటె, ఎక్కువ మర్యాద గలవాడుగానున్ను ఆరోగ్యము గలవాడుగానున్ను కనుపడును. ఈ దేశమునందు వెర్రి కులాచారములవల్ల, ముఖ్యముగా చాకలవాండ్రుమాత్రమే బట్టలు ఉతకవలసినది. గనుక బీదలు, చాకల వాండ్రకు జీతము ఇచ్చుటకు శక్తిలేకపోవుటచేత, తరుచుగా మాసిన బట్టలనే ధరించుకొందురు. ఇంగ్లాండు దేశమునందున్ను, ఇంకా ఇతర దేశములందున్ను, కుటుంబవంతులు ధనికులు కాకపోతే, తల్లులే ఇంటి బట్టలు అన్నియు ఉతుకుకొందురు. ఈ విధమున ఇంటివారందరు శుభ్రముగానున్ను చక్కగానున్ను కనుపడుదురు. ఇట్టి పద్ధతి హిందూదేశము నందున్ను కొనసాగితే మిక్కిలి బాగుగనుండును. తల్లి తన పిల్లలబట్టలు ఉతికితే అది దానికి అవమానకరము కాదు. ఆమె ఉతుకుటకు శక్తి కలిగియున్నప్పటికీ, తన పిల్లలు మాసినబట్టలు వేసుకొని వెళ్లితే, అప్పుడు అదే ఆమెకు సిగ్గు కలుగచేసును.



## ౧౫ పాఠము.

మనము ఎవరిని ఆరాధించవలెను అనుదానిని గురించి.

| | |
|---|---|
| అర్పణ. - - - - - - | ఇచ్చుట. |
| జనకతండ్రి.- - - - - - | కన్నతండ్రి. |
| సేవించుట.- - - - - - | కొలుచుట, ఆరాధించుట. |
| పాషాణము. - - - - - - | రాయి, శిల. |
| మృత్తిక. - . - - - - | మన్ను. |
| ప్రధానపురుషుడు. - - - | మంత్రిజనుడు. |
| నిషేధింపబడుట. - - - | ఆటంకపెట్టబడుట. |

ఈ దేశప్రజలు అనేకులగు స్త్రీ పురుష దేవతలకు మ్రొక్కి అర్పణాలను అర్పించుదురు; మనము ఎవరిని ఆరాధించవలెను.

భూమియందు తండ్రులు మీకు ఎందరు? ఒకడే గదా. మీరు మీ జనకతండ్రిని విడిచి, పరాయీలైనటువంటివిన్ని దుర్మార్గులైనటువంటివిన్ని మనుష్యులను తండ్రులని పిలిచితే, అట్టి నడత యుక్తముగా

నుండునా? నిశ్చయముగా కాదు, మనకు భూసంబంధియగు తండ్రి ఒక్కడే ఉన్నట్టు మహోన్నతుడున్ను, సృష్టికర్తయున్ను, అన్నిటికి ప్రభువున్ను అయినటువంటి పరలోకపుతండ్రి ఒక్కడే మనకు కలడు; మనలను బ్రతికించుచున్నవాడు ఆయనే. ఆయన సహాయము మనకు లేకపోతే తక్షణమే మనము చచ్చిపోదుము. మనకు ఉన్న ప్రతిమంచి వస్తువు ఆయనవల్ల కలుగుచున్నది; గనుక ఆయనను మాత్రమే మనము సేవింప వలసినది.

పిల్లలు ఆడుకొనునప్పుడు చిన్నరాళ్లుగాని మట్టిగడ్డలనుగాని తెచ్చి, వాటిని పురుషులనిన్ని స్త్రీలనిన్ని గుర్రములనిన్ని పిలుచుదురు. అదే ప్రకారముగా మనుష్యులు లోహములతోనున్ను, పాషాణములతోనున్ను, మృత్తికతోనున్ను విగ్రహములను చేసి, వాటికి స్త్రీ పురుష దేవతలని పేర్లు పెట్టుదురు కాని, విష్ణువు, శివుడు అనేవారు లేనే లేరు. ఒకడే దేవుడున్నాడు; తక్కినవి మూగబొమ్మలై యున్నవి. భూరాజులకు అనేక ప్రధాన పురుషులతో పని కలిగి యుండును. ఎందుకంటె రాజులు ఒక స్థలమందు ఉందురు; గనుక ఇతర స్థలముల వ్యాపారములను తాము చక్కబెట్టలేరు; అయితే దేవుడు సర్వవ్యాపి.

ఎటువంటి విగ్రహమును పూజించినను అది పాపమే. నిజమైన దేవుని జ్ఞాపకముంచుకొన గలందులకై, విగ్రహములను చేయకుండా మనము నిషేధింపబడ్డాము. ఒక కుమారుడు తన తండ్రిని జ్ఞాపకమందు ఉంచుకొనుటకు ఒక దృష్టిబొమ్మను చేసుకొంటే, అతనితండ్రి ఆ పనిని చూచి సంతోషించునా?

మీకు సహాయములు చేసి కష్టములనుంచి మిమ్మును తప్పించలేని మూగబొమ్మలకు మీరు ఎప్పుడున్ను మ్రొక్కకుడి. నిజమైన మీ పరలోకపుతండ్రిని మాత్రమే ప్రార్థించుడి; “మీ దేవుడైన ప్రభువును ఆరాధించి, ఆయనను మాత్రమే సేవింపవలెను” అనే మాట జ్ఞాపకము చేసికొనుడి.



# ౧౮ పాఠము.

## పిల్లలను మెచ్చుటను గురించి శిక్షించుటను గురించి.

| | |
|---|---|
| వివేకహీనుడు. | జ్ఞానహీనుడు, తెలివిలేనివాడు. |
| గారాబము. | గౌరవము, ప్రేమవిశేషము. |
| కృతఘ్నుడు. | చేసిన ఉపకారమును మరిచినవాడు. |
| బెదిరించుట. | భయపెట్టుట. |
| ఉల్లాసము. | సంతోషము. |
| ప్రసక్తి. | అక్కర, పని. |
| ఉద్యోగించుట. | యత్నించుట. |

పిల్లలు తప్పుచేసినప్పుడు వారిని శిక్షింపవలసినది. ఏలయి అను యాయన "తన కుమారులు దుర్మార్గులై యున్నప్పుడు, వారిని శిక్షింప నందుకు" దేవుడు కోపగించెను. అయినప్పటికి పిల్లలను తొందరపడి కోపముతో కొట్టకూడదు. పిల్లలు తమ తలిదండ్రులు తమ్మును కొట్టి నప్పుడు వారికి వ్యసనము కలుగుననిన్ని, వారు తమ మంచికే కొట్టు దురనిన్ని గ్రహింపవలసినది.

కొంతమంది వివేకహీనులైన తలిదండ్రులు తమ పిల్లలయందు గారాబముచేత వారిని దండింపరు. అట్లు కృతఘ్నులయి చెడిపోయిన పిల్లలు తమ దుష్ప్రవర్తనమువల్లనున్ను, కృతఘ్నతవల్లనున్ను, తమ తలి దండ్రులకు ముసలితనమందు బహు దుఃఖము కలుగచేయుటచేత, ఆ దుఃఖమువల్ల వారు చనిపోదురు. "నీ కుమారుని తప్పు దిద్దుము, అప్పు డు వాడు నీకు విశ్రాంతిని కలుగచేయును. నిశ్చయముగా నీ ఆత్మకు కూడా సంతోషమును పుట్టించును" అని బైబిలులో చెప్పబడి యు న్నది.

కాని బహు తరుచుగా శిక్షింపకూడదు; తలిదండ్రులు తమ పిల్లల నడతయందు తప్పులు పలుమారు వెతుకుచు ఉండకూడదు. పిల్లను కొ ట్టుట అంత అగత్యము కాదు; ఇంతకంటే సులభమైన శిక్షలు ఉన్నవి. గట్టిగా శిక్షించుట కాదుగాని, శిక్షించుదురు అను నిశ్చయము పిల్ల లకు భయమును కలుగచేసును! ఒట్టిబెదిరింపులు ఎప్పుడున్ను కూడవు.

అబద్ధములవల్ల పిల్లలను భయపెట్టవద్దు. కొంతమంది తలిదండ్రులు "ఇదుగో! పులి వచ్చుచున్నది అనిన్ని" ఎవరో వచ్చి వారిని ఎత్తుకొని పోదురు అనిన్ని చెప్పుదురు; ఇది పాపము. ఇందువల్ల పిల్లలకు తమ తండ్రులయందు అపనమ్మకము పుట్టును.

పిల్లలు మనఃపూర్వకముగా తప్పు చేయకపోతే వారిని శిక్షింప కూడదు.

పిల్లలు యుక్తముగా ప్రవర్తించినట్టయితే, మీరు సంతోషింతురని వారికి తెలియచేయుడి; ఇందువల్ల వారికి అధికోల్లాసము పుట్టును

జాగ్రతగల తల్లి తన యుక్తివల్ల చాలాపర్యాయములు శిక్షింపదు; ఆమె తన పిల్లలు పోట్లాడనుద్యోగించిరేని, హాని కలగని ఏదోయొక రీతిని వారిని సంతోషపెట్టును.

## ౨౦ పాఠము.

### ఆహారమును గురించి.

| | |
|---|---|
| పదార్థభాగము. - - - | వస్తువుయొక్క అంశము. |
| ఘృతము. - - - - - | నెయ్యి. |
| కుక్షి. - - - - - | కడుపు. |
| అస్థిమయము. - - - | ఎముకలసంబంధి యగునది. |

మన శరీరము ఎదుగుటకు మనకు ఆహారము కావలెను. మనము తిను పదార్థభాగములు వేరువేరు పనులకు ఉపయోగించును. ఎట్లంటే, ఉదకము తినినది యావత్తున్ను కరుగునట్లు చేసి రక్తములో ముఖ్యభాగమగును; పంచదారెయున్ను ఘృతమున్ను వెట్ట పుట్టించును. శరీరములకు వెట్టబుట్టుటకు మన కుక్షియందు కొంచెము జఠరాగ్ని యున్నది ఆహారములో కొంత భాగము వంటచెరుకుగా పరిణమించుచున్నది. ఆహారములో మరికొంత భాగము మాంసమగుచున్నది. గోధుములున్ను మాంసమున్ను తినువారు అన్నముమాత్రము తినువారికంటె ఎక్కువ బలము కలిగియుందురు. మనము తినుదానిలో స్వల్పభాగము శల్యములగును.

పాలయందు మనకు కావలసిన అన్నివిధముల ఆహారమున్నది. అది యెట్లంటే, నూరుపాళ్ల పాలలో ౮౭-పాళ్లు ఉదకము, ౫-పాళ్లు మీగడ, ౫-పాళ్లు పాలలోనుండు పంచదార, ౩-పాళ్లు వెన్నపదార్థము, ౧-పాలు లోహపదార్థము అయ్యున్నవి. మీగడవల్ల మాంసపుష్టి కలుగును; పంచదారయున్ను వెన్నయున్ను వెట్టను వృద్ధిచేసును; కొవ్వునైను పుట్టించును. ఒక పాలు లోహపదార్థము ఉప్పునున్ను అస్థిమయమైన పదార్థమునున్ను కలుగచేసును.

పంచదారయున్ను వెన్నయున్ను కండను వృద్ధిచేయును; వీటినిమాత్రము మనము తినినట్టయితే త్వరగానే చచ్చెదము. బటానీలున్ను, పప్పున్ను, గోధుములున్ను, జొన్నయున్ను, మాంసమున్ను, బలమైన పదార్థములున్ను, మాంసమును వృద్ధిచేయునవిన్ని అయి యున్నవి. రక్తములో ఎఱ్ఱతనము ఇనుమువల్ల పుట్టును; ఒక దొర తనశరీరమునుండి తీయబడిన రక్తమునందుండు ఇనుమువల్ల ఉంగరమును చేయించుకొనెను. ఎముకలలో సున్నముండును; రక్తము కొంచెము ఉప్పగా నుండును.

మనుష్యశరీరము సుమారు ౧౫౦-పౌనులు ఎత్తు తూగును; వీటిలో ౧౧౩-పౌనులు ఉదకమున్ను, ౨౧-పౌనులు మాంసమున్ను, ౬-పౌనులు కొవ్వున్ను, ౧౦-పౌనులు అస్థిమయమైన పదార్థమున్ను ఉండును.



## ౨౧ పాఠము.

### చాడీలు చెప్పుటను గురించి.

| | |
|---|---|
| ఆర్యవచనము. - - - - | పండితభాషణము. |
| అపవాదము. - - - - - | నింద్య దోషారోపణము. |
| అనిమిత్తకార్యము. - - - | కారణములేని పని. |
| వ్యసనపడుట. - - - - | దుఃఖపడుట. |
| కప్పుదలచేయుట. - - - | కప్పివేయుట. |
| ఆరోపించుట. - - - | నిందమోపుట. |

"ముఖము యెదుట చెప్ప నిష్టము లేనిదాన్ని వెనుక చెప్పవద్దు" అను ఆర్యవచనము మిక్కిలి మంచిది. ఈ వచనప్రకారము నడుచు

కొనినను, అనేకములగు కీడుచేయు సంగతులు వచింపబడక యుండును. మీరు ఇతరులనుగురించి మాట్లాడునప్పుడు, వారు వినుటకు నిష్టములు గాని మాటలు పలుకుదురు కాని, మీరు చెప్పినవి వారికి తెలియకపోయి నప్పటికి, మీరు ఆడిన ప్రతిమాట దేవుడు వినును అనునది జ్ఞాపకముం చుకొనుడు. అయితే మనము ఇతరుల తప్పితములు గురించి మాట్లాడి నప్పుడు దేవుడు కోపపడునా? అవును; అది ఆయనకు ఇష్టముగా నుం డదు. ఎందుకంటే "సహోదరులారా! ఒకరినిగురించి ఒకరు నింద మోపకూడద"ని బైబిలులో వ్రాయబడి యున్నది. (యాకోబు, 4:11.)

సోమారులు తరుచుగా ఇతరులయందు అపవాదలు మోపుదురు. "మరియు వారు ఇంటింటికి తిరుగుచు సోమారులై వదరువారున్ను, అనిమిత్త కార్యములను మీదవేసుకొనువారున్ను అయి పలుకరాని మాటలు పలుకుదురు" అని పౌలు కొంతమంది స్త్రీలనుగురించి చెప్పెను.

మన ఇరుగు పొరుగువానిని మనము ప్రేమింపవలసిన రీతిని ప్రే మించితే, వాని తప్పితములకొరకు వ్యసనపడవలసినది. మనము వాటిని గురించి ఇతరులతో సంభాషించి, ప్రతివానికి వాటినిగురించి చేయు టకు బదులుగా కమ్మదల చేయుటకు యత్నింపవలయును. మనము పరలోకపుతండ్రిని పోలుటకు కోరినట్టయితే, తప్పితములు చేయువారి విషయమై దుఃఖపడవలసినది. వారిని మంచివారినిగా చేయుటకు యత్నింపవలసినది. అన్నిటికంటె ముఖ్యముగా వారి పాపములను క్షమించుమనిన్ని, వారి హృదయములను మళ్లించుమనిన్ని శ్రద్ధతో దేవుని ప్రార్థింపవలయును.

కొంతమంది ఇతరులయందు దోషము ఆరోపించినప్పుడు, "ఇది అంతయు సత్యము, దీనికి వారు తగియున్నారు" అని చెప్పి, తమయందు తప్పితము లేదని అందురు కాని, వారు తప్పితము చేసినవారైన ప్పటికి వాటినిగురించి అట్లు అనుట మంచిది కాదు. మీ తప్పితముల నుగురించి ఇతరులు సంభాషించుటకు మీరు అర్హులైనప్పటికి, వాటిని గురించి ఇతరులు ప్రసంగించుట మీకు ఇష్టముగా నుండునా? ఎవరైన అట్లు చేస్తితే, వారు మీయందు దయగలవారని అనుకొనుదురా?

మీ హృదయములు క్రోధ్యాహంకారమాత్సర్యబుద్ధులచే శూన్యములై ప్రేమతో నింపబడునట్టి వాటినిగా మార్చుమని దేవుని ప్రార్థింపుడు.

## ౨౨ పాఠము.

### టీకాలు పొడిపించుటను గురించినది.

| | |
|---|---|
| జనశూన్యములు. | మనుష్యులు లేనివి. |
| అంధత్వము. | గుడ్డితనము. |
| శరీర వికారము. | చెడిపోవుట. |
| వైద్యశాస్త్రజ్ఞుడు. | చికిత్స చేయువాడు. |
| రసము. | ద్రవము. |
| అప్రతిష్ఠ. | చెడువాడుక. |

మశూచికము మనుష్యులకు సంభవించు మిక్కిలి అసహ్యాకరములైనటువంటివిన్ని, మృత్యుకరములైనటువంటివిన్ని, వ్యాధులలో ఒకటి అయియున్నది. పూర్వకాలమందు దానివల్ల పట్టణములు ఒకానొకప్పుడు జనశూన్యములయ్యేవి. మరియు దానివల్ల మనుష్యజాతియందు నాలుగవ భాగమునకు అంధత్వమున్ను శరీర వికారమున్ను కలుగునవి.

సుమారు ౭౦ - సంవత్సరముల కిందట, ఆంగ్లేయ వైద్యశాస్త్రజ్ఞుడగు జన్నర్ అను ఆయన, కొన్ని సమయములందు ఆవులకు ఒక విధమైన పొక్కులు లేచినట్టున్ను, ఆ వ్యాధి వాటిని పాలుపితికిన వారికి వచ్చినట్టున్ను, ఇటువంటి పొక్కులు లేచినవారికి మశూచికబాధ కలగనట్లున్ను తెలుసుకొనెను. ఇంతేకాకుండా శరీరమందు కొద్దిగా చివ్వి, అక్కడ స్వల్పముగా ఈ రసము తగిలించుటచేత, ఒక మనుష్యుని (పొక్కురసము)వల్ల మరి ఒక మనుష్యునికి కూడా పొక్కులు లేచునని కనుక్కొనెను. ఈ సంగతి ఇట్టిదని గట్టిగా పరీక్షించి తెలుసుకొనినమీదట, బ్రిటానియా దొరతనమువారు జన్నర్ దొరగారికి 3-లక్షల రూపాయిలకు సరియైన బహుమతి చేసి, తెలుసుకొనిన

సంగతి ప్రపంచమంతటను ప్రచురము చేయుటకు ప్రయత్నము చేసిరి. మనుష్యులకు బాగుగా టీకాలువేసిన దేశములందు మశూచికము చాలామట్టుకు కనుపడదు.

ఈ దేశమందు దొరతనమువారు టీకాలు పొడుచువారిని నియమించిరి. వీరైతే పిల్లలు నాలుగైదు సంవత్సరముల ఈడు గలవారై యున్నప్పుడు, టీకాలు పొడిచినట్టయితే యుక్తముగా నుండును. ఇదే పళ్లు రాకమునుపు జరిగినపక్షమునకు మరియు మంచిది. అయితే ఎంత పెద్దవారున్ను టీకాలు పొడిపించుకొనవచ్చును. ఇది అజాగ్రతగా జరుగుటవల్ల దీనికి కొంతమట్టుకు అప్రతిష్ఠ వచ్చినది. కొన్ని సమయములలో మంచిరసము వాడుక చేయకపోవచ్చును; లేదా పొక్కు అయినా చితికిపోవచ్చును. టీకాలు క్రమముగా వేసిన పక్షమందు, ప్రజలు మిక్కిలి అరుదుగా మశూచికపడుదురు. కొందరు మాత్రము పడితే పడవచ్చును గాని ఈ వ్యాధి మిక్కిలి బాధపెట్టదు.

## ౨3 పాఠము.

మీకు ఎటువంటి హృదయము గలదనేదానిని గురించి.

| | | |
|---|---|---|
| నిజస్వభావము. | - - - | నైజము. |
| వర్చస్సు. | - - - - | కాంతి. |
| యత్నించుట. | - - - | ప్రయత్నపడుట. |
| దౌర్భాగ్యుడు. | - - - | అదృష్టహీనుడు. |

అనేకులు తమ బైట ఆకారమును గురించిన్ని, సౌందర్యమును గురించిన్ని, బట్టలను గురించిన్నిమాత్రమే ఆలోచింతురు. వారికి చక్కని ముఖమున్ను మంచి వస్త్రములున్ను ఉంటే, వారు బహుగా సంతోషించెదరు.

బైటివేషమును చూచి సంతోషించు జనులు వారి నిజస్వభావము హృదయమందు ఉన్నదనిన్ని, అందమైన శరీరముకంటె, యోగ్యమైన హృదయము కలిగియుండుట చాలా మంచిది అనిన్ని మరచిపోవుచు

న్నారు. దేవుడు మన ముఖవర్చస్సునున్ను వేషమునున్ను విచారింపడు. మన మంచి స్వభావములకు మూలమైనవి ఇవి కావు; ఇవి మనలను మంచివారినిగా చేయలేవు. మీకు ఎటువంటి హృదయము కలదు?

మనుష్యుడు దేవునిచేత మొదట సృజింపబడినప్పుడు, వాడు సంపూర్ణమైన పరిశుద్ధతయున్ను సౌఖ్యమున్ను గలవాడై యుండెను. చెడ్డ చెట్టు చెడుఫలములను ఇచ్చునట్లు ఆదిపురుషుడైన ఆదాము పాపము చేసినందున, ఆయన పిల్లలు అందరున్ను పాపపు హృదయము కలవారైరి. మన హృదయము మారువరకు అది ఎటువంటిదై యుండునో, దానిని గురించి బైబిలు తెలియచేయుచున్నది.

"హృదయము అన్నిటికంటె ఎక్కువగా మోసకరమైనదిన్ని మిక్కిలి చెడ్డదిన్ని అయియున్నది. దానిని ఎవరు తెలుసుకొనగలరు ?" (ఇర్మీయా, 17: 9.)

మన హృదయములు స్వభావముచేత దేవునిన్ని మనుష్యునిన్ని ప్రేమింపవు. ఒకప్పుడు పిల్లలు తమ తల్లులను సయితము కొట్టుటకు యత్నించెదరు.

మనలనుగురించి ఎవరును జాగ్రత్తచేయకపోతే, అంతకంతకు మనము మిక్కిలి దుర్మార్గులమై పోదుము. ఇహ పరలోకములందు ఎప్పటికిన్ని మనము దౌర్భాగ్యులమై యుండవలసినదే. అయితే మన హృదయములు మార్చబడవచ్చును. "ఎవడైనను క్రీస్తునందు ఉన్నట్టయితే, వాడు నూతన పురుషుడగును. పూర్వపువి అన్నియు పోయి అన్నియు క్రొత్తగా కనుపడును." (2 కొరింథి, 5: 17.)

"మీకు నూతన హృదయమును దయచేసి, నూతన ఆత్మను మీలో నేను ఉంచుదును." (యెహెజ్కేలు, 36: 26.)

ఈ నూతన హృదయమును మీకు ఇమ్మని దేవుని వేడుకొనుడి.



# ౨౪ పాఠము.

## యథార్థమును గురించి, నిష్కాపట్యమును గురించి.

అసత్యవాక్కు. - - కల్లలాడువాడు, అబద్ధములాడువాడు.

అనృతము. - - - అసత్యము.

కపటోపాయము. - - మోసపుచ్చే సాధనము.

వినియోగించుట. - పనికివచ్చుట.

కల్లరులు. - - - బొంకులమారులు.

నెపము. - - - కపటము.

వ్యాకులపడుట - - విచారపడుట.

పిల్లలు చేయు తప్పులలో అబద్ధము చెప్పుటకంటె సులభమైన తప్పు లేదు. ఈ దేశములో అనేకులు అబద్ధములు ఆడితే నష్టము కలుగదనిన్ని, ముఖ్యముగా ఎవరికి హాని రాకుండునట్లు చెప్పితే మరి మంచిది అనిన్ని తలంచెదరు; ఇది మంచిది కాదు. ఎందు విషయ మయిన్ని అసత్యము చెప్పకూడదు; అసత్యవాక్కులు పిశాచపు పిల్లలు; దేవుడు సత్యమును ప్రేమించి అనృతమును అసహించుకొనును. "అనృత వాక్కులు అందరు అగ్నిమయమైన మడుగులో పడద్రోయబడుదురు" అని ఆయన చెప్పుచున్నాడు.

తలిదండ్రులు ఎప్పుడున్ను పిల్లలను మోసపుచ్చకూడదు. తల్లి తన పిల్ల మందు పుచ్చుకొనవలసి వచ్చినప్పుడు, అది బహుమంచి మందు అని చెప్పకూడదు; అట్లు చెప్పితే ఆ పిల్ల తల్లిని నమ్మదు. కపటోపాయము ఒకసారి పనికివచ్చును గాని తరువాత వినియోగింపదు. ఒక పిల్ల తాను తినగూడినదానిని అడిగితే కుక్క తినిపోయినదనిన్ని, ఒక వస్తువు ఉన్నప్పటికి లేదనిన్ని ఎప్పుడును చెప్పకూడదు. పిల్లలను భయ పెట్టుటకు అబద్ధములు చెప్పకూడదని చెప్పితిమి. పిల్లలు తెలుసుకొన కూడని సంగతులు అడిగితే, "మీరు పెద్దవారైనప్పుడు వీటిని నేర్చు కొనియెదరు" అని వారితో మీరు చెప్పవలసినదే కాని మోసపుచ్చ గూడదు.

పిల్ల ఎప్పుడున్ను సత్యము మాట్లాడునట్లు చేయవలసినది. దేవుడు తనను చూచుచున్నాడనిన్ని, తాను అబద్ధములు ఆడినప్పుడు ఆయన కోపపడుననిన్ని, వానికి చిన్నతనమందున నేర్పవలసినది. ఎవడైనను తప్పితముచేసి దానిని దాచుటకు అబద్ధము చెప్పితే, వాడు రెండు తప్పులు చేయుచున్నాడు అని ఆ పిల్లకు తెలియచెప్పవలసినది. పిల్ల తప్పితముచేసి ఒప్పుకొనినప్పుడు దానిని విస్తారము శిక్షింప కూడదు.

ఒకవేళ పిల్లలు పింగాణులు మొదలైనవి బద్దలు కొట్టినప్పుడు, మీరు కోపముతో వారిని అడిగితే వారు అబద్ధములు ఆడుదురు. వారిని ఇది "నీవు చేసినావా" అని అడగక, ఇంకొక విధమున కనుగొన ప్రయత్నము చేయవలసినది. పిల్లనే పిలిచి అడగవలసియుంటే నిమ్మళముగా అడగవలసినది.

చేతనైనంత మట్టుకు పిల్లలను నమ్ముడి, పిల్ల ఇంతకు పూర్వము అబద్ధము చెప్పకపోతే దాని మాటను గురించి సందేహింపవద్దు. సందేహపడవలసి యుంటే, వెంటనే పిల్లవానిని కల్లరినిగా ఎంచక తగిన విచారణ చేయవలసినది.

కల్లరులు ఎప్పుడున్ను దాగియుండలేరని పిల్లలకు నేర్పుడు. యీ వస్తు సంగతి తెలియుపర్యంతము ఒక అబద్ధమును దాచుటకొరకు మరి యొక అబద్ధము ఆడుదురు. అబద్ధము ఆడు నాలుక క్షణమాత్రము నిలుచును. సత్యముచెప్పుట ఘనమైనకార్యమనిన్ని, అబద్ధమాడుట నీచమైనదనిన్ని వారు గ్రహించునట్లు చేయుడు. పిల్లలు తమమీద తప్పు లేదని చెప్పి ఇతరులమీద నెపము మోపుదురు. ఇట్లు చేయకుండా వారు వారి తప్పులను ధారాళముగా ఒప్పుకొనునట్లు వారికి నేర్పుడు.

వారు అబద్ధములు ఆడి మోసపుచ్చుటకు యత్నించితే మీరు అందు విషయమై మిక్కిలి వ్యాకులపడుచున్నట్టు కనుపడుడి. దేవునివలె వారు కూడా నిజస్థులై యుండునటుల వారికి బోధింపుడు.



## ౨౫ పాఠము.

### పాకోపకరణ ద్రవ్యములను గురించి.

| | |
|---|---|
| పాకోపకరణము. - - - | వంటకు సాధనద్రవ్యము. |
| సుగంధవస్తువులు - - | యోగ్యమైన పరిమళముగల పదార్థములు. |
| చవ్వగా. - - - - - - | రుచిలేక. |
| సంభారము. - - - | వస్తుసామగ్రి, మసాలా. |
| ప్రధానములు. - - - | ముఖ్యములు. |

పాకోపకరణద్రవ్యములు అనునవి ఆహారమును అరుగునట్లు చేసి ఆకలి పుట్టించు ద్రవ్యములై యున్నవి. ముఖ్యముగా వాడుకొనునవి ఉప్పు, చిరక, యాలకులు మొదలైన సుగంధవస్తువులు.

ఉప్పు శరీరసౌఖ్యమునకు అగత్యమైయున్నది. సముద్రోదకమును ఎండబెట్టినయెడల ఉప్పు విస్తారముగా దొరుకును. ఇది ప్రపంచములో అనేకస్థలములందు భూమిలోను దొరుకును.

చిరక పుల్లగా నుండును. ద్రాక్షసారాయిని ఇంకొకమారు పులిసి పొంగనిచ్చుటవల్ల శ్రేష్ఠమైన చిరక కలుగును. ఈ దేశమునందు కల్లువల్ల చిరక చేసెదరు; మసాలా ఆహారమునకు రుచి పుట్టించును. ఇది లేకపోతే అది చవ్వగా నుండును. అనేక విధములగు మిరియాలు సర్వసాధారణముగా సంభారమునకు పనికివచ్చును. లవంగాలు ఒక విధమైన చెట్టుయొక్క మొగ్గలు. దాచినచెక్క ఒకచెట్టు బెరడు; సింహళమందు ఈ పదార్థము మిక్కుటముగా ఫలించుచున్నందున, దానికి దాచినచెక్కలంక అని పేరు. జాజికాయలు ఒక చెట్టుయొక్క విత్తులు; వీటి పైబెరడుకు జాపత్రి అని పేరు; శొంఠి ఒకమొక్కయొక్క వేరు. యాలక్కాయలు ఈ దేశముయొక్క పశ్చిమభాగమందున్ను, ఇంకా కొన్ని ఇతర ప్రదేశములందును ఉండు ఒక చెట్టుయొక్క కాయలై యున్నవి.

ఈ సుగంధద్రవ్యములన్ని కాకప్రదేశములందు మాత్రము మొలుచును. ఇంగ్లాండు దేశమందు ఇవి లేవు కాని, వర్తకులు ఈ వస్తువులను శీతప్రదేశములకు పంపి, ఆ దేశములనుండి ఇతరములైన సరుకులను తెప్పించుకొనియెదరు. ఈ సుగంధవస్తువులు మిక్కిలి విలువకలిగి యున్నందుననున్ను, చిన్నవైనందుననున్ను, దూరదేశములనుండి తెప్పించుకొను సరుకులలో ప్రధానములై యున్నవి.

ఆవాలు ఇంగ్లాండులోనున్ను పుట్టును; వాటిని అక్కడ మసాలాకు ఉపయోగించెదరు. హిందుస్థానమునందు కొన్ని ప్రదేశములందు ఈ చెట్లను విస్తారముగా వేసి, ఆవగింజలవల్ల నూనె తీసెదరు.



## ౨౮ పాఠము.

### గయ్యాళి స్త్రీలను గురించి.

| | |
|---|---|
| దుస్సంభాషణ. - - - | చెడుమాటలు. |
| బహిరంగపరచుట. - - | ప్రకటనచేయుట. |
| స్వాధీనము. - - - | లోపరుచుకొనుట. |
| భర్త. - - - - - | పెనిమిటి. |
| అనురాగము. - - - | ప్రేమ. |
| అహంకారము. - - - | గర్వము. |
| కటిసూక్తులు. - - | సంతోషమును కలుగ చేయుని మాటలు. |
| తద్ది. - - - - - | అల్లరి. |
| ఈర్ష్య. - - - - | సహింపకపోవుట. |

స్త్రీలు తిట్లాడునప్పుడు మిక్కిలి లజ్జాహీనులయిన్ని దుర్మార్గులయిన్ని ప్రవర్తించుదురు. హీనకులస్థులున్ను లజ్జావిహీనులునైన స్త్రీలు వాకిళ్లలో నిలుచుండి, వినరాని దుస్సంభాషణ చేయుదురు. అట్టివారు తప్పెట వాయించి తెలియచేయునట్టుగా తమ దుష్ప్రవర్తనమును బహిరంగపరుచుదురు. వారి నిజస్వభావము చుట్టుపట్లవారికి తెలిసినందున,

వారు వారిని చూస్తే అసహించుకొందురు. దుస్సంభాషణము చేయుట అవివేకమున్ను దుర్మార్గమున్ను అయియున్నది. ఆ సంభాషణము నెత్తి మీద నిప్పులను పోసికొనినట్లు ఉండును.

అనేక స్త్రీలు తమ పొరుగువారిని బహిరంగముగా తిట్టక మర్యాదవంతులుగా కనుపించినప్పటికి, నాలుకలు స్వాధీనములు చేసుకొనలేక ఇతరులకు తొందర కలుగచేయుదురు.

ఒక చక్కనిపడుచు తన భర్త తన్ను కొట్టి తిట్టినాడని తన తండ్రితో మొరపెట్టుకొనెను. ఆమె తండ్రి ఒక చిన్నబుడ్డిలో మందుపోసి తన పెనిమిటి కోపముగా ఉన్నప్పుడు, ఆ మందును నోటిలో ఉంచుకొని నవ్వుమని చెప్పెను. ఇది ఆమె చేసినప్పుడు ఆమె పెనిమిటి ఆమెయందు అనురాగము కలవాడాయెను. బుడ్డిలో మందు కాగానే ఆమె ఇంకా కొంచెము ఇమ్మని తండ్రిని అడిగెను. అప్పుడు తండ్రి నవ్వి ఆ మందు నీళ్లనే చెప్పెను. ఇంతకు లోగడ ఆమె తన అహంకారపు మాటలవల్ల పెనిమిటికి కోపము రప్పించినది, గనుక నీళ్లు నోటిలో ఉన్నప్పుడు ఆమె మాట్లాడలేక నవ్వినందున, పెనిమిటికి సంతోషము పుట్టి ఆమెను దయగా చూచేవాడు. ప్రేమకరములైన చూపులున్ను మాటలున్ను దుర్మార్గుడైన పెనిమిటికి తగిన మందు అయియుండును.

తిట్టకుండా ఉండుటే చాలదు; మనము అహంకారమును విసర్జించి, అపకారమునకు ఉపకారము చేయవలెను. "శపించువారిని ఆశీర్వదించుము."

"మృదువైన ఉత్తరము కోపమును పోగొట్టును; అయితే కఠినోక్తులు కోపమును రగిలించును." (సామితెలు, 15: 1.)

"సమస్తమైన అనిష్టములున్ను, కోపమున్ను, ఉగ్రతయున్ను, రద్దిచేయుటయున్ను, దూషణయున్ను, ఈర్ష్యయున్ను మీ వద్దనుండి తీసివేసి ఒకరికొకరు ఉపకారులై దయార్ద్రహృదయులై, దేవుడు క్రీస్తు నిమిత్తము మమ్మును క్షమించినట్టుగా అన్యోన్య సౌఖ్యానందమును గూర్చి ఒకరికొకరు క్షమించుడు." (ఎఫెసు, 4: 31, 32.)



## ౨౭ పాఠము.

### స్నా న ము ను గు రి ం చి.

ఒడలు. - - - శరీరము.
స్వస్థత. - - - నెమ్మది.
ప్రాప్తించుట. - - - లభించుట.

ఉదకముయొక్క ముఖ్యప్రయోజనము మనకు ఆరోగ్యమును విస్తరింపజేయుటే. ఒడలి చర్మము లక్షలకొలది రోమకూపములను చిన్న రంధ్రములతో కూడుకొని ఉన్నది. వాటివల్ల చెమటయున్ను శరీరమాలిన్యమున్ను వెలపటికి వచ్చును, మురికి ఈ రంధ్రములను మూసివేసును, గనుక ఈ మాలిన్యము కొంతమట్టుకు శరీరములోనే ఉండుటవల్ల ఆరోగ్యము తగ్గును. దినదినమున స్నానము చేయుటవల్ల ఈ రంధ్రపునోళ్లు విప్పుకొనినందున శరీరమాలిన్యము వెలుపలికి పోవును. స్నానము చేసిన తరువాత తడిబట్టలు ఒంటిమీద ఉంచుకొనకూడదు. ఒంటిని ముతకబట్టచేత బాగుగా తుడువవలసినది; భోజనము చేయగానే స్నానముచేసితే అన్నము అరగదు. స్నానము చేయునప్పుడు చలిగాలి తగలకూడదు. జ్వరబాధనుండి క్రమముగా స్వస్థత పొందువారు చాలాసేపు స్నానము చేయుటవల్ల జాడ్యము కొన్నివేళల తిరిగి ప్రాప్తించును.

ఒకడు వడదెబ్బ తగిలి పడిపోయినప్పుడు రెండు మూడు బిందెల చన్నీళ్లు వాని తలమీద పోయుట మంచిది. ఎవరైనను మూర్ఛచేత పడితే వానిని వెల్లికల పడుకోపెట్టి వాని ముఖముమీద కొంచెము చన్నీళ్లు కొట్టవలసినది. జ్వరమున్ను వాంతిభ్రాంతి సంకటమున్ను సంభవించినప్పుడు, రోగులకు కావలసినన్ని చన్నీళ్లు త్రాగుటకు ఇవ్వవలసినది.

జలుబు చేసినప్పుడు పండుకొనక పూర్వము పాదములు వేణ్ణీళ్లలో (కొంచెముసేపు) ఉంచుటవల్ల నిమ్మళమగును. అటుతరువాత మిగుల జాగ్రతతో శరీరమును వెచ్చగాను ఉంచవలసినది. చెమటపోసినప్పుడు చలిగాలి తగిలితే హాని సంభవించును.

పిల్లలకు పళ్లు వచ్చునప్పుడు చిన్నబిడ్డచేష్టలు కనుపించును. దీనికి తల తప్ప పిల్ల శరీరమునంతయు వేణ్ణీళ్లలో ఉంచుట మంచిదందురు. పిల్ల పట్టగలిగినంతమట్టుకు వేణ్ణీళ్లు పోయవలసినది; తలను ఎత్తి తడిగుడ్డతో చుట్టవలసినది. ఐదు నిమిషములు మొదలుకొని పది నిమిషములవరకు పిల్లను వేణ్ణీళ్లలో ఉంచవలసినది. సాధారణముగా చిట్లాముదము ఒక పర్యాయము ఇవ్వవలసినది. చిన్నబిడ్డ గుణమునకు మంచి ఆహారము పెట్టకపోవుటే ముఖ్యకారణము.



## ౨౮ పాఠము.

### రక్షకుని గురించి.

| | |
|---|---|
| ఉద్యుక్తుడు - - - | యత్నపడువాడు. |
| తలవరి. - - - - - | చంపువాడు. |
| అత్యాదరము. - - - . | మిక్కిలి ఆసక్తి. |
| కృతజ్ఞత. - - - - - | ఉపకారము తెలిసికొనుట. |
| దాక్షిణ్యము. - - - - | దయ. |
| విమోచించుట. - - - - | విడిపించుట. |

దుర్మార్గులైన మనుష్యులు నిన్ను చెరసాలలో వేసి చంపతలచినప్పుడు, ఎవడైనను ఒకడు నీకు బదులుగా చావనుద్యుక్తుడు కాకపోయిన పక్షమునకు నీవు ఏమిచేతువు! ఎట్టి స్నేహితుడున్ను నీ ప్రాణమునకు మారుగా తన ప్రాణమునిచ్చుటకు సహించడుగదా! కనుక నీవు చచ్చుటకు సిద్ధపడి యుండవలెను.

తలవర్రి, కత్తి చేతబట్టి నిన్ను సంహరించవచ్చునప్పుడు, ఒక అన్యుడు నీ దగ్గిరకు వచ్చి "నిన్ను నా ప్రాణమునిచ్చి రక్షిస్తాననిన్ని, ఇందుకు బదులుగా, నీవు నన్ను ప్రేమించవలసినదనిన్ని, నీవు ఇకమీదట నావా

డవు అయ్యున్నావనిన్ని, నేను ఇచ్చే ఆజ్ఞలకు నీవు లోబడవలసినద నిన్ని, నా ఆజ్ఞలు నీకు కష్టతరములై యుండక నీకు సౌఖ్యాభివృద్ధిని కలగచేసుననిన్ని" అత్యాదరముతో నీతో చెప్పినట్టయితే, అట్టి రక్ష కుని ఎడల నీవు కృతజ్ఞత కలవాడవై యుండి, ఆయన ఇష్టప్రకారము నడుచుకొనుటకు సంతోషింపకూడదా?

మనమందరమున్ను మనము చేసిన పాపములవలన చావుకు లోనై తిమి. దేవుని కుమారుడైన యేసు అధిక దాక్షిణ్యము గలవాడై ఇష్ట పడి, మనకు బదులుగా చనిపోవుటకు ఉద్యుక్తుడాయెను.

ఆయన మనలను విమోచించినది తన స్వీయజీవమువల్ల గాని డబ్బు వల్ల కాదు.

"వెండి బంగారములవలె నశించే పదార్థములవల్ల గాక, క్రీస్తుయొ క్క అమూల్యమైన రక్తమువల్ల మీరు విమోచింపబడితిరి."

యేసు మృతినొందినప్పటికిన్ని తిరిగి బ్రతికి ఇప్పుడు పరలోక మందున్నాడు. రక్షణ సంబంధమైన ఆయన దయగల పిలుపులను అంగీకరించి, మనము ఆయనవారమై యున్నామని ఎల్లప్పుడు జ్ఞాపక ముంచుకొనుదము.

"మీరు మీవాళ్లు కారు, ఎందుకంటే (యేసు) మిమ్మును వెలపెట్టి కొన్నాడు గనుక, దేవునివై యున్న మీ శరీరాత్మలచే ఆయనను మహి మపరచుడి." (1 కొరింథి, 6: 19, 20.)



## ౨౯ పాఠము.

### న్యాయ యథార్థములను గురించి.

దొరతనము. - - - ప్రభుత్వము.
ఎరువు. - - - - బదులు.
పక్షపాతము. - - - రెంటిలో ఒకదానియందు విశేషాసక్తి.
గాఢాంధకారము. - దట్టమగు చీకటి.

పిల్లలు న్యాయముగా ప్రవర్తించునట్లు వారికి చిన్నప్పటినుంచి నేర్పవలసినది. ఇతరులు తమ వస్తువులను తీసుకొనుట మంచిది కాదని తమరు ఎట్లు తలతురో, ఆచొప్పుననే వారున్ను తమది కాని దానిని తీసికొన కోరకూడదు. "నీవు దొంగిలించ కూడదు" అనేది దేవుని ఆజ్ఞ అని వారికి నేర్పుడు. తీసుకొనిన వస్తువు కొంచెము వెల కలదవిన్ని అది పోయినందున, వానికి విశేషనష్టము లేదనిన్ని చెప్పుట మంచిది కాదు. ఒక మామిడిపండును దొంగిలించినను, బంగారపు వగను దొంగిలించినను, దొంగతనమే. పిల్లలు తమ తలిదండ్రుల అనుమతి లేనిది వారి వస్తువులను తీసుకొన కూడదు. అనేకులగు దొంగలు ఈ రీతినే దొంగతనము ఆరంభించుదురు. ఒక మనుష్యుని మోసపుచ్చితే ఎంత తప్పో, దొరతనమువారికి కూడా ద్రోహము చేస్తే అంత తప్పు అని వారికి నేర్పుడి.

పిల్లలు, పోయినవస్తువులు తమకు దొరికితే వాటిని తమదగ్గిర ఉంచుకొనుట యుక్తమని తలంచెదరు. ఇది న్యాయము కాదని వారితో చెప్పుడి. తమరు ఒక రూపాయి పోగొట్టుకొనినయెడల, ఒకనికి ఆ రూపాయి దొరికితే అది ఆ పిల్లవానిదని వారు తలంచెదరా? పోయినవస్తువులు దొరికినప్పుడు, వాటి యజమానులను జాగ్రతగా వెతికి వారికి తిరిగి ఇవ్వవలసినది.

పిల్లలు ఒకరిదగ్గిరనుండి ఎరువు తెచ్చుకొనిన వస్తువులను చెరపకుండా తిరిగి ఇవ్వవలసినది. ఎరువు పుచ్చుకొనినవాటిలో ఏమయి

నను పోతే,దానికి బదులుగా మరియొక వస్తువును ఇవ్వవలసినది. ఆటలో నయితము ఎవరిని మోసపుచ్చ కూడదు.

తలిదండ్రులు తమ పిల్లలయెడల పక్షపాతము కలిగి ప్రవర్తించ కూడదు. అందరియెడల సమానభావము కలిగియుండవలసినది.

ఈ లోకములో నయితము మర్యాదప్రవర్తనము మిక్కిలి మంచిది. చాలామట్టుకు దొంగలను వెతికి పట్టుకొని శిక్షింతురు. అటుతరు వాత, వారిని ఎవరూ నమ్మనే నమ్మరు; వారికి ఉద్యోగములివ్వరు.

గాఢాంధకారమునందు దొంగిలినప్పటికి దేవుడు చూచును. తన ఆజ్ఞలను మీరినవారిని ఆయన భయంకరముగా శిక్షించును.

## ३० పాఠము.

### అనేక దేశస్థుల ఆహారమును గురించి.

| | |
|---|---|
| ఉష్ణప్రదేశము. - - | కాకభూమి. |
| శీతప్రదేశము. - - - | చలవభూమి. |
| మహాపాతకము. - - | గొప్పపాపము. |
| ఏహ్యము. - - - - | అరోచకము. |
| పట్టింపు. - - - | పూనిక. |

ఉష్ణప్రదేశములందు నివసించెడు జనులు ముఖ్యముగా కూరగాయలు తిని జీవింతురు. సమశీతోష్ణ ప్రదేశములందు విస్తారము మాంసము తిని బ్రతుకుదురు. మరీ శీతప్రదేశములందు ధాన్యమున్ను కూరగాయలున్ను పుట్టవు గనుక మాంసముమాత్రమే తినియెదరు.

ఇతర ధాన్యముకంటే వరి మిగుల ఉపయోగించుచున్నది. ఆసియాఖండముయొక్క ఆగ్నేయపు మూలవైపున ఉండు జనులు ముఖ్యముగా ఈ వరిధాన్యమునే భక్షించెదరు. గోధుములున్ను దాదాపుగా ఇంత ఉపయోగమైన పదార్థమే. ఉత్తర హిందుస్థానమందున్ను, ఐరోపాఖండమందున్ను, ఉత్తర అమెరికాయందున్ను చాలా

మట్టుకు గోధుములనే భక్షింతురు. 'గిడ్డజొన్నలున్ను మొక్కజొన్నలున్ను వీటివలెనే ఆహారమునకు పనికివచ్చును. చాలామట్టుకు పెండలము ఆఫ్రికాయందుండువారు తిందురు. బంగాళా దుంపలు యూరోపునందున్ను ఉత్తర అమెరికాయందున్ను విస్తరించును.

గొడ్డుమాంసమున్ను, గొర్రెమేకలమాంసమున్ను, పందిమాంసమున్ను, లేడిమాంసమున్ను, కోడిమాంసమున్ను, చేపలనున్ను విస్తారముగా తిందురు. చాలామంది హిందువులు గోమాంసము తినుట మహాపాతకమందురు. వేదములు వ్రాయబడునప్పుడు గొడ్డుమాంసము ధారాళముగా తినేవారు. సంస్కృతమందు భోజనమునకై పిలువబడిన వానికి గోఘ్నుడని పేరు, (అనగా) గో వధకు కారణమైనవాడు. తురకలు పందిమాంసము ఏహ్యమని తలంచెదరు. ఈ దేశమునందు పందులు అన్ని అరోచక వస్తువులను తినును, గనుక వాటి మాంసము మంచిది కాదు. చీనాదేశస్థులు పిల్లులను కుక్కలను తినుటయందు అపేక్ష గలవారు. పూర్వికులైన రోమపుర నివాసులు నత్తగుల్ల మిక్కిలి రుచి కలదని ఎంచేవారు. పరాసులు ఒక తరహా కప్పను తిందురు.

హిందువులు భోజనము చేయుటవిషయమయి మిగుల పట్టింపు చేసెదరు. ఎట్లంటే వారిలో అనేకులు ఇంగ్లాండుదేశపు రాణిగారితో కూడనైన కలసి భోజనము చేసినయెడల తమ కులము పోవుననిన్ని, ఇంకొక లోకమందు ఇందువిషయమై శిక్ష అనుభవింపవలసి వచ్చుననిన్ని తలంతురు. దీనికి వ్యతిరిక్తముగా "మాంసము తినుటవల్ల దేవుడు మనను మన్నించకపోడు; తింటే ఎక్కువ లేదు. తినకపోతే తక్కువ లేదు." "నోటిలోకి పోవునది మనుష్యులను అపవిత్రపరచదు అని బైబిలు చెప్పుచున్నది."



# మూ డ వ నె ల.

## ౩౧ పాఠము.

### శ కు న ము ను గు రిం చి.

రిత్త. - - - వ్యర్థము.
ఊహించుట. - - తలచుట.
జీవితకాలము. - - బ్రతుకునన్నాళ్లు.
శకునము. - - - మంచి చెడ్డలకు గుర్తు.

బుద్ధిహీనులు అనేకులు రిత్తభయమువల్ల తమ మనస్సులను దుఃఖపెట్టుకొందురు. సంవత్సరాదిమొదలుకొని సంవత్సరాంతమువరకు కొందరు స్త్రీలు కీడు వచ్చునని చెప్పుకొనుచుందురు; బల్లికూతవలన వారికి భయము పుట్టును. గుడ్లగూబ కూసినను కుక్క కడుపునొప్పివలన ఏడ్చినను చచ్చిపోదుమని వారు భయపడుదురు. ఇది అంతయు బుద్ధిహీనతవలన కలుగుచున్నది. బల్లి ముందువచ్చే సంగతులు చెప్పుటకు ఒక ప్రవక్త కాదు. దేవుడు బుద్ధికుశలత గలవానికి తెలియచేయని దానిని కుక్కకు తెలియచేయునని అనుకొనవచ్చునా?

కొందరు తమరు కన్న కలలవలన తమకు ఏమి సంభవించునో, అది చెప్పగలుగుదుమని ఊహించి వాటిని జాగ్రతగా విచారించెదరు. మనము భుజించిన ఆహారమువల్లనున్ను, పగటియందు మనము తలంచుకొనిన తలంపులవల్లనున్ను (రాత్రివేళ) కలలు వచ్చును. వాటికిన్ని ముందు జరుగబోవు సంగతులకున్ను ఏ సంబంధమున్ను లేదు.

కొంతమంది సోది అడుగుదురు. సోది చెప్పేవాండ్రు మోసపుచ్చుటవల్లనే సొమ్ము సంపాదించుకొందురు.

అనేకులు చీకటిలో దయ్యములను చూచెదమని భయపడుచున్నారు, ఒకడు రాత్రివేళ ఇంటికి వచ్చునపుడు, తనయెదుట తెల్లని

బట్టలు కట్టుకొనిన ఒక ఆకారమును చూచును. వాడు ధైర్యము తెచ్చుకొని దాని పరీక్షించి చూచితే అది తెల్లనిగాయి అయినను అవును; లేక చెట్టున వ్రేలాడే బట్ట అయినను అవును; లేకపోతే అటువంటి మరి ఏ వస్తువునైనను అవును కాని, వాడు భయపడి పారిపోయినపక్షమందు తన జీవితకాలమంతయు నిశ్చయముగా దయ్యమును చూచినాననే అనుకొనును.

శకునములు చూచుటయున్ను సోది అడుగుటయున్ను అవివేకమున్ను దుర్భాగ్యమున్ను అయ్యున్నది.

"ముసలిఅవ్వల పిచ్చికథలు వినక దైవభక్తియందు తాత్పర్యము కలవాడవై ఉండుము." (1 తిమొథెయు, 4: 7.)

## ౩౨ పాఠము.

### శు చి త్వ ము ను గు రిం చి.

సమర్థుడు. - - - - - శక్తుడు.
మాలిన్యము. - - - - మకిల.
అనర్థము. - - - - - కీడు.

"మురికి జాడ్యమునకు తల్లివంటిది" అను సామెత కలదు. వేలకొలది జనులు ప్రతిసంవత్సరము అశుచిత్వమువలన చనిపోవుదురు.

అనేక జంతువులు సహా తాము పరిశుద్ధముగా నుండుటకు యత్నించుచున్నవి. పక్షులు తమ రెక్కలను ముక్కులతో దువ్వుకొనుచున్నవి. పిల్లిబొచ్చు ఎంతో పరిశుభ్రముగానున్ను, నున్ననిదిగానున్ను ఉండును. ఒకానొకప్పుడు ఎలుక తూములలో దూరినప్పటికి, తన శరీరముమీద మురికి లేకుండాచేసికొనును. గనుక వీటికంటె ఎక్కువగా మనముకూడా పరిశుద్ధులముగా నుండుటకు యత్నింపవలయును.

పిల్లలు శుభ్రముగా నుండుటకున్ను మురికిగానుండుట అసహించుటకున్ను వారికి బాల్యమునుండి నేర్పవలసినది. వారట్లు చేయ సమర్థులు ఐనయెడల వారంతట వారే స్నానముచేసి తల దువ్వుకొనేటట్లు చేయ

వలసినది. మనము ప్రతిదినము స్నానముచేసినను మన బట్టలున్ను మాం చములున్ను మైలగానుంటే శుభ్రముగా ఉండలేము. శరీరమునుండి బయిలుదేరు మాలిన్యము బట్టలకు అంటుకొనును. ఈ విధమున మాలిన్యము అంటుకొనిన తలగడలు చాలామట్టుకు నల్లబడిపోవును. ఈ మురికివల్ల దేహసౌఖ్యము చెడును. తలగడలను గలీబులతో కప్పి వాటిని తరుచుగా ఉతికింపవలసినది. పరుపులు మొదలయినవాటిని అప్పుడప్పుడు ఎండవేయవలసినది.

పిల్లలు ఇంటి ఆవరణములో అరటిపండ్లతోళ్లైన, ఇంక ఏ చెత్తైన వేయకుండా వారికి ఆజ్ఞాపింపవలసినది. ఇంటికి కొంచెము దూరమున ఒక గుంట తవ్వి, దానిలోనైన ఒక కుండలోనైన యావత్తు చెత్త వేయవలసినది. ఆ కుండమీద మూతపెట్టవలసినది; పేడకుప్పలు ఇంటిదగ్గిర ఉండనివ్వకూడదు. దుర్వాసనవలన ఏదో ఒక అనర్థము సంభవించును. కంపుకొట్టే ఇంటిలో ఉండవద్దు.

ఇంటిదగ్గిర పల్లములోనుండు మురికినీళ్లవల్లనైనను మురికిగుంటవల్లనైనను రోగము వచ్చును.

## 33 పాఠము.

### వి వా హ వ స్త్ర ము ను గు రిం చి.

అంగీకృతులము. - - ఒప్పుకొనినవారము.
పుణ్యము. - - - సత్క్రియ, సుకృతము.

ఒక గొప్పరాజు తన ఏకకుమారుని పెళ్లినిమిత్తము విందు చేయించెను; ఆయన అందరిని విందుకు రమ్మని పిలిచెను. వారు విందుకు తగినవారైయుండుటకు తన కుమారునిపైన జరీబట్టలు వారిలో ప్రతివానికిచ్చెను. ఒకడు తనకు ఇచ్చిన మంచివస్త్రమును పుచ్చుకొనక, తాను వేసుకొనిన మురికిబట్టలే మంచివని అనుకొని లోపలికి వెళ్లి కూర్చుండెను.

రాజు విందుకు వచ్చినవారిని చూడవచ్చినప్పుడు, మురికివిన్ని చినిగి పోయినవిన్ని అయిన బట్టలు కట్టుకొనిన ఈ మనుష్యుని చూచెను. అప్పుడు ఆయన "స్నేహితుడా! వివాహవస్త్రము లేక లోపలికి ఎట్లు వచ్చితివి!" అని వానిని పిలిచి అడిగెను. అందుకు వాడు మాట్లాడలేక పోయెను. తరువాత ఆ రాజు "వీని కాలు సేతులు కట్టి బైట పడవేయండి" అని తన సేవకులవైపుకు తిరిగి చెప్పెను.

ఈ యుపమాన తాత్పర్యమేమి? దేవుడు మనలందరిని పరలోకమునకు రమ్మని పిలుచుచున్నాడు. మనము అక్కడికి ఎట్లు వెళ్లగలము? మన మంచిక్రియలనే వస్త్రము వేసికొని కాదు. ఎందుకంటే "మన నీతి మురికిగుడ్డలవలె ఉన్నది." అనగా ఉపమానమునందు చెప్పబడిన మనుష్యుడు ధరించుకొనిన చింపిరిగుడ్డలవలె ఉన్నది. మనము దేనివల్ల దేవునిచే నంగీకృతులమగుదుమో ఆటువంటి పుణ్యము కలదు; అది క్రీస్తు చేసిన పుణ్యము. "అది ఆయనను నమ్మినవారందరికి కలుగును." "నీవు కట్టుకొనడమునకు నా దగ్గిర తెల్లనివస్త్రము కొనుక్కొనుమని నీతో చెప్పుచున్నాను" అని దేవుడు అనుచున్నాడు. "ఏ వ్రయము లేకుండా దానిని మనము కొనవచ్చును?"



## ౩౮ పాఠము.

### మంచిస్వభావమును గురించి.

| | |
|---|---|
| మాడ్చుకొని. - - - | సంకోచింపచేసుకొని. |
| కోపావేశుడు. - - - | కోపమును పొందినవాడు. |
| ప్రవర్తించుట. - - - | నడుచుకొనుట. |
| సాధించలేకపోవుట. - | నెరవేర్చలేకపోవుట. |
| తటస్థులము. - - - | మధ్యస్థులము. |
| కలహకారణము. - - | పోట్లాడుటకు హేతువు. |

ఒక మనుష్యునియొక్క సుఖము వాని స్వభావమును అనుసరించియుండును; కొందరు ఎప్పుడు నవ్వుచుందురు! ఇతరులు ముఖము

మాద్చుకొని రవంతలో కోపావేశులగుదురు. ఎప్పుడు నవ్వువారు తాము సుఖవంతులైయుండుటయే కాకుండా, తమ ఎదుటనున్న వారికి కూడా సంతోషమును కలుగచేసెదరు. చిన్నవారికి మంచిస్వభావము పుట్టునట్లు చాలా ప్రయత్నములు చేయవచ్చును. కొందరు పెద్దలు పిల్లలయెడల మిక్కిలి క్రూరముగా ప్రవర్తించెదరు. వారి పిల్లలను ఏడ్పించి వారికి కోపము వచ్చినపుడు నవ్వుదురు. చిన్నవారు తమ్మును బాధపెట్టిన వారిని సాధింపలేక పోయినప్పటికి, క్రూరబుద్ధి గలవారై పెద్దవారైనప్పుడు తమ దగ్గిరనుండువారికి భయంకరులై యుండి, తమ తలిదండ్రులను సహితము కొట్టుదురు.

ఒక పిల్ల ఏమైనను అడిగినప్పుడు ఇచ్చెదము ఇవ్వము అని చెప్పవలసినది. మనము తటస్థులమై ఊరకుంటే అది తొందరపెట్టి అడుగుచుండును. ఇచ్చుటకు వల్లకాదని వెంటనే దయతోనున్ను దృఢముగానున్ను చెప్పిన పక్షమందు చాలా సంగతులలో తొందరపెట్టదు. ఒక వస్తువును పిల్ల అడిగినప్పుడు ఇవ్వకపోతే అది ఏడ్చునేమో అని తలచి, ఇవ్వకూడదు అని ఇంతకు పూర్వము చెప్పితిమి.

తల్లి తన పిల్లతో శాంతముతోనున్ను ప్రేమతోనున్ను మాటలాడిన పక్షమందు, సాధారణముగా పిల్లకూడా ఆ విధముగానే ప్రత్యుత్తరమిచ్చును. తల్లి కోపముతో మాట్లాడితే పిల్లకుకూడా ఆ స్వభావమే పట్టుబడును.

పిల్లలు తొందరపెట్టనారంభించినట్టయితే వారిని ఏదో ఒక విధమున ఆడింపవలసినది.

పిల్లలను పోట్లాడనివ్వకండి, వారిని వేరువేరుగా ఉంచనైన ఉంచవలసినది; లేక మాట్లాడక ఊరకుండుమని ఆజ్ఞాపించనైన ఆజ్ఞాపించవలసినది. అగత్యమైతే వారి కలహకారణము తరువాత విచారింపవచ్చును. తప్పయిన సరే, ఒప్పు అయిన సరే, వారు పోట్లాడకూడదని నేర్పుడు.

"ప్రేమ న్యాయప్రమాణము నెరవేర్చుట అయి యున్నది." కనికరించు స్వభావము పిల్లలకు పుట్టులాగున యావత్ప్రయత్నములు చేయవలసినది.



## 3౫ పాఠము.

### ధాన్యపు వెలను గురించి.

కొండెము. - - చాడీ.
లాభసాటి. - - - పైగావచ్చెడు సొమ్ముకు సరిగా.
హెచ్చుట. - - వృద్ధిపొందుట, పెరుగుట.

అనేకులు ధాన్యపువెల వడ్డివర్తకులను పట్టియుండునని అనుకొని, ధాన్యము ప్రియమైనప్పుడు వారిమీద కొండెములు చెప్పుదురు కాని, ధాన్యపు ధర పంటవృద్ధినిపట్టిన్ని పంట ఎండిపోవుటనుపట్టిన్ని ఎచ్చును తగ్గును. బాగుగా పండిన పక్షమందు ధర తగ్గును; పండకపోయిన యెడల వెల హెచ్చును.

వర్తకులు, చవకగా ఉన్నప్పుడు ధాన్యము కొని లాభసాటికి అమ్ము కొనే నిమిత్తము ప్రియమగువరకు నిలువచేతురు. దీనివల్ల జనులకు హాని ఏమియును సంభవింపదు. మరియు జనులు కరువు వచ్చినను చావకుండా ఉందురు. సరిగా పంట పండకపోయినప్పుడు జనులు ఎప్పటివలెనే తిన్నట్టయితే, ధాన్యము యావత్తు వ్రయమగుటవల్ల వారు ఆకలివల్ల చచ్చుదురు. ఎక్కువ ఖరీదువల్ల చాలా ధాన్యము కొనలేరు. ఈ విధముగా కొంత కష్టపడవలసి యున్నప్పటికి కరువు వచ్చినను చనిపోరు. వర్తకులు తమ లాభమునే వెతికినప్పటికి ప్రజోపకారులై యుంటున్నారు.

అన్ని పదార్థముల వలెనే సొమ్మున్ను వృద్ధిక్షయము ననుసరించి ఉండును. కొన్ని సంవత్సరములనుండి వెండి బంగారములను, దూది మొదలగు ఇంకా కొన్ని వస్తువులను కొనుటకు యూరోపునుండి హిందూదేశమునకు విశేషముగా పంపించుచున్నారు. కొంత కాలము వరకు ప్రతి సంవత్సరమున్ను ౨౦౦౦-బండ్ల వెండిన్ని ౮౦-బండ్ల బంగారమున్ను పొగ ఓడలమీద వేసి ఇక్కడికి పంపేవారు; గనుక వెండి బంగారములు వృద్ధియైనందున వాటి వెల తగ్గెను. పూర్వము రూపాయికి కొనిన ధాన్యములో ఇప్పుడు రూపాయికి సగము వచ్చును గనుక జీతములు హెచ్చినవి.



## ౩౬ పాఠము.

### శుభాశుభదినములను గురించి.

మృత్. - - - మన్ను.
పాషాణము. - - - శిల, రాయి.
గోళము. - - - గుండ్రటి బోలువస్తువు.
మహోన్నతుడు. - - మిక్కిలి గొప్పవాడు.
అచేతనములు. - - జ్ఞానహీనములు.

ఈ దేశములో చాలామంది కొన్ని దినములు శుభకరములనియు కొన్నిదినములు అశుభకరములనియు నమ్మెదరు. ఈ ఏర్పాటు గ్రహములవలన కలుగునని అనుకొనుదురు. గనుక వారు ఏ పనియు ఆరంభింపక పూర్వము గ్రహగతి తెలుసుకొనుటకు జ్యోతిశ్శాస్త్రజ్ఞులను, లేదా పంచాంగములను తెలిసికొనుదురు.

హిందువులు గ్రహములు దేవతలని ఊహించెదరు కాని, అవి నిజముగా మృత్పాషాణగోళములై యున్నవి. మనము నివసించు ప్రపంచము ఒక గ్రహము. ఒక గ్రామము దగ్గిరనున్న పెద్దరాయిగాని లేక పర్వతముగాని అందులో జరుగు సంగతులన్ను ఎంతగా నడిపించునో, అంతగా ఈ గ్రహములు ఈ ప్రపంచమునందు జరుగు సంగతులను నడిపించును.

కొన్నిదినములు మంచివనియు కొన్నిదినములు మంచివి కావనియు చెప్పుట యుక్తము కాదు. మహోన్నతుడైన దేవుడు దినములన్నిటిని సృష్టించెను. ఆయన అన్నిదినములయందును సమానమైన ప్రేమయు జ్ఞానము శక్తియు కలవాడు. ఆయన దినములన్నిటిని మంచిపనులకే కాని దుష్టమైన పనులకు సృష్టించలేదు. మనము మన పనులయందు లక్ష్యము ఉంచి జాగ్రతగా వాటిని చేయనుద్యోగించితే అన్నిదినములు శుభకరములే అగును.

ఇంగ్లీషువారు హిందువులకంటె ఎక్కువ సిరిసంపదలు కలవారు. దీనికి ఒక హేతువు ఏమంటె, వారు తెలివిహీనులైన జ్యోతిష్కులను మంచిదినములను గురించి అడుగక, తమకు దేవుడు దయచేసిన బుద్ధిని

పట్టి నడుచుదురు. హిందువులుకూడా ఆచొప్పున నడుచుకొనవలసినది కాని, ఇప్పుడు ఉన్నట్టుగా తమ పనులను ఆటంకపెట్టుకొని తాము శ్రమపడకూడదు.

ఇటువంటి దినములనుగురించి ఆలోచించుటవల్ల కలుగు గొప్ప అనర్థము ఏమంటే, దేవునికి విరుద్ధముగా పాపముచేయుటే. ఇట్లు జరిగించుట సృష్టికర్తకు బదులుగా సృష్టింపబడినటువంటి అచేతనములైన గ్రహములను దేవతలనుగా ఎంచుట అయి యుండును. దేవుడు పరలోక భూలోకములకు ప్రభువు. అన్నియు ఆయన అధికారము క్రిందనే ఉన్నవి. ఈ గ్రహములకు శక్తి ఎంతమాత్రమున్ను లేదు, వాటినిన్ని మనలనున్ను సృష్టించిన దేవునిమాత్రమే ఆరాధింపవలసినది.

"మీలో సోది చెప్పేవాడున్ను కాలమును విచారించేవాడున్ను ఉండకూడదు. వీటిని చేయువారందరున్ను దేవునికి అసహ్యులై యుందురు." (ద్వితీయోపదేశకాండము. 18: 10—12.)

## 32 పాఠము.

### మంచి వాయువును గురించి.

గ్రహించక పోవుట. - - అనుభవించక పోవుట.

ప్రపంచమునందు అనేకవిధములగు విషములు ఉన్నవి. అయితే అనేకులను చంపు విషము చెడుగాలే. జీవము కాపాడుటకు ఆహారముకంటె గాలి మిక్కిలి అగత్యము. మనము అన్నము తినకుండా కొన్నిదినములు ఉండగలము కాని, రెండుమూడు నిమిషములు వాయువు లేకపోతే మనము జీవించి ఉండలేము.

మీరు నిర్మలమైన ఉదకమును మురికిచెంబులో పోసి కడిగితే ఆ నీళ్లు క్రింద పారపోసినయెడల స్వచ్ఛముగా నుండవు. వాటిని మీరు త్రాగుటకు ఇచ్ఛయింపరు. కొంచెము ఎచ్చుతగ్గు ఈ రీతినే మన విశ్వాసములు ఉండును. మంచి ఉదకము చెంబును ఏలాగు పరిశుద్ధపరుచునో, అలాగే గాలి మన శరీరములందు చొచ్చి వాటిని పరిశుద్ధపరుచును కాని, చెంబు కడుగుటకు ఉపయోగించిన నీళ్ల

వలె గాలికూడా చెడిపోవును. మన నిశ్వాసములు ఒక విధమైన విషముతో కూడుకొని యున్నవి. ఈ విషమే ఉరిదీయబడిన మనుష్యుని చంపేది; తీవ్రమైన విషము తత్క్షణమే చంపును. జబ్బువిషము మనుష్యునికి జాడ్యముమాత్రమే కలుగచేసును. మనము గాలిలేని చిన్న గదిలో ఉండిన ఎడల ప్రొద్దుటివరకే చచ్చెదము. కొంచెము గాలి తలుపుప్రక్కలనుంచిన్ని, తాళపురేకు రంధ్రములనుంచిన్ని లోపలికి వచ్చుటవల్ల, జనులు గాలి లేక తత్క్షణమే చావరు కాని అనేకులు బలహీనులై యుండి మంచిగాలిని గ్రహింపకపోయినందున కొంచెము త్వరగా చచ్చెదరు. పట్టణములలో అనేకమంది ఊపిరి విడుచుటవలన గాలి పల్లెటిదిక్కున ఉన్నట్టు స్వచ్ఛముగా నుండదు. గనుక పల్లెటిదిక్కునుండువారు పట్టణవాసులకంటె ఎక్కువ ఆరోగ్యము కలవారున్ను ఎక్కువగ జీవించేవారున్ను అయి యుందురు. ఇండ్లలోనున్న గదులలోనున్న బహు జనులు చేరకూడదు. చెడుదైన మన ఊపిరి పొగ బైలుదేరినట్టు బైలుదేరును. ప్రతి గదికి చెడుగాలి పోవుటకు కప్పుదగ్గిర ఒక కిటికీయున్ను, మంచిగాలి లోపలికి వచ్చుటకు దానిక్రింద ఒక కిటికీయున్ను ఉండవలసినది.

ముఖము కప్పుకొని నిద్రపోవుట మంచిదికాదు. ఎందుకంటే అట్లు నిద్రపోవుటవలన మంచిగాలిని మనము గ్రహించలేము.

## 3వ పాఠము.

### సుఖపడు విధమును గురించి.

దయార్ద్రహృదయము. - - కరుణచేత మృదువైన మనస్సు.

పిల్లలందరు తమ స్నేహితులలో కొందరు అధిక సంతోషముగానున్ను ప్రేమింపబడువారుగానున్ను ఉండుటను కనిపెట్టక మానరు. వారిలో కొందరికి స్నేహితులు ఉన్నట్లు కనపడరు.

స్నేహితులు లేకపోతే ఎవడున్ను సంతోషముగానుండలేడు. హృదయము ప్రేమనిమిత్తము సృష్టింపబడినది, గనుక అది ఒకరికి ప్రేమ చూపింపకనున్ను ఒకరిప్రేమ పొందకనున్ను సుఖముగా ఉండలేదు.

కాని మీరు మీ ప్రేమ చూపింపకపోతే మీకు అది దొరకదు. మీరు ఇతరులను ప్రేమింపకపోతే మిమ్మును వారు ప్రేమింపరు. ప్రేమ చూపించుటవల్ల అది తిరిగి కలుగును, గనుక మనకు సంతోషకరమైన టువంటిన్ని, ఇతరులకు మేలుచేయునటువంటిన్ని గుణము కలిగియుండ వలెను. అది లేకపోతే మీరు సంతోషముగా ఉండలేరు.

మీ స్నేహితులు మిమ్మును ప్రేమింపకపోతే అది మీ తప్పే. మీరు వారియందు స్నేహము ఉంచి దయగా ఉండినయెడల వారు మిమ్మును ప్రేమింపక ఉండలేరు. ఇతరులు మిమ్మును ప్రేమింపకపోయినందు వలన మీరు ప్రేమింపబడుటకు అర్హులు కారని స్పష్టమగును.

మీరు మనుష్యుని సంతోషపెట్టుటకంటె, దేవుని ఎక్కువగా సంతోషపెట్టవలసినది అనునది సత్యమే. ఆచారములనుపట్టి మాత్రమే మనము నడవకూడదు. దేవుడు ఆజ్ఞాపించినది మీ స్నేహితులకు ఇష్టమైనది కాకపోయినప్పటికి మీరు చేయవలసినది. మీ హృదయములు కనికరించు స్వభావము కలవిఅయితే మీకు అనేకులైన స్నేహితులు దొరకుదురు.

మీకు దయార్ద్రహృదయమున్ను ఇతరులను సంతోషపెట్టు స్వభావమున్ను కలిగియుంటే, దానివల్ల మీకు ఎంత సుఖము కలుగునో అది మీకు బాగా తెలియదు. మీకు సమయము దొరికినకొలది ఇతరులకు సహాయము చేసితే మీ స్నేహితులు మిమ్మును చుట్టుకొందురు.

## ౩౯ పాఠము.

### సహోదరీ సహోదరులను గురించి.

ఐకమత్యము. - - - ఒక మనస్సు.
కలహము. - - - - పోట్లాట.
గృహకల్లోలములు. - - ఇంటిలో జగడములు.
పక్షపాతము. - - - - ఒకనియందే ఆదరము.

"సహోదరులు ఐకమత్యము కలిగి నివసించుట ఎంతో మంచిదిన్ని సంతోషకరమైనదిన్ని అయి యున్నది." కుటుంబములో చేరిన

వారందరున్ను ఎప్పుడైనా తమలో కలహములు సంభవించినప్పటికి సమాధానముతోనున్ను ప్రేమతోనున్ను ఉండవలసినది.

తలిదండ్రులు తమ పిల్లలనందరిని పక్షపాతము లేకుండా ఏకరీతినే చూడవలసినది. యాకోబు అను ఆయన తన కుమారుడైన యోసేపుకు అనేక రంగులుగల అంగీని ఇచ్చుటవల్ల, తనకు అధిక దుఃఖము ప్రాప్తించుటయే కాక గృహకల్లోలములున్ను కలిగెను. పిల్లలు ఆటలో సైతము ఒకరికొకరు అన్యాయము చేయకూడదు. ఊరికే ఇమ్మనికాని అప్పు ఇమ్మనికాని పిల్లలను తొందర చేయవద్దు. ఒక పిల్ల భక్ష్యము తినుచుండగా ఇంకొక చిన్నపిల్ల కొంచెము పెట్టుమని ఏడ్చితే, పెద్ద పిల్ల పెట్టకపోయినపక్షమందు తల్లి దానిలో కొంచెము విరిచి శిశువునకు ఇచ్చును కాబోలు. ఇది మంచిదికాదు, పెద్దపిల్ల తనను అన్యాయము చేసినారని అనుకొని తల్లిమీదనున్ను తమ్ముని మీదనున్ను కోపపడును. ఇందువల్ల శిశువుకూడా ఏమైనను కావలిసి వచ్చినప్పుడు ఏడ్చును. కాబట్టి పిల్లలు ఒకరియెడల ఒకరు దయగలవారై ఉండునట్టు చేయవలసినది.

పెద్దపిల్లలు చిన్నవారిమీద అప్పుడప్పుడు అధికారము చేయుదురు; ఇట్లు జరగకుండా జాగ్రతచేయవలసినది. వారు తమ తమ్ములకున్ను చెల్లెండ్రకున్ను సహాయులగునట్లు వారికి నేర్పుడు. ఒక శిశువు పుట్టినప్పుడు పెద్దపిల్లలతో ఈ విధముగా చెప్పవచ్చును. "ఇదిగో పాపాయిని చూడండి! దీని చిన్న చేతులున్ను పాదములున్ను ఎంతో మృదువుగానున్ను ముచ్చటగానున్ను ఉన్నవికాని, అది పసిదిన్ని శక్తిలేనిదిన్ని దానికదే సహాయము చేసుకొనలేనిదిన్ని గనుక మనము దానిని జాగ్రతగా కాపాడవలసినది. అటుతరువాత అది పుష్టికలిగి ఇటు అటు పరుగెత్తుటకున్ను మాట్లాడుటకున్ను శక్తికలది అగునని మనము తలంతుము." ఈ విధముగా అన్యోన్యప్రేమ పుట్టును.



## ౪౦ పాఠము.

### వ స్త్ర ము ల ను గు రి ం చి .

ఆటివచ్చును. - - - చాలాకాలము గడుచును.
శీతప్రదేశము. - - - చలిదేశము.
కపిలదేశము. - - - ఆఫ్గాన్ దేశము.
ఆంత్రములు. - - - ప్రేగులు.
రెచ్చుట. - - - అతిశయించుట.

జంతువులకు దేవుడు బట్టలు దయచేసినాడు; మనుష్యునికి ఆలోచనశక్తి కలిగియున్నందున వాని బట్టలు వాడు చేసికొనగలడు, గనుక వాడు దేశస్థితినిపట్టి బట్టలు కట్టుకొనును.

ముఖ్యముగా దూదితోనున్ను, నారతోనున్ను, ఉన్నితోనున్ను, పట్టుతోనున్ను వస్త్రములు నేయుదురు హిందుస్థానములో అక్కడక్కడ దూది విస్తారముగా పండును. గనుక దీనితో మృదువుగానున్ను తేలికగానున్ను ఉండే బట్టలు నేయుదురు. నారబట్టలు గోగునారవల్ల చేయుదురు; ఇవి దూదివలె వెచ్చగానుండవు. ఇవి బాగా ఆటివచ్చేవి గనుక మిగుల వెలగలిగి యుండును. గొర్రెబొచ్చుతో బట్టలునేసి శీతల ప్రదేశములవారు ధరించుకొనుదురు. పట్టు, పట్టుపురుగువల్ల కలుగును. అది బహు మెత్తగానున్ను సొగసుగానున్ను ఉండును కాని చాలా వెల కలది. బొచ్చుగల చర్మములు వస్త్రములుగా అప్పుడప్పుడు వాడుకచేయుదురు. కపిలదేశస్థులు గొర్రెతోళ్లతో చొక్కాయిలు చేసికొందురు.

దేశస్థితిని అనుసరించి బట్టలు ధరింపవలసినది. శిరస్సున్ను ఆంత్రములున్ను అనే శరీరభాగములు రెండున్ను మిక్కిలి సున్నితములైనవి. పెద్ద పాగాలు ఎండ తగలకుండా శిరస్సును కాపాడును. బట్ట కొన్ని మడతలుపెట్టి ముఖ్యముగా రాత్రివేళ కడుపుచుట్టూ చుట్టితే జాడ్యములు సాధారణముగా రావు. వాంతిభ్రాంతి మొదలగు సంకటములు రెచ్చునప్పుడు, శరీరమును వెచ్చగానుంచ గలందులకు జాగ్రత చేయవలసినది.

హిందుస్థానముయొక్క దక్షిణభాగమందు వాయువు సంవత్సరము పొడవున చాలామట్టుకు సమశీతోష్ణముగా నుండును. బంగాళములోనున్ను ముఖ్యముగా ఉత్తర హిందుస్థానములోనున్ను వేసవికాలమునకున్ను శీతకాలమునకున్ను విశేష వ్యత్యయము కలదు. బంగాళములో చలికాలమందు అనేకులు కావలసినన్ని బట్టలులేక చచ్చెదరు. చలిగాలి తగులుటవల్ల వారికి జ్వరము వచ్చును. ఫ్లానల్ చొక్కా శీతకాలమందు లోపల వేసుకొంటే మిక్కిలి సౌఖ్యము కలుగును. బీదవారు తగినబట్టలు కొనలేరందురేమో. మంచిది, వారు వ్యాధిగ్రస్తులై పనిపాట్లు మానుకొని వైద్యులకు విశేషముగా సొమ్ము ఇచ్చుటవల్లమాత్రము వ్యయముకాదా! మరియు శీతకాలమందు బాగా బట్టలు ధరించుకొనువారు విశేషించి అన్నము తినరు. బలహీనులైన పిల్లలకు శీతకాలములో చలిగాలి తగలకుండా చేయవలసినది.

పగలు వేసుకొనిన బట్టలు రాత్రివేళ వేసుకొనకూడదు. ఇట్లు చేసినట్టయితే శరీరమునుండి బైలుదేరు చెమట ఎండిపోవును.



## ౨౧ పాఠము.

### మంత్రములను గురించి.

| | |
|---|---|
| రక్షరేకులు. - - - - | వ్యాధులు మొదలగువాటిని పోగొట్టు చిహ్నములు. |
| దృష్టికి. - - - - - | చూపునకు. |
| పరిహారము. - - - - | నివారణము. |
| తదంగములు. - - - - | దానియొక్క అవయవములు. |
| చింతించుట. - - - | వ్యసనపడుట. |

ప్రపంచములో అనేక స్థలములయందు వివేకశూన్యులు మంత్రించెదరు. ఆఫ్రికాలో సిద్దీలలో చాలామంది చదువలేరు. వారు శరీరమందు నిండా రక్షరేకులు కట్టుకొందురు; వాటియందు ఎంతో మహత్తు ఉన్నదని నమ్ముదురు.

కష్టములు వచ్చునేమో అని మంత్రములు ఉపయోగించెదరు. ఈ దేశములో చాలామంది దృష్టికి భయపడుదురు. ఒకప్పుడు చక్కని పిల్లల శరీరములమీద నల్లటిపచ్చలు పొడిపించుదురు. పాతకుండలు తోటలలో వాసాలకు (దృష్టిపరిహారముకొరకు) తగిలింతురు; ఇది వెర్రితనము. ఈ లోకములో దుష్టులయొక్కయును దురాశగలవారియొక్కయును చూపులు మనకు ఏ హానియును చేయలేవు.

జాడ్యములు కుదుర్చుటకుకూడా మంత్రించెదరు; మిక్కిలి బుద్ధిహీనులు రోగములు కుదుర్చుటకు మంత్రజపములున్ను, తదంగములగు హోమ సంతర్పణాదికములున్ను చేయింతురు. వారు దయ్యములు రోగములను పుట్టించితే, మందులు ఏమిచేయగలవని అపహసింతురు. కొంచెము తెలివికలిగినవారు మందులు ఇచ్చి మంత్రములుకూడా ఉపయోగింతురు. నిజమైన భక్తులు మంత్రములను విసర్జించి, మందులయందుమాత్రము లక్ష్యముంచి దేవుని ఆశీర్వచనము కోరుదురు. ఇటువంటివారు తక్కినవారికంటె ఎక్కువ ఆరోగ్యసుఖములు కలవారు.

మంత్రములు ప్రయోగించుట హానికరమై యుండును. యూరోపుఖండవాసులు కుక్కల మెడ చుట్టును వాటి యజమానుల పేళ్లు చెక్కియున్న పట్టాలు కట్టుచున్నారు. మంత్రములు ఉపయోగించువారు గొప్ప శక్తిన్ని కనికరమున్నుగల దేవుని సహాయము వదిలిపెట్టినట్టున్ను తమచేత ముందు పాపముచేయించి తరువాత తమ్మును నిత్యనరకములోకి తీసికొనివెళ్లి క్రూరములైన దయ్యముల సేవకులైనట్టున్ను కనుపడుదురు. దయ్యాల మంత్రములు ఎప్పుడును వాడుకచేయవద్దు.

నిజమైనటువంటియు సార్థకమైనటువంటియు ఒక మంత్రము ఉన్నది. అది ఎప్పుడున్ను అన్నిసంగతులలోనున్ను పనికి వచ్చును; అది ఏదంటే:

"దేనినిగూర్చియు చింతించకుడి; అన్నిటిలో ప్రార్థనల మూలముగానున్ను కృతజ్ఞతాస్తుతుల మూలముగానున్ను దేవునికి మీ మనవులు తెలియచేయుడి. అప్పుడు సమస్తజ్ఞానమును మించే దేవుని నెమ్మది, క్రీస్తుయేసు ద్వారా మీ హృదయములనున్ను మనస్సులనున్ను కాపాడును." (ఫిలిప్పీ, 4: 6 7.)



## ౪౨ పాఠము.

### అన్నపానాదులను గురించి.

స్వచ్ఛము. - - తేటైనది.
జాడ్యము. - - రోగము.
పానము. - - త్రాగుట.
పాకము. - - వండుట.

మనము మంచి ఆరోగ్యము కలిగియుండుటకు తిన్నటి ఆహారమున్ను స్వచ్ఛమైన ఉదకమున్ను పుచ్చుకొనవలసినది.

ఈ దేశమందు పిల్లలు ఏది బడితే అది తమ మనసు వచ్చినప్పుడు తిందురు. పుట్టిన పిల్లలలో సుమారు సగముమందివారు ౫-సంవత్సరముల ఈడు రాక పూర్వమే చచ్చిపోవుటకు ఇది ఒక ముఖ్యకారణము.

పచ్చికాయలు తింటే అరుగుట చాలా కష్టము. పిల్లలు వీటిని తినకుండా జాగ్రత పెట్టవలసినది. మిగుల ముగ్గిన పండ్లుకూడా తింటే రోగము వచ్చును. మిఠాయివల్ల శరీరము జవజవలాడును. అది ముఖ్యముగా పిల్లలకు బొత్తిగా పనికిరాదు. ఆహారములో తగిన ఉప్పు ఉండవలసినది. పూర్వకాలమందు ఖైదీలకు ఎంతమాత్రము ఉప్పు పెట్టకపోయినందువల్ల, వారల శరీరమందు పురుగులు పుట్టి కఠినమైన బాధచేత చనిపోవువారు.

ఆహారము వేళ తప్పకుండా సుమారు ఐదేసి గంటలకొకసారే భుజింపవలసినది. తరుచుగా తినుటవల్ల జాడ్యము వచ్చును. అన్నము సగము ఉడికిన తరువాత అందులో ఇంకా కొన్ని బియ్యము పోసితే అది ఎట్లు చెడిపోవునో, అట్లునే తిన్న అన్నము అరగనిదీ, భోజనము చేసితే ఈలాగునే సంభవించును.

స్వచ్ఛమైన ఉదకము త్రాగుట చాలా మంచిది. లోతులేని చెరువులలోనున్ను నూతులలోనున్ను ఆకులు పడినట్టయితే నీళ్లు చెడిపో

వును. పానపాకములకు ఉపయోగించు నీళ్లుగల చెరువులో స్నానము చేయుటయున్ను బట్టలు ఉతుకుటయున్ను కూడదు. గ్రామస్థులందరు త్రాగెడు నీళ్లకొరకు 'లోతైన ఒక చెరువు త్రవ్వించి దానిని పరిశుభ్రముగా ఉంచవలసినది.

## ౪౩ పాఠము.

### ఉంగరమును గురించి.

కష్టపీడితుడు. - - దుఃఖముచేతను బాధింపబడినవాడు.
ఒత్తుడు. - - - నిర్బంధము.
వేదన. - - - దుఃఖము, బాధ.

ఒక మంచి బోధకుడు పడుచుతనమందున్నప్పుడు, ఈ క్రింద చెప్పబడిన ప్రకారము కలగనెను. ఒక రాత్రి ఒక ఓడలో ఆయన నిద్రపోవుచున్నప్పుడు, ఎవరో వచ్చి జాగ్రతగా దాచుమని ఒక ఉంగరము ఆయనకు ఇచ్చెను. ఆ ఉంగరము తన దగ్గిరనున్న దినములన్నిటియందు తాను సుఖముగా ఉందుననిన్ని, అది లేనప్పుడు కష్టపీడితుడనగుదుననిన్ని ఆయన అనుకొనెను. ఈయన జాగ్రతగా ఉంచుదునను నిశ్చయముతో దానిని సంతోషముగా గ్రహించెను. కొంతసేపటికి ఇంకొకరు వచ్చి ఈయన వేలిలో నున్న ఉంగరమును చూచి దాని విషయమై కొన్ని ప్రశ్నములు అడిగిరి. ఈ పడుచువాడు దాని సుగుణములను ఈ పరాయివానితో చెప్పెను. అప్పుడు ఈయన నవ్వి దానినిగురించి ఇటువంటివాటిని నమ్ముట మంచిదికాదని చెప్పి దానిని పారవేయుమని ఒత్తుడు చేసెను. ఈ పడుచువాడు తుదకు ఆ ఉంగరమును తన వేలినుండి తీసి నీళ్లలో పారవేసెను.

తత్క్షణమే దూరమందున్న ఒక పర్వతపఙ్క్తిలోనుండి భయంకరమైన అగ్ని బయలుదేరినట్టు కనుపడెను. ఈ మోసగాడు ఈ పడుచువానిని అపహసించి, తనతోకూడా ఆ మండెడి పర్వతముల దగ్గిరకు రమ్మని

అనెను. ఈ పడుచువాడు ఇందుకు మనోవేదన పడుచున్నప్పుడు, మరియొకరు వచ్చి ఈయన దుఃఖకారణము తెలిసికొని నీళ్లలోకి దుమికి ఆ ఉంగరమును వెతికి తెచ్చి ఇచ్చెను. అటుతరువాత పర్వతములోనున్న మంటలు కనుపడలేదు కాని, ఈ ఉంగరమును తెచ్చిన ఆయన ఈ పడుచువాడు తిరిగీ పోగొట్టుకొనునని అతనికి ఇవ్వక, అతని నిమిత్తము దాచిపెట్టుదునని వాగ్దానము చేసెను. అటుతరువాత ఈ పడుచువాడు నిద్రలేచెను.

ఇది కల ఐనప్పటికి దీనివలన మనము కొన్ని సంగతులు నేర్చుకొనవచ్చును. మనలను మనంతట మనమే కాపాడుకొనలేము. మనము ఎప్పుడున్ను శోధనలలో పడి పాపము చేయుదుము. గనుక మనము యేసుక్రీస్తుకు లోబడి యుండవలసినది. అప్పుడు నేను ఎవనిని నమ్మితినో నాకు తెలుసును. నేను ఆయన చేతులకు ఒప్పగించినదానిని చివర రోజువరకు ఆయన కాపాడుటకు సమర్థుడై యున్నాడని నాకు నిశ్చయముగా తెలుసున''ని పౌలు చెప్పినరీతిని మనముకూడా చెప్ప సమర్థులమగుదుము. (2 తిమొథెయు, 1: 12.)

## ౨౨ పాఠము.

### పిల్లలను ఆడించు విధమును గురించి.

| | |
|---|---|
| ఉచితకాలము. - - - | తగినవేళ. |
| కుప్పిగంతులు. - - - - | ఎగురుటలు. |
| బొత్తాము. - - - - | గాజుమొదలగువాటితో చేసిన గుండీలు. |
| సామ్మసిలి. - - - - - | సాక్ష్యం. |
| వినోదము. - - - - - - | సంతోషము. |
| క్రీడాసాధనములు. - - - | ఆటపనిముట్లు. |

పిల్లలు ఉచితకాలములందు నవ్వుటయును ఆడుకొనుటయును మంచిది. పిల్లికూనలున్ను గొర్రెపిల్లలున్ను సైతము కుప్పిగంతులు వేసి

ఇటు అటు పరుగెత్తుటకు ఇచ్ఛయించును. ఇట్టి సాధనముచేత పిల్లలకు ఆరోగ్యమున్ను బలమున్ను కలుగును.

పిల్లలను ఆడించవలసినది. ఆడించునప్పుడు ఉల్లాసముగానున్ను శాంతముగానున్ను ఉండవలసినది. ఒకప్పుడు పిల్లను తల్లి అటు ఇటు తిప్పి తన ముద్దుమాటవలన దానిని సంతోషపెట్టవలసినది. ఇతర సమయములప్పుడు అది తన చేతులున్ను పాదములున్ను చూచుకొంటూ తానంతట అదే ఆడుకొనునట్లు చేయవలసినది. శిశువులు తమకు దొరికినవాటిని నోటిలో పెట్టుకొనుదురు. వారికి బొత్తాములవంటి చిన్నవస్తువులను ఇవ్వకుండా జాగ్రత చేయవలసినది. ఇచ్చితే ఒక వేళ వారు వాటిని మింగుదురేమో. వారు కదిలింపతగిన వస్తువులున్ను ధ్వనిచేయు వస్తువులున్ను వారికి సంతోషకరమై యుండును. సంగీతమువలన వారికి సంతోషము కలుగును. చికాకుగా నున్నప్పుడుకూడా వారు దానివలన నెమ్మదిపడుదురు. కొద్దిపాటి బొమ్మరిల్లు కట్టుటకు నుపయోగించు చిన్న కొయ్యముక్కలు వారికి వినోదకరముగా నుండును. బంతి ఆడుటయున్ను బొంగరములు త్రిప్పుటయున్ను గోలీలున్ను పతంగీలు ఎగురవేయుటయున్ను తక్కిన క్రీడాసాధనములున్ను మిక్కిలి సంతోషకరములగును. వారికి బొమ్మలు వ్రాయుట నేర్పవలసినది. ఇంటిలో చప్పుడు లేకుండా ఉండవలసిన సమయమునకు కూడా తగిన యాటలను ఏర్పరచవలసినది. తలిదండ్రులుకూడా వారితో అప్పుడప్పుడు ఆడుకొనవలసినది.

వారిని జూదములు బొత్తుగా ఆడనివ్వకూడదు. వారు గోలీలతోనున్ను గచ్చకాయలు మొదలగువాటితోనున్ను పందెమువేసి ఆడకుండునట్లు జాగ్రతచేయుడి. అనేకులు ఈ రీతిని ఆరంభించి తరువాత సొమ్ముపెట్టి ఆడుదురు; జూదము ఆడుట పాపము. జూదమాడువాడు తన పొరుగువాని సొమ్ము ఆశించి వానికి తిరిగీ ఏమి ఇవ్వకుండా హరింపతలచును.

పిల్లలు హానికరములైన ఆటలలో దిగకుండా చేయవలసినది. జంతువులకు బాధ కలుగచేసే ఆటలయందు వారు సంతోషింప కూడదు. పురుగులను పట్టుటయున్ను పక్షిగూళ్లు తీసివేయుటయున్ను, కుక్కల మీదను బల్లులమీదను రాళ్లువేయుటయున్ను పిట్టలు మొదలగువానిని

తుపాకితో కొట్టుటయున్ను ఇంకా ఏ విధముచేతనైన బాధ కలుగచేయుటయున్ను ఆటంకపెట్టుడి. ఇది చేయకుండా వారు తమ దగ్గిర నుండు జంతువులను ఆడించుటయందు సంతోషించునట్లు చేయవలసినది.





## ౨౫ పాఠము.

### పుస్తకములను గురించిన్ని అచ్చువేయుటయును గురించిన్ని.

పద్ధతి. - - - - - మార్గము, విధము.
పండితశ్రేష్ఠులు. - - బాగుగ చదివినవారు.

మొట్టమొదట జనులు ఇతరులు చదువవలెనని తాము కోరినదానిని రాళ్లపైని చెక్కేవారు. ఇటీవల, వారు కొయ్యపలకలమీదనున్ను చర్మములమీదనున్ను ఆకులమీదనున్ను బెరడ్లమీదనున్ను తుదకు కాగితములమీదనున్ను వ్రాయ నేర్చుకొనిరి. గుడ్డపీలికలతో కాగితములు చేయువారు ఈ గుడ్డపీలికలను చిన్నచిన్న ముక్కలుగా కత్తిరించి నీళ్లతో కలిపి పాలరూపము వచ్చేటట్టు చేయుదురు. పాలవంటి దీనిని అచ్చులలో ఎండబెట్టితే కాగితములగును.

పూర్వకాలమందు పుస్తకములను వ్రాయువారు. ఇందువల్ల చాలాకాలము పట్టుటయే కాకుండా శ్రమకూడా కలిగేది, గనుక పుస్త

కములు చాలా ప్రియముగా ఉండేవి. ఒక బైబిలు సుమారు 3,౦౦౦ రూపాయీలకు వచ్చేది. ఇప్పుడు ఇంగ్లీషు బైబిలు సుమారు ౭ అణాలకు కొనవచ్చును. ఇంతవెల తగ్గుటకు కారణమేమి? అచ్చువేయు పద్ధతి కనుగొనుటే.

చీనాదేశస్థులు చాలాకాలము క్రిందట కొయ్యముక్కల మూలముగా అచ్చువేయు విధము తెలిసికొనిరి కాని, ఇది యూరోపులో సుమారు ౪౮౦-సంవత్సరముల క్రిందటివరకు ఎవరికి తెలియలేదు. యూరోపులో మొదట అక్షరములను కొయ్యముక్కలమీద చెక్కిరి. తరువాత తీయుటకు వీలైన అక్షరములు లోహమువల్ల చేసి ఉపయోగించేవారు. అక్షరమును వైపులయందు వరసగా కూర్చిన తరువాత యావత్తు అచ్చువేయుదురు. ఒకడు అచ్చుమూలముగా ఒక పుస్తకమును వేయిమంది వ్రాయకలిగిన దానికంటె ఎక్కువ త్వరగానున్ను సొగసుగానున్ను సిద్ధముచేయును.

పుస్తకములు ఎంతో ఆశ్చర్యకరములైనవి. వీని మూలముగా ప్రపంచములో ఉండు అన్నిదేశములయందు నివసించు పండిత శ్రేష్ఠులను మనకు ఉపాధ్యాయులనుగా చేసికొనగలము.

పుస్తకములు మనస్సుకు ఆహారము వంటివి. మనము దినదినమున తిను రీతిని ప్రతిదినమున్ను కొంచెముగానైన చదువవలసినది. మనము ఆరోగ్యకరమైన ఆహారము తినుటకు ఎంతజాగ్రత కలిగి యుందుమో, అంత జాగ్రతతో మంచి గ్రంథములనుమాత్రమే చదువవలసినది. దుర్వృత్తి కలుగచేయు పుస్తకములవల్ల మనకు హాని పుట్టును. అన్నిటిలోకి బైబిలు శ్రేష్ఠమైన పుస్తకము; గనుక దానిని మనము బాగుగా చదువవలసినది. మనము తినిన ఆహారము బలము పట్టగలందులకు అరిగిపోవలసినది. ఈ రీతినే మనము చదువువల్ల మంచి లాభము పొందకోరినట్టయితే చదివినదానినిగురించి ఆలోచింపవలసినది.



# నాలుగవ నెల.

## ౪౬ పాఠము.

### పెండ్లి వాడుకలను గురించి.

| | |
|---|---|
| ప్రధానము. - - - | వివాహనిశ్చయము. |
| సంబంధము. - - - | చుట్టరికము. |
| వధూవరులు. - - | స్త్రీ పురుషులు. |
| ఉత్తరమందు. - - - | తరువాతను. |
| అనర్థము. - - - | కీడు, అపాయము. |

ఈ దేశములో కొన్ని వివాహాచారములు హానికరములు. వాటి లో కొన్ని చెప్పెద.

పెండ్లి చిన్నప్పుడే చేసెదరు. ఒకానొక సమయమందు పిల్లలు పాలు విడువక పూర్వమే ప్రధానము చేయుదురు. వివాహకార్యము సమాప్త ము కాకమునుపు పిల్లవాడు చనిపోయెనా ఆ పిల్ల విధవని ఎంచుదురు. పిల్లలు తాము వివాహము చేసుకొనువారినిగురించి ఏమిన్ని తెలుసు కొనలేరు; గనుక తలిదండ్రులే సంబంధమును కూర్చెదరు. కొన్ని సంగతులలో వధూవరులు వివాహసమయమువరకు ఒకరిని ఒకరు చూ చుకొనరు. ఈ రీతిని చిన్నవారికి ఒకరియెడల ఒకరికి ప్రేమ లేనప్పు టికి వివాహము చేయుదురు. బుద్ధిమంతులైన జాతివారిలో వధూవరులు యౌవనవంతులై అదివరకు తమకు జరిగిన పరిచయముచేతను ఉత్తర మందు తమకు పరస్పరము అధిక సౌఖ్యము కలుగునను తాత్పర్యము పుట్టకుండెనా వివాహము చేసికొనరు.

సుమారు ౧౨ లేక ౧౪ - సంవత్సరములు ఈడుగల ఆడపిల్లలకు పెండ్లిచేసితే అనేకవిధముల నష్టము కలుగును. వారు తిన్నగా పెద్ద వారు కాకపోవుటవల్ల బలహీనులగుదురు. వారికి పుట్టిన *పిల్లలు కూడా బలహీనులున్ను రోగపీడితులున్ను అయి యుందురు. తల్లి

తానే పిల్లయి యుండగా తన పిల్లలను తిన్నగా పెంచగలదా? పది యేడు లేక పదునెనిమిది సంవత్సరములకు తక్కువ ఈడు గల ఆడ పిల్లలకు వివాహము చేయకూడదు. ఇంతకంటే కొంచెము ఎక్కువ పెద్దవారైన పక్షమందు మరీ మంచిది.

పెండ్లిళ్లకు విస్తారము సొమ్ము ఖర్చుచేయుట కూడను ఒక అనర్థమే. సంవత్సరముల నుండి దాచిన సొమ్ము కొద్దిరోజులలో వ్యర్థముగ విని యోగపడును. బీదవారు తరుచుగా రుణపడుటవల్ల మిక్కిలి బాధ పడుదురు. ఇట్టి ఖర్చులు వచ్చునని భయపడి పూర్వమందు కొందరు రాజపుత్రులు అనువారు తమ ఆడపిల్లలను చంపుటకు సయితము సిద్ధ పడేవారు. స్నేహితులకు విందులు మొదలైనవి చేయవచ్చుగాని అక్కర లేని ఖర్చులను కొట్టివేయవలసినది.

హిందువులు వివాహములందు పనికిమాలిన పాటలు పాడుదురు. ఎప్పుడయిన సరే, అయుక్తపు మాటలు వచించుట పాపమై యున్నది. సంతోషకరమైన ఈ పెండ్లిసమయమందే సమస్త సుఖమును దయచేయు దేవుని ఆజ్ఞలను ముఖ్యముగా ఎందుకు మీరవలసినది!

విధవలకు పునర్వివాహము నిషేధించుటవలన చాలా నష్టమున్ను దోషమున్ను కలుగుచున్నది.

## ౪౩ పాఠము.

### రోగులకు ఉపచారము చేయుటను గురించి.

ఉపచారము. - - సంతోషమును కలుగజేయు క్రియ.
ఇబ్బడి. - - - - ద్విగుణము, రెట్టింపు.
ఒడలు. - - - శరీరము.
సారెకు. - - - - పర్యాయమునకు.
గుసగుసలు. - - మెల్లమెల్లగా మాట్లాడుటలు.
చికాకు. - - - - అసహ్యత.

అనేక సంగతులలో రోగులు క్రమముగా జాగ్రతచేయబడిన ట్టయితే త్వరగానే స్వస్థత పొందుదురు. దాని విషయమై కొన్ని

సంగతులు వివరించెదను. మంచిగాలి ఎప్పుడున్ను తగులునట్లు చేయవలసినది. జాడ్యము సంభవించినప్పుడు మంచిగాలి తగులుట ఇబ్బడిగా అవశ్యకము. కొన్ని సంగతులలో రోగిని చిన్న గదిలో పరుండపెట్టి అనేకులు చుట్టును కూర్చుండి గాలినంతా చెడకొట్టుదురు; దీనివల్ల హాని కల్గును.

శుచిత్వముకొరకు చాలా శ్రద్ధచేయవలసినది. దేనివల్లనైతే దుర్వాసన కలుగునో ఆ పదార్థమును అక్కడనుండి తీసివేయవలసినది. రోగి మిక్కిలి జబ్బుపడి ఉంటే తప్ప, రోజుకు ఒక పర్యాయము స్నానము చేయింపవలసినది. బాగుగా ఉన్నప్పుడువలె రోగిని చన్నీళ్లలో స్నానము చేయించకూడదు; కాని నులివెచ్చన నీళ్లలో గుడ్డముంచి శరీరమును తుడిచి, వెంటనే ఒడలు ఆరునట్లు చేసితే వానికి సుఖముగా నుండును. చేతనైతే రెండు జతల తలగడలున్ను దుప్పట్లున్ను ఉంచవలసినది. ఒక జత గాలిలో వేయించి రెండవ జత వాడుకొనుచుండవచ్చును.

నిశ్శబ్దముగా ఉండవలసినది. రోగులు తమకు బాగుగా నున్నప్పుడు వినిన ధ్వనులను లక్ష్యము చేయకపోయినప్పటికి, జాడ్యముతో తీసుకొనునప్పుడు కేకలు సహింపలేరు. బిగ్గరగానున్ను చాలాసేపున్ను మాట్లాడకూడదు. విశ్రాంతివల్ల రోగము చాల తగ్గును. సారెకు ఒకరు ఇద్దరుమాత్రమే ఆ గదిలో ఉండి, రోగి మనసు వచ్చినప్పుడు నిద్రపోనివ్వవలసినది. గుసగుసలు ఆడవద్దు. రోగి చెప్పుకొనునది వినుటకు యత్నము కలిగియుండుటవలన అతనికి తొందర కలుగును.

వానికిచ్చే ఆహారమువిషయమై జాగ్రత చేయవలసినది. చాలా సంగతులలో రోగి తినకుండుటే మంచిది. సాధారణముగా రోగిని తినుమనిన్ని త్రాగుమనిన్ని తొందరచేయ కూడదు. జాడ్యములో పెట్టవలసిన ఆహారము రోగమును అనుసరించి యుండును. జ్వరము వచ్చినప్పుడు జావ మొదలైనవిమాత్రమే ఇవ్వవలసినది. త్వరగా అరగనివి ఇవ్వకూడదు. తిను వస్తువులను బాగా వండి తెల్లటిబట్టవేసి శుభ్రమైన పాత్రలో పెట్టి తీసికొని రావలసినది.

దయగా ఉండవలసినది. రోగులు చాలా శ్రమచేత చికాకు పడుదురు. వారు చెప్పేవి సహించి మెనరుగల కంఠముతో మాట్లాడి,

వారు సంతోషించునట్లు చేయవలసినది కాని రోగులతో ఎప్పుడు అబద్ధములు ఆడకూడదు. ఒక దిక్కునే పరుండపెట్టక తలయెత్తి ఇక్కడొక తలగడ అక్కడొక తలగడ పెట్టితే కొంచెము హాయిగా నుండును.

మంత్రించక మంచి వైద్యుని పిలిపించి దేవునిమీద భారము వేయవలసినది. మంత్రములవలన వచ్చే పాపమును గురించిన్ని బుద్ధిహీనతను గురించిన్ని ఇదివరకు చెప్పితిమి. పామరులు మంత్రములు ఉపయోగించుమని చెప్పినప్పటికి వినవద్దు. మంచి మందులు ఇచ్చి దేవుని ఆశీర్వచనముకొరకు ప్రార్థన చేయవలసినది.

## ౨౧ పాఠము.

### ప్రశస్తమైన సూత్రమును గురించి.

ఇముడ్చుట. - - సరిపుచ్చుట.
ఆదరించుట. - - - ప్రేమించుట.
ఉద్యోగించుట. - ప్రయత్నపడుట.
రమ్యము. - - - సుందరము.

మనము చేయవలసిన పనులు రెండు విధములు; ఒకటి దేవునివిషయమైనదియును, మరియొకటి మనుష్యుని విషయమైనదియును, యేసుక్రీస్తు మన పొరుగువానియెడల చేయవలసిన పనులన్నియు ఒక చిన్న వచనమునందు ఇమిడ్చి చెప్పెను. అది ఏదనగా: "ఇతరులు నీయెడల చేయవలెనని నీవు కోరునవి అన్నియు నీవుకూడా వారివిషయమై చేయుము."

దీని శ్రేష్ఠత్వమును పట్టి దీనికి ప్రశస్తమైన సూత్రమని పేరు. దీనిని వేరుమాటలతో చెప్పినట్టయితే "నీ పొరుగువానిని నిన్నువలె ప్రేమించుమ"ని యేసు చెప్పిన రెండవ యాజ్ఞయై యున్నది.

ఇతరులు మనయెడల ఏయే సమయములలో ఏయే విధమున ప్రవర్తిం పవలెనని మనము కోరెదమో, ఆ రీతినే మనముకూడా వారియెడల ప్రవర్తింపవలెననునదే ఈ ప్రశస్తమైన సూత్రమునకు అర్థము. మనము ఇతరులయెడల నడుచుకొను రీతిని నేర్చుకొన కోరినట్టయితే, మనము వారి స్థితియందున్ను వారు మన స్థితియందున్ను ఉన్నట్టు అనుకొని, అప్పుడు వారు మనయెడల ఏలాగున ప్రవర్తించుట మనకిష్టమగునో దానిని ఆలోచింపవలసినది.

మనము రోగపీడితులమై దిక్కులేనివారముగా నుంటే ఒక స్నేహితుడు వచ్చి మనలను ఆదరించి, మనకు సహాయము చేయుటకు గట్టిగా కోరుదుము. ఆ రీతినే కష్టపడువారికి మనము సహాయము చేయవలసినది. మనము నిజమైన దేవుని గూర్చినట్టియు ఒక్కడైన రక్షకుని గూర్చినట్టియు తెలివి లేనివారమై యుంటే, వీటిని గురించి తెలిసికొనినవారు మనకు నేర్పవలసినదని మనము కోరమా? ఆలాగు నసే ఇతర మతస్థులకు మనము బోధింప నుద్యోగించవలసినది.

పైనచెప్పిన విధము నీయెడల ప్రవర్తించినట్లు నీవు వారియెడల ప్రవర్తింపుమని చెప్పదు. అయితే వారు నీయెడల ప్రవర్తించువిధ మును నీవు కోరునట్లు వారియెడల నీవు ప్రవర్తింపవలసినదని చెప్పు చున్నదని జ్ఞాపకము చేసుకొనుము. ఇతరులు మనకు చేసినట్లు వారికి మనము చేయుట అనేక సంగతులలో అయుక్తముగా నుండును. "ఒకరు నాకు చేసిన ప్రకారము నేను వానికి చేసెదనని చెప్పవద్దు." మనము అపకారమునకు ఉపకారము చేయవలసినది.

యేసు దయచేసిన మంచి ఆజ్ఞప్రకారము మనమందరము నడుచు కొనినట్టయితే, మనము ఎంతో సంతోషముగా నుందుము. మనచుట్టు నుండువారిని మిక్కటముగా సంతోషింప చేయుదుము. ప్రతివాడున్ను తన పొరుగువాడు తనకు సహాయము చేయవలెనని కోరునట్టు తాను వానికి సహాయము చేసినట్టయితే ఈ ప్రపంచము ఎంతో రమ్యమై యుండును.



# ౪౯ పాఠము.

## మంచి స్నేహితులను గురించిన్ని చెడ్డ స్నేహితులను గురించిన్ని.

సహవాసము. - - సాంగత్యము, స్నేహము.

ఒకప్పుడు గడ్డిదుబ్బు గులాబిపువ్వుయొక్క కొమ్మల మధ్యను మొలిచెను. ఒకడు వెళ్లి ఆ గడ్డిని పెరికివేయ పోయినప్పుడు, "నన్ను ఇక్కడ ఉండనిమ్ము నేను గులాబిపువ్వును కాను కాని, నాకు కలిగిన వాసనవల్ల నేను గులాబిపువ్వు మధ్యను ఉంటినని నీవు తెలుసుకొందువు" అని ఆ గడ్డిదుబ్బు చెప్పెను.

ఈ చిన్నకథవలన మనము ఎవరి సహవాసము చేయుదుమో వారి బుద్ధి మనకు అబ్బునని మనకు నేర్చుకొనవచ్చును. "వివేకుల సాంగత్యము చేయువాడు వివేకి అగును. బుద్ధిహీనుల సహవాసి నశించిపోవున"ని సొలొమోను అను ఆయన చెప్పుచున్నాడు. (సామితెలు, 13: 20.)

పిల్లలు జతగాండ్రు కావలెనని కోరుదురు. ఆ ఇచ్ఛ మంచిదే కాని తమ స్నేహితులు మంచివారై యుండునట్లు చాలా జాగ్రత చేయవలసినది. స్వబుద్ధివలన మనము యుక్తమైనదానిని విడిచి అయుక్తమైనదానిని కోరుదుము. ఒక దుష్టునివలన అనేకులు చెడిపోదురు.

పిల్లలు తలిదండ్రులకు అవిధేయులైనవానితోనున్ను, చెడ్డ దుస్సంభాషణ చేయువారితోనున్ను, అబద్ధములు పలుకువారితోనున్ను, కలహములు చేయువారితోనున్ను, జూదగాండ్రతోనున్ను, క్రూరులతోనున్ను, సబ్బాతును అతిక్రమించువారితోనున్ను, దేవాలయమునకు వెళ్లనివారితోనున్ను సహవాసము చేయకుండా జాగ్రతపెట్టవలసినది. దుర్మార్గులైన పిల్లలు రాత్రులయందు తరుచుగా ఇల్లు విడిచిపెట్టి పోదురు. పిల్లలను ఇండ్లలోనే ఉంచి, వారికి చదువుటకు తగిన వయస్సు లేనిపక్షమందు హానికరములుగాని ఆటలచే వారిని సంతోషపెట్టవలసినది.

"పాపులమార్గమందు నిలువనివాడు భాగ్యవంతుడ"ని బైబిలు చెప్పుచున్నది. పిల్లను చెడ్డచిన్నవారి ఇండ్లకు వెళ్లకుండా చేసి, వారు ఆడుకొను స్థలముల దగ్గరకు పోకుండా పట్టవలసినది. దుర్మార్గ

లైనవారి యెడలనున్ను మనము కనిరముగలవారమై యుండవలసినది. వారికొరకు ప్రార్థించి మేలు చేయుటకు ప్రయత్నము చేయవలసినది కాని, వారిని మన స్నేహితులనుగా భావించుకొనకూడదు. “నేను నీకు (దేవునికి) భయపడువారియొక్కయును, నీ ఆజ్ఞలను కాపాడు వారియొక్కయును, స్నేహితుడనైయున్నాన”ని దావీదు అను ఆయన చెప్పినట్టుగా మనముకూడా చెప్పవలసినది.





## ౫౦ పాఠము.

### మెట్టను ప్రయాణము చేయుటను గురించి.

ఇటీవల. - - - తరువాత.

నలుగులు. - - - చక్రములు లేనిబండ్లు.

ఏకాండము. - - అతుకులులేని.

మొట్టమొదట జనులు నడిచి తమ బరువులను మోసుకొనిపోవు వారు. ఇటీవల గుఱ్ఱముల మీదనున్ను ఒంటెల మీదనున్ను ఎక్కట

చేర్చుకొని, తమ సరుకులను వాటిమీదనున్ను ఎద్దులమీదనున్ను వేసి మోయించిరి. తరువాత సలుగులు వాడుక చేసిరి. కొంతకాలమైన తరువాత చక్రములవల్ల చాలా ఉపయోగమని కనుగొనిరి, గనుక బండ్లను నిర్మించిరి. మొదట చేసిన చక్రములు ఏకాండములుగానున్ను మోటగానున్ను ఉండెను. క్రమముగా బాగుపరచి వాటిని వృద్ధి పొందించిరి.



మంచిబండ్లకు తగిన మార్గములు ఉండవలెను. బ్రిటానియా దొర తనమువారు ప్రతి సంవత్సరము దారులు బాగు చేయుటయందున్ను, వంతెనలు కట్టించుటయందున్ను, చాలాసొమ్ము వ్యయము చేయుచున్నారు. వాటివల్ల ఏమి ప్రయోజనము? ఆ మార్గములందు జనులు సుఖముగా నడువవచ్చును. ఈ దారులవల్ల లక్షలకొలది జనులు కరువు వచ్చి నశింపకుండా రక్షింపబడిరి. కొన్నివేళల ఒక స్థల మందు కరువు ఉండును. దీనికి నూరు రెండు నూర్ల మైళ్లదూరమున ఉన్న ఒక ఊరిలో చాలా ధాన్యాదులు ఉండును. తగిన మార్గ ములు ఏర్పడకపోతే ధాన్యము తీసుకొనిపోవుటకు చాలా వ్యయము అగును, గనుక చాలాదూరము తీసుకొని పోలేరు. మంచి త్రోవల మూలముగా చాలాదూరమువరకు ధాన్యాదులు తీసుకొని పోవచ్చును.

భూమిమీద పొగబండ్లవల్ల మిక్కిలి త్వరగానున్ను సుఖముగా నున్ను ప్రయాణము చేయవచ్చును. మొదట ఇనుపదారుల మూల ముగా బండ్లు ఆవిరివల్ల ఇంగ్లాండులో ౧౮౩౦-సంవత్సరమునందు లాగబడినవి. ఈ దేశమందు చాలాపొడవు కలిగిన ఇనుపదారులు వేయుచున్నారు. కలకత్తాకున్ను కాశీకిన్ని ౪౭౪-మైళ్ల దూరము కలదు. ఇంత దూరమును ౨౪-గంటలలో ప్రయాణము చేయవ చ్చును. ఇప్పుడు జనులు కలకత్తానుండి బొంబాయికిన్ని చెన్నపట్టణ

మునకున్ను కొద్ది కాలములోనే ప్రయాణము చేయగలరు. పెద్దవై లోతుగా ఉండు నదులమీద వంతెనలు కట్టించిరి; పర్వతములగుండా మార్గములు త్రవ్వించిరి.

ప్రపంచమందుండు ఇనుపదారులలో లండను అను పట్టణమందు, భూమిక్రింద ఉండునవి మిక్కిలి ఆశ్చర్యకరములైనవి. ఆ పట్టణము క్రింద లోతుగా త్రవ్వి అనేకములైన ఇనుపదారులను నిర్మించిరి.

ఎద్దులాగు బండి గంటకు రెండు మైళ్లు దూరముకంటే ఎక్కువగా పోదు. వడిగాపోయే గుర్రములు గంటకు పది మైళ్లదూరము చొప్పున మంచిదారిని నడువ గలవు. ఈ దేశమందు పొగబండ్లు గంటకు సాధారణముగా ఇరువదిమైళ్లు నడవ గలవు. ఇంగ్లాండుదేశములో కొన్ని సమయములందు పొగబండ్లు రాంబందు ఎగురు నంత త్వరగా పోయి గంటకు డెబ్బదిమైళ్లు నడుచును.

## ౫౧ పాఠము.

### పెనిమిటిని ఏర్పరుచుకొనుటను గురించి.

| | | |
|---|---|---|
| భాగ్యము. | - - - | ఐశ్వర్యము, సంపద. |
| విద్యావిహీనుడు. | - - | చదువులేనివాడు. |
| మన్నించుట. | - - | గౌరవించుట. |
| ప్రతీతి. | - - - | వాడుక. |

మనము ఏర్పరచుకొను సంబంధములలో వివాహము మిక్కిలి ముఖ్యమైనది. అది చావువరకున్ను ఎడతెగక నుండు సంబంధము. దానివల్ల గొప్ప సుఖమైన కలుగును, లేక గొప్ప నష్టమైన సంభవించును.

హిందువులు ముఖ్యముగా కులభాగ్యమును పట్టి వివాహసంబంధములను కుదర్చెదరు. ఒకానొకప్పుడు ఒక చక్కని పడుచును ఐశ్వర్యవంతుడైన ముసలివానికి పెండ్లి చేయుదురు. మరి ఒకప్పుడు దుర్మార్గుడగు పడుచువానికి గొప్ప కులమందు పుట్టినందున చిన్నదానిని ఇత్తురు. ఇటువంటి పెండ్లిళ్లు అక్రమములైనవి.

వివాహములు చేయునప్పుడు దంపతులయొక్క సౌఖ్యమును గురించి ముఖ్యముగా ఆలోచింపవలసినది. వయస్సునందు మిక్కిలి తారతమ్యము ఉంటే వారికి వివాహము చేయ కూడదు. చదువు కొనిన స్త్రీ విద్యాహీనుని పెండ్లి చేసికొనకూడదు. సమానములైన పరువు మర్యాదలు కలవానిని పెండ్లి చేసికొనుట మంచిది. ఏకస్వభావము కలిగి ఉండుటకూడా ఆలోచింపవలసినది. చిన్నపిల్లలకు పెండ్లి చేయకూడదు, చిన్నవారు ఒకరిని ఒకరు తెలిసికొనుటకు తగినంత వయస్సుగలవారై యుండి వివాహము చేసికొనినయెడల తమకు పరస్పరసౌఖ్యము కలుగునో లేదో విచారింపవలసినది. మరియును తలిదండ్రులతో ఆలోచించి వారి అనుమతిని తగినంతమట్టుకు మన్నింపవలసినది.

క్రైస్తవులు "ప్రభువు మతమును అనుసరించే పెండ్లి చేసికొనవలసినది" అను వచనము కనిపెట్టవలసినది. ఇది వారికి ఇతర మతస్థులనుమాత్రమే వివాహము చేసికొన కూడదని చెప్పదు. భక్తిపరులైనవారు మంచివారనే ప్రతీతి కలిగి పేరుకుమాత్రమే క్రైస్తవులైన వారినిన్ని పెండ్లి చేసికొన కూడదు అని చెప్పుచున్నది. పూర్వమందు భక్తులైనవారు భక్తిహీనులను పెండ్లి చేసికొనుటవల్ల ప్రపంచమందు పాపము పెరిగి జలప్రళయమునకు కారణమాయెను. భక్తిపరురాలైన స్త్రీ, పేరుకుమాత్రమే క్రైస్తవుడైనవానిని వివాహము చేసికొనిన పక్షమందు, ఆమెకూడా మతమును తరుచుగా నిర్లక్ష్యపెట్టవచ్చును. కనుక వారి పిల్లలున్ను అటువంటిబుద్ధి కలవారే అగుదురు. రెండవ పక్షమున భార్యాభర్తలు ఇద్దరు భక్తిపరులు అయిరేని, పరలోకమునకు పోయెడిమార్గమునందు ఒకరికొకరు సహాయము చేసికొనుదురు; ఇంతే కాకుండా వారి పిల్లలుకూడా వారి మార్గమునే అనుసరింతురు.

"మీరు అవిశ్వాసులతో జతగా కూడియుండవద్దు; ఎందుచేతనంటే, నీతికిన్ని అనీతికిన్ని వెలుతురుకున్ను చీకటికిన్ని ఏమి సంబంధము!" (2 కొంథి. 6: 14.)



## ౫౨ పాఠము.

### మందు ఇచ్చుట.

వ్యాధిగ్రస్తుడు. - - వ్యాధిచేతను ఆవరింపబడినవాడు.
సేవించుట. - - - తినుట.
ప్రతికూలించుట. - - సరిపడకపోవుట.
స్రవించుట. - - - వెడలుట.

"జాడ్యము రాకముందే జాగ్రతపడుట మంచిది" అను సత్యమైన ఒక సామెత గలదు. ఒకడు వ్యాధిగ్రస్తుడైన తరువాత కుదుర్చుకొనుటకంటే రోగము రాకుండా జాగ్రతపడుటే మిక్కిలి మంచి యుపాయము.

కొందరు అవివేకులు బాగుగా నున్నప్పుడు జాడ్యము రాకుండుటకై మందు పుచ్చుకొనుదురు. ఇది అప్రయోజనమే కాకుండా హానికరముకూడా అగును. నిజముగా అగత్యములేనిది మందు పుచ్చుకొనకూడదు. విరోచనపు మందులవల్లనున్ను ఇంక కొన్నిటివల్లనున్ను శరీరము బలహీనమగును; జాగ్రతతో ఆ మందులు సేవింపవలసినది. కొందరు రోగము వచ్చినప్పుడు చాలామందులు పుచ్చుకొనుదురు; చెప్పిన మందులన్నియు తినుదురు, తరుచుగా ఒక ఔషధము మరియొక ఔషధమునకు ప్రతికూలించును గనుక, రోగము అంతకంతకు బలిష్ఠమగును.

దేవుడు శరీరమును తానంతట అదే రోగమును పోగొట్టుకొనునదిగా సృష్టించెనని అందరున్ను తెలిసికొనవలసినది. ఎట్లంటే దుమ్ము కన్నులలో పడితే కన్నీరు స్రవించి దానిని వెళ్లగొట్టును. మనము సరిపడని ఆహారము తినినపక్షమందు వమనరూపముగానైన లేక విరోచనరూపముగానైన పోవును. ఈలాగున శరీరము ఇతర రోగములను కొట్టివేయుటకు యత్నించును. మొదట చాలా సంగతులలో ముఖ్యముగా చేయవలసినది ఏమనగా, తగిన ఆహారము పుచ్చుకొని క్రమమైన విశ్రాంతిని పొందవలసినది.

పిల్లలక్కు మంచి ఆహారము పెట్టకపోవుటవల్ల కాని లేక విస్తారము తినిపించుటవల్ల కాని రోగము వచ్చును. వారికి రోగమ్ము వచ్చిన

ప్పుడు ఒకరోజు రెండు రోజులవరకు కొంచెము జావ ఇచ్చితే వారు నిమ్మళపడుదురు.

ముఖ్యముగా పిల్లలకు చిట్లాముదమువల్ల తగుమాత్రము విరేచనములు అగును. పిల్లలకు, సారెకు మిల్లిగరిటెడు ఇవ్వవలసినది. అది కొంతిరసముతో కలిపి ఇచ్చితే చాల మంచిది. గానుగ ఆడి తీసిన ఆముదము, కాచి తీసిన ఆముదముకంటె మంచిది.



## ౫౩ పాఠము.

### దైవఘటనమును గురించి.

ఘటనము. - - - సందర్భము కలుగచేయుట.
. గతి. - - - - ఇచ్ఛ.
పాంథులు. - - - బాటసారులు.

"మా నొసటిమీద వ్రాయబడినది జరగక మానదు; మేము అది జరగకుండా చేయులేము" అని కొందరు చెప్పుచున్నారు గనుక ఈ దేశమందు అక్రమములైనటువంటివిన్ని చెడ్డవైనటువంటివిన్ని అనేక కార్యములు జరుగుచున్నవి. ఎట్లంటే. సోమరిపోతు ఒకడు అసహ్యముగానుండు గుడిసెలో కాపురముండి చెడిపోయిన ఆహారము తినును; అందువల్ల వానికి రోగము వచ్చును. అప్పుడు వాడు తనమీద నింద మోపుకొనక దైవగతివలన సంభవించినదని చెప్పును. ఒక తల్లి తన పిల్లలను గురించి జాగ్రత చేయక దుర్మార్గులతో ఆడుకొనుటకు అంగీకరించును. వారు జూదగాండ్రున్ను దొంగలున్ను అయినప్పుడు ఆమె వారి గతి ఆలాగున ఉన్నది గనుక మరియొక విధమున జరుగదని తన మనస్సును సమాధానపరుచుకొనును. ఇట్టివారు తమ నడతవల్ల కలిగెడు ఫలములను అనుభవించెదరు.

దేవుడు మన నొసట వ్రాసెనని మనము తప్పు చేయుట అక్రమముగా ఉండును. దేవుడు అటువంటి పని చేయడు. మనము చేయు చెడుకార్యములవల్ల కలుగు నింద, దేవునిమీద మోపుట మంచిదికాదు. అది మన తప్పితములకు క్షమాపణ కాకుండుటయే కాక వానికి వృద్ధి చేయును. మనము పాపము ఎప్పుడు చేసినను అది మన తప్పేకాని

ఇంకొకరి తప్పు కాదు. దేవుడు మనము యుక్తముగా ప్రవర్తింపవల
సినదని కోరుచున్నాడు. అయితే మనము దుష్టకార్యములను చేయ
కోరుచున్నాము.

కొందరు పాంథులు ఒకానొక సాయంకాలమందు చాలాదూర
ప్రయాణముచేసి ఒక అడవిలో బస చేసిరి. వారిలో ఒకడు "నా
ఒంటెను విప్పి దానిని జాగ్రతపెట్టు భారము దేవునిమీద వేయుదు
న"ని అనెను. ఇంకొకడు "స్నేహితుడా! నీ ఒంటెను కట్టి దేవుని
మీద భారము వేయుము"ని చెప్పెను. దీనివల్ల మనము మంచి సంగ
తులు నేర్చుకొనవచ్చును. దేవుడు మనలను కాపాడునని అనుకొని
మనము గుడ్డివారమై మనకు నియమింపబడిన పనులను గురించి అశ్రద్ధ
చేయ కూడదు. ఇందుకు ప్రత్యామ్నాయముగా మనము యుక్తమైన
దానిని చేసి దేవుని ఆశీర్వచనమును కోరవలసినది.

"భయకంపములతో ఆత్మరక్షణను మీరు కలుగచేసుకొనుడి; తన
ఇష్టప్రకారము మీరు ఇచ్ఛయించునట్లును మీరు చేయునట్లును
చేయువాడు దేవుడే" అని అపొస్తలుడైన పౌలు చెప్పుచున్నాడు.
(ఫిలిప్పీ. 2: 12, 13.)

## ౫౭ పాఠము.

### జిహ్వాకృత పాపములను గురించి.

దుష్కరము. - - - - - చేయశక్యము కానిది.
ఉచ్చరించుట.- - - - పలుకుట.
కొరత. - - - - - - తక్కువ.
వక్కాణించుట. - - - వచించుట.
హాస్యము. - - - - - - పరియాచకము.
అనుకరించుట. - - - - పోలుట.
ఆత్మస్తుతి. - - - - - - తనను పొగుడుకొనుట.

కొన్నిపాపములు చేయుటకు తగినకాలమున్ను ప్రయత్నమున్ను
కావలసి యుండును. అయితే మాటలు బహు త్వరగా ఉచ్చరింప
వచ్చును. కాబట్టి నాలుకను స్వాధీనపరుచుకొనుట దుష్కరమై

యున్నది. "ఎవడైనను మాటలచేత తప్పు చేయకపోతే వాడే కొరత లేనివాడు అయియుండి, శరీరమును తనకు లొంగ చేసికొనును" అని బైబిలులో వ్రాయబడి ఉన్నది. అనేకులు తమరు వచించుదాని విషయమై తిన్నగా ఆలోచింపరు; అయితే "మనుష్యులు తాము వచించే నిరర్థకమైన ప్రతివచనము విషయమై అంత్యదినమందు లెక్క చెప్ప వలసి ఉండున"ని యేసుక్రీస్తు చెప్పుచున్నాడు. కాబట్టి పిల్లలు పలుకు మాటల విషయమై గొప్పజాగ్రత చేయవలసినది. అబద్ధములు ఆడుటను గురించి ఇదివరకే చెప్పితిమి. నోటివల్ల కలుగు పాపములను గురించి ఇంక కొన్ని సంగతులు వక్కాణించెదము.

దేవుని పేరు ప్రతిసంగతిలో చులకనగా ఉచ్చరింపకూడదు. అనేకులు ఆటలయందు పరిశుద్ధమైన ఆయన నామమును ఉచ్చరించెదరు. దేవుడు తన పేరును చులకనగా ఎత్తెడువారిని అపరాధులనుగా చూచును. ఎటువంటి ప్రమాణమును చేయకూడదు, "నా నేత్రములతోనే, నా నోటితోనే" అని బాస చేయుట యుక్తము కాదు. ఎంతమాత్రమైనను ప్రమాణము చేయకూడదు.

దుర్భాషలుకూడా జిహ్వాకృత పాపములే. దేవుడు అత్యంత పరిశుద్ధుడు గనుక, కొరగాని హాస్యములనున్ను పలుకులనున్ను సహించడు. దయ్యములకు అపవిత్రాత్మలు అని పేరు. దేవుని అనుకరించుటకు యత్నింపవలెనా! లేక పిశాచములను అనుకరించుటకు యత్నింపవలెనా!

దుర్భాషణములున్ను నిర్దయ వచనములున్ను బొత్తుగా పనికి రావు. పిల్లలకు, తమ్మును ఎవరైనను తిట్టినప్పుడు తిరిగీ తిట్టకుండునట్లు నేర్పవలసినది.

ఉబ్బవేయు మాటలుకూడా పనికిమాలినవే; కొందరు తమ గుణములు ఎంతో మంచివి అని పొగుడుకొందురు. ఆత్మస్తుతి ఘనమైనది కాదు. "నీ నోరు కాక ఇంకొకని నోరు నిన్ను శ్లాఘింపనిమ్ము; నీ పెదవులు కాక మరి యొకని పెదవులు నిన్ను పొగడనిమ్ము."

మాట్లాడుటకు ఎంత సిద్ధముగా నుందుమో అంతకు రెట్టిగా వినుటకై సిద్ధపడి ఉండగలందులకు దేవుడు మనకు రెండు చెవులనున్ను ఒక నాలుకనున్ను దయచేసెను.

"ఓ ప్రభువా! నా నోటియెదుట కావలి ఉంచి, నా పెదవులను కాపాడుము"ని దావీదువలె మనముకూడా ప్రార్థింప వలెను.

## ౨౨ పాఠము.

### నీళ్లమీద ప్రయాణము చేయుటను గురించి.

తెరగులు. - - - విధములు.
బొండ్లు. - - - - బోలుగలవి.
నిర్మించిరి. - - - చేసిరి.
సామగ్రి. - - - వస్తుసమూహము.

కొందరు లోతుగల నదులను ఈది దాటిపోదురు; కాని నీళ్లమీద ప్రయాణము చేయుటకు ఇంతకంటె సులభములై హానికరములు గాని కొన్ని తెరవులు కలవు. మొట్టమొదట మనుష్యులు చెట్ల బొండ్లమీద గాని, కలిపి కట్టిన కొయ్యలమీదగాని, ప్రయాణము చేసియుందురు. వారు నీళ్లలో గాలితో నింపబడిన తిత్తులవల్ల తమ్మును కాపాడుకొనిరి. చెట్లమొదళ్లు తొలిచి నిప్పుయొక్క సహాయమువలన వాటితో దోనెలు కట్టిరి. కొయ్యలను కలిపి కూర్చి పక్కలు ఏర్పరచి పడవను నిర్మించిరి. వాటిని గొప్పవిగా కట్టి వృద్ధిచేయుటవలన ఓడలు, అంతస్థులున్ను ఓడకొయ్యలున్ను తెరచాపలున్ను కలవై యుండెను.

పూర్వమందు ఓడలు కొయ్యతో చేసిరి. ఇప్పుడు చాలాకాలము ఉండునట్లు ఇనుముతో వాటిని చేయుచున్నారు. కొందరు ఇనుప ఓడలు మునిగిపోవునని అనుకొందురు. ఓడ ఆకారమును పట్టి చూచితే ఇనుము పలచగానుండును గనుక మునగదు. ఇత్తడిచెంబైన ఇనుపపాత్రయైన నీళ్లమీద తేలును.

గాలి కొట్టితే ఓడలకు మరీ మంచిది. ఎదురుగాలి కొట్టినా, లేక గాలి లేకపోయినా, అవి సాగిపోలేవు. అరువది సంవత్సరములక్రిందట పొగఓడలను నిర్మించిరి. నీళ్లు పాత్రలో బాగా కాగినప్పుడు ఆవిరివల్ల మూత పైకి ఎగురును అని ప్రతివానికి తెలుసును. పొగయంత్రములలో నీరు, ఒక దృఢమైన ఇనుపపాత్రలో కాగును. ఆవిరి

బలమువల్ల చక్రములు తిరుగును. ఈ చక్రమువల్ల తక్కిన యంత్ర సామగ్రియంతయు పని చేయును గనుక ఓడ సాగిపోవును.

పొగయంత్రములకు ఎప్పుడు అలుసట లేదు. పొగయోడలు నిలువ కుండా మహా సముద్రములను దాటిపోవును; అవి దాడిపోవునప్పుడు కొన్నిసమయములలో ౫౦౦ - మంది మనుష్యులనున్ను వేయికంటె ఎక్కువబండ్లు సామగ్రినిన్ని మోసికొనిపోవును.



## ౫౯ పాఠము.

### పెనిమిటియెడల చేయవలసిన పని.

#### మొదటి భాగము.

| | |
|---|---|
| యుక్తమైన. - - - | తగిన, మంచిదైన. |
| చిరునవ్వు. - - - | మందహాసము, చిన్నవవ్వు. |
| అలయిక. - - - | ఆయాసము. |
| శమించును. - - - | తగ్గును. |
| గయ్యాళి. - - - | గడుసు. |
| అప్రయోజనకరము. - | వ్యర్థము. |

భార్య పెనిమిటిని ప్రేమింపవలసినది. ఆమె ప్రతియుక్తమైన రీతి చేతనున్ను ఆయనను సంతోషింపచేసును. ఆయన పనిచేసి ఇంటికి వచ్చునప్పటికి శుభ్రముగా స్నానముచేసి సొగసుగా వస్త్రములు మొదల గువాటిని ధరించి ఇండ్లుకూడ చక్కగా సరిది చిరునవ్వుతో ఎదురు కొనును; ఆయనకు కావలసిన వన్నియయు సిద్ధముచేయును. ఆయనకు ఇష్టమైనట్లు ఆహారము వండించి పెట్టును; అప్పుడు ఆయన విస్తారము పనిచేత అలయిక పొందినప్పటికిని పొరుగువారి కలహములనుగురించి గాని లేక, ఇతరములైన పోట్లాటలను గురించి గాని ఆయనతో చెప్పి ఆయనకు చికాకు పుట్టింపదు.

పెనిమిటి ముక్కోపి ఐనపక్షమందు చేతనైనంత. మట్టుకు ప్రియ వచనములు పలికి, కోపము పుట్టకుండునట్లు ప్రవర్తించును. అగ్ని, నీటివల్ల చల్లారినట్లు, ఆమెయొక్క శాంతివల్ల ఆయన కోపము శమిం

చును. ఆమె అక్రమముగా నిందింపబడినప్పుడు సహితము కోపము లేక మాట్లాడును. ఒకనికి గయ్యాళియైన భార్య ఉన్నందువలన ఇంటిలో సుఖము లేకపోయెను. గనుక దుర్మార్గులతో చేరి వాడు తరుచుగా తాగుబోతాయెను. వాడు ఇంటికి వచ్చినప్పుడెల్లా, భార్య తిట్టితే దానిని అప్పుడప్పుడు కొట్టేవాడు. ఈమెతో ఈ విధమున ప్రవర్తింపక నీ పెనిమిటియెడల సర్వదా దయగా ఉండవలసినదని ఎవరో చెప్పిరి గనుక, ఆమె అట్లు చేసెను. అందుమీదట వాడు తాగి ఇంటికి తిరిగి వచ్చినప్పుడు, "ఇది మంచి దయగలది; ఇల్లుకూడా చక్కగా ఉన్నది. ఇక్కడకు నేను తిరిగి వచ్చెదను" అని మనస్సులో అనుకొని, తాగుట మానివేసెను.

ప్రియురాలైన భార్య తన పెనిమిటి తప్పులవిషయమై ఇతరులతో మొరబెట్టదు. ఆయన దుష్టగుణములను గురించి సయితము ఆలోచించుటకు సహించదు. ఇందుకు బదులుగా వాని మంచి గుణములను గురించే ఆలోచించును.

భార్య తన పెనిమిటిని ఘనపరిచి ఆయనకు లోబడి యుండవలసినది. భార్య తన పెనిమిటిని మర్యాద చేయవలసినది. "వనితలారా! ప్రభువునకు వలె మీ పెనిమిట్లకు లోబడుడి" అని బైబిలు చెప్పుచున్నది. మనము అందరికంటె దేవునిని ఎక్కువగా మన్నింపు అడుగుకొనవలసినది. మనుష్యునికి లోబడినదానికంటే ఆయనకు ఎక్కువగా లోబడవలసినది. పెనిమిటి తన భార్యతో విగ్రహారాధన చేయుమనిన్ని దొంగిలించుమనిన్ని అబద్ధములు ఆడుమనిన్ని చెప్పితే ఆమె దెబ్బలు తినుటకైన ఒప్పవలసినదే కాని, వీటిని చేయకూడదు; కాని పెనిమిటి ఆజ్ఞాపించెడు అన్నియు మంచివియు, న్యాయమైనవియునైతే ఆమె వాటికి లోబడి ఆయనను మర్యాద చేయవలసినది.

యోగ్యురాలైన భార్య ఇంటిలో కలిగినమట్టుకు తృప్తిపొందియుండును. కొందరు వివేకశూన్యులైన స్త్రీలు ఉన్నవాటితో తృప్తినొందక, సొమ్ములు కొనిపెట్టుమనిగాని ఇంక కొన్ని అప్రయోజనకరములైన వస్తువులు సంగ్రహింపుమనికాని తమ పెనిమిటులను తొందర చేయుచుందురు. భాగ్యవంతులైన తమ పొరుగువారిని చూచి అట్లు తమరు ఉండుటకు తగినశక్తి ఉన్నది లేనిది విచారింపకుండానే, తమరు అట్లు

ఉండుటకు ప్రయత్నపడుదురు. బుద్ధిమంతురాలైన భార్య ఇటువంటి వాటి విషయమై తన పెనిమిటిని తొందరపెట్టక ఉన్నవాటితో తృప్తి పొంది యుండును.

## ౫౭ పాఠము.

### నులిపురుగును, కురుపును గురించి.

ఉలికిపడుట. - - - - - దద్దిరిల్లుట.
కృశించుట. - - - - - చిక్కుట.
దివ్యౌషధము. - - - - - మంచిమందు.

ఒక పిల్ల నులిపురుగులవలన బాధనొందుచున్నప్పుడు దీనివల్లనే బాధపడుచున్నదని చెప్పలేము. ఎందుకంటే ఈ రోగమునకున్ను ఇంకా కొన్ని ఇతర జాడ్యములకున్ను ఏక చిహ్నములు కనుపడుచున్నవి. పళ్లుకొరుకుటయున్ను నిద్రలో ఉలికిపడి లేచుటయున్ను నిశ్చయింపతగని ఆకలియున్ను కడుపు ఉబ్బుటయున్ను శరీరము కృశించుటయున్ను ఈ రోగమునకు సాధారణమైన చిహ్నములు. చెడిపోయిన ఆహారము తినుటయున్ను ఉప్పు తినకపోవుటయున్ను దీనికి సామాన్యకారణములు. కొన్ని సంగతులలో పరగడుపున, కొంచెము ఉప్పునీళ్లలో కలిపి పుచ్చుకుంటే ఈ పురుగులు చచ్చును. ఈ రోగమునకు మిల్లిగరి బెడు చిట్లాముదమున్ను, మిల్లిగరిబెడు కర్పూరతైలమున్ను దివ్యౌషధము. నులిపురుగులకు దానిమ్మవేరు బెరడుయొక్క కషాయము ఇచ్చి కొంచెము చిట్లాముదముకూడా ఇవ్వవలసినది.

అనేకవిధములైన కురుపులు కలవు. పిల్లలకు పళ్లు వచ్చేటప్పుడు అవి వచ్చును. వాటివల్ల హాని లేదు; వాటికి మందువేయకపోతే మంచిది. తరుచుగా వాటివల్ల శరీరమునకు విశ్రాంతి కలుగును.

గజ్జి చర్మమునకు వచ్చేడు సర్వసాధారణమైన రోగము. చర్మమందు పుట్టి పురుగువల్ల ఇది కలుగుచున్నదని ఊహించుచున్నారు. తరుచుగా స్నానము చేయకపోయినా మురికిగుడ్డలు వేసుకొనినా మురికి పరుపులమీద పండుకొనినా గజ్జి వచ్చును. గంధకము నూనెతో కలిపి శరీరమునకు రాయుట దీనికి దివ్యౌషధము. సుమారు పావు

గంటసేపు ఒంటికి ఇముకునట్లు రాయవలసినది. రాత్రివేళ నిప్పు దగ్గర రాసితే చాలమంచిది. రాత్రియంతను ఉంచి ప్రొద్దున వేణ్ణీళ్లతో నున్ను సోపుతోనున్ను కడగవలసినది. ఈ రోగము కుదురువరకు ప్రతి రాత్రియందున్ను రాచుచుండ వలసినది. గజ్జి పురుగులను చంపుటకై ఉడుకునీళ్లు, పైనవేసికొనిన బట్టలమీద పోయవలసినది.

పుండ్లు కుదుర్చుటకు నీళ్లు మంచి సాధనము. మెత్తనిబట్టలు చాల మడతలు పెట్టి వేణ్ణీళ్లలో ముంచి పిండిన తరువాత పుండ్లు లేచిన స్థలమును పొడిగానున్న పెద్ద గుమాలుతో కప్పి, ఒక మడత తరువాత ఒకటి దానిమీద వేయుచుండవలసినది.

వ్రణముమీద ఏకధారగా నీళ్లు పోసితే చాలామంచిది. ఒకటి రెండు అడుగుల ఎత్తునుండి పావుగంటకంటె ఎక్కువగా నీళ్లు పోయవలసినది. మధ్య మధ్య కల్లుతో ఉడకపెట్టిన పిండి వాటికి కట్టితే మిగుల ఉపయోగించును.



## ౫౮ పాఠము.

### ఒక ముఖ్యసంగతిని గురించి.

యోగ్యురాలు. - - - గుణవంతురాలు.

---- విచారము.

లాజరుయొక్క సహోదరులైన మార్తా, మరియలు అనువారు యేసును భోజనమునకు పిలిచిరి. మార్తా యోగ్యురాలు; అయితే యేసు చెప్పుచున్న మాటలు వినక ఆయనకున్ను ఆయన శిష్యులకున్ను తగిన భోజనపదార్థములను సిద్ధము చేయించుచుండెను.

ఈమె చెల్లెలైన మరియ, యేసు పాదములయొద్ద కూర్చుని ఆయన మాటలు వినుచుండెను. ఇది మార్తా చూచినప్పుడు "ప్రభువా! నా చెల్లెలు నాకు ఏమియు సహాయము చేయకున్నందుకు నీకు చింతలేదా? కనుక ఆమెతో నాకు సహాయము చేయుమని చెప్పుము" అని యేసుతో అనెను. అందుకు యేసు ఆమె వైపునకు తిరిగి "మార్తా! మార్తా! నీవు అనేక సంగతులనుగురించి చింతించి తొందరపడుచున్నావు; కాని

ఒక సంగతి అగత్యమై యున్నది. మరియు తన దగ్గిరనుండి ఎప్పుడును తొలగని మంచిదానిని కోరుకొనెను" అని చెప్పెను.

స్త్రీలు గృహకృత్యములను గురించి శ్రద్ధచేయుట యుక్తమే; కాని ఇంతకంటె ఎక్కువ ముఖ్యమైన ఆత్మరక్షణమును గురించి నిర్లక్ష్యము చేయకూడదు. మనము చావువల్ల, ఈ లోకమునున్ను ఈ లోకములో నున్నవాటినిన్ని ఎంత త్వరితముగా ఎప్పటికిన్ని వదిలిపెట్ట వలెనో మనకు తెలియదు. గనుక మనము పరలోకమందుండెడు వాటిని ప్రేమించి, "అన్నిటికంటే మొదట దేవుని రాజ్యమును వెతుకవలెను." మనము, యేసు బైబిలునందు చెప్పినమాటలు విని, రక్షణకొరకు ఆయన దగ్గరకు వెళ్లి పరిశుద్ధాత్మయొక్క సహాయము మూలముగా ఆయనవలె ప్రవర్తింపవలసినది. "మనుష్యుడు లోకమంతను తన వశము చేసికొని, తన ప్రాణము పోగొట్టుకొనిన పక్షమందు అతనికి ఏమి లాభము? మనుష్యుడు తన ఆత్మకు బదులుగా ఇచ్చేది ఏమిటి?" (మత్తై, 16: 26.)



## ౫౯ పాఠము.

### కాయకష్టమును గురించి.

అనర్థము. - - - కష్టము.
విడి. - - - - ప్రత్యేకము.
చాకచక్యము. - - చురుకుతనము.
కష్టజీవి. - - • - పాటుబడి బ్రతుకువాడు.

పిల్లలకు ఏ పనియు లేకపోవుట గొప్ప అనర్థము. ఒక తెలివి గల పిల్లవానిచేత ఏ పనియైనను చేయింపకుంటే ఏదో ఒక హానికరమైన పని చేసును. తరుచుగా ఆ పిల్లవాడు దుర్మార్గులతో చేరి జూదమాడుటయున్ను దొంగిలించుటయున్ను నేర్చుకొనును. ఒక మొద్దుపిల్లవాడు, ఏ పనియు చేయకపోతే అంతకంతకు ఎక్కువ మొద్దుగానున్ను సంతోషము లేనివాడుగానున్ను ఉండును.

పిల్లలు తమకు తామే సహాయము చేసికొనుటకు వారికి ఎంత బాల్యమందు నేర్పితే అంత మంచిది. వారు తమంతట తామే స్నానము చేసి బట్టలు కట్టుకొని తమ బట్టలవిషయమై జాగ్రత చేసికొనుటకు వారు నేర్చుకొనవలసినది. వారు తగినంత పెద్దవారైనప్పుడు, తమ తమ్ముని గురించి గాని చెల్లెలినిగురించి గాని జాగ్రత చేయవచ్చును. పల్లెడు దిక్కునుండు మొగపిల్లలు వంటచెరుకు నిమిత్తము పుల్లలు ఏరి తోటలో పనిచేసి ఇంకా కొన్ని స్వల్పకార్యములు చేయవచ్చును. ఆడుపిల్లలు గృహకృత్యములు గొన్ని జరపవచ్చును. అందరున్ను బద్ధకులు కాక ఉండునట్లు జాగ్రత చేయవలసినది.

పిల్లలను క్రమముగా వేళకు పాఠశాలకు పంపవలయును. అల్పమైన మిషలచే వారిని ఇంటిలో ఉండనీయగూడదు. వారు ఒక సమయము నియమించుకొని పాఠములు నేర్చుకొనవలయును. వారు కొంచెముసేపు ఆడుకొనునట్లు కూడా చేయవలసినది.

ఒక పిల్లవాడు తనతోటివారు మిక్కిలి ఉల్లాసముతో ఆడుకొనుచుండగా వాండ్లతో కలియక ఊరకే కూర్చుండినను పండుకొనినను సహింప కూడదు.

పిల్లలు ఎప్పుడు ఊరకే ఉండకుండా వారిచేత ఏదో ఒక పని చేయించుచుండవలసినది. కొన్ని (విడి) నిముషములైన వ్యర్థపుచ్చుట మంచిది కాదని వారికి నేర్పుడి. వారు యుక్తముగానున్ను చాకచక్యముతోనున్ను పని నెరవేర్చునట్లు వారికి నేర్పుడి. పిల్లలు మొదట ఏదైన చేయనారంభించినప్పుడు త్వరగానున్ను సరిగానున్ను చేయకపోతే తరువాత వారు దానిని బాగుగా ఎప్పుడున్ను చేయులేరు.

కష్టజీవులు సోమరిపోతులకంటే ఎంతో ఎక్కువ సుఖమును అనుభవింతురు. "కష్టపడి పనిచేయువారు భాగ్యవంతులు అగుదురు గాని, నిద్రమత్తుతనమువల్ల ఒకడు చింపిరిగుడ్డలు కట్టుకొనవలసి వచ్చును" అని సొలొమోను అను ఆయన చెప్పుచున్నాడు.





## ౨౦ పాఠము.

### పొగగుమ్మటమును గురించియు, పాతాళభేదిగంటను గురించియు.

ఉష్ణము. - - - వెచ్చనిది.
పాతాళభేది. - పాతాళమును తాకునది.

విచిత్రములైన రెండు యంత్రములను నిర్మించిరి. పొగగుమ్మటము అనుదానివల్ల మనుష్యులు ఆకాశమునకు ఎగరవచ్చును; పాతాళభేదిగంటవలన వారు నీళ్లలోపలికి పోగలరు. ఉష్ణమైన గాలి సాధారణ వాయువుకంటే చులకనై యుండును గనుక పైకి పోవును. ఇంగ్లాండు దేశమందు పిల్లలు తరుచుగా పలుచని కాగిదములతో పొగగుమ్మటములు కట్టుదురు; కాగిదములతో చేసిన సంచులను వేడిపొగతో నింపి (వాటినెక్కి) పైకి పోదురు; పెద్ద పొగగుమ్మటములు పట్టుతో చేసి మెరుగునూనెతో పూయుదురు. వాటిని పొగతో నింపక ఒక విధమైన చులకని గాలితో నింపుదురు. పైసంచికి ఒక వల చుట్టుదురు. ఆ వలకు ఒక విధమైన పంజరము కట్టి మనుష్యులు అందులో ఎక్కి పోదురు. మనుష్యులు పొగగుమ్మటముల మూలముగా భూమిమీద నుండి పైకి నాలుగు మైళ్లదూరము వెళ్లిరి. అక్కడ ఉండు వాయువు పలచగానున్ను చల్లనగానున్ను ఉండును.

వట్టిచెంబు తీసికొని మూతిని క్రిందికిపెట్టి నీళ్లలో నిలువుగా ముంచితే నీళ్లు దీనిలోపలికి పోవు. సరిగా పైకి తీసి పరీక్షించితే చెంబు లోపల పొడిగానుండును. ఇందువల్ల నీళ్లు లోపలికి పోలేదని తెలియుచున్నది. దానిలోపలికి నీళ్లు ఎందుకు పోలేదు? అది వాయుపూరితమై యుండుటచేతనే. చెంబునిండా నీళ్లు ముంచవలెనంటే పక్కగాపెట్టి ముంచితే గాలి అందులోనుండి వెలపటికి పోవును.



పాతాళభేదిగంట, గంటవలెనుండు ఒక ఇనుపపాత్ర. అది లోపల కొందరు నిలుచుండుటకు తగినంత పెద్దది. దానిని గొలుసునకు తగిలించి నీళ్లలోకి దింపుదురు. మనుష్యులు నిలుచుండి యుండుటకు లోపల ఒక బల్ల ఉండును. గంటలోనుండు గాలి నీళ్లను లోపలికి రానివ్వదు. గొట్టములవల్ల క్రొత్తగాలి లోపలికి విడుతురు.

సముద్రములో పడిన ఖజానాపెట్టెలను ఈ గంటల సహాయముచే పైకి తీయుదురు. మరియు ఓడలు పోవునపుడు అడ్డమువచ్చు నీళ్లకింది రాళ్లను తీసివేయుటకున్ను నీళ్లకింద ఏమైన కట్టుటకున్ను ఇవి ముఖ్యముగా పనికివచ్చును.

# అయిదవ నెల

## రెండవ భాగము.

### ౬౧ పాఠము.

భార్య పెనిమిటియెడల చేయవలసిన పని.

నిరర్థకము. - - వ్యర్థము.
అభ్యసించుట. - నేర్చుకొనుట.
ధర్మాత్ముడు. - - పుణ్యమందు ఇచ్ఛకలవాడు.
మనోరంజకము. మనస్సుకు ఉల్లాసకరము.

స్త్రీలు అందరు తమ పెనిమిట్లను తరుచుగా తమ మాటను అంగీకరించువారినిగా చేయుదురు. అయితే వారు వారిని ఆజ్ఞాపింపకూడదు. ఇట్లు చేయుట యుక్తమైనది కాదు. అయితే వారి ప్రేమయనే పట్టు త్రాళ్లచేత విన్నని మార్గమునకు చేర్చుటకై యత్నింపవలసినది.

యోగ్యురాలైన భార్య తన పెనిమిటి తెలివికలవాడై ఉండుటకు కోరును. ఎట్లనగా, సాయంకాలమందు ఆయన ఇంటిలో ఉన్నప్పుడు ఆమె, బట్టలు సొమ్ములు చిన్న కలహములు నిరర్థకమైన సంభాషణలు ఇవి మొదలుగా గల పనికిమాలినవాటిని గురించి మాట్లాడదు. ఆయన లాభకరమైన పుస్తకములను చదువునట్లు యత్నించును. యూరోపు దొరలు తమ ఉద్యోగస్థానములనుండి సాయంకాలము ఇంటికి వచ్చినప్పుడు, తమ భార్యలకు మంచి గ్రంథములు చదివి వినుపించెదరు. ఈ రీతిని విస్తారముగా విద్యను అభ్యసింపవచ్చును. ఈ దేశ స్త్రీలుకూడా తమ పెనిమిట్లు ఈ విధముగా చేయునట్లు ప్రేరేపింపవలసినది.

గుణవంతురాలైన భార్య తన పెనిమిటి ధర్మాత్ముడు కావలెనని కోరును. కొందరు గర్విష్ఠులైన స్త్రీలు తమ భర్తలు వెలగల బట్టలు ధరించుకొని మంచి బల్లలు కుర్చీలు మొదలైనవి చేయింపవలెనని మాత్రమే కోరుదురు.

బుద్ధిమంతురాలైన భార్య తన పెనిమిటి అంత అవివేకమున సొమ్ము వ్యయము చేయుటకు కోరక, ఇతరులకు మేలు చేయుటయందు సొమ్ము వినియోగింపచేయ కోరును. ఆమె, యోబువలె తన భర్త గుడ్డివారికి నేత్రములవలె ఉండునట్లును, కుంటివారికి పాదములవలె ఉండునట్లును, బీదలకు తండ్రివలె ఉండునట్లును ప్రతి సత్కార్యమందును ఆసక్తి కలిగియుండునట్లును కోరును.

సుశీల యగు భార్య తన పెనిమిటి దైవభక్తుడయి యుండుటకు కోరును. భక్తిపరురాలైన స్త్రీ భక్తిహీనుని వివాహము చేసికొన కూడదు. మరియు అన్ని అవస్థలలో భార్య తన పెనిమిటి వాస్తవ క్రైస్తవుడు కావలెనని కోరును. ఆయనతో ఎప్పుడును మతమును గురించే మాట్లాడుటవలన ఆయనకు వినుకుపుట్టి కోపము రాకుండా కనిపెట్టును. ఆమె మనోరంజకమైనట్టియును పరిశుద్ధమైనట్టియును తన ప్రవర్తనముచేత ఆయన యేసును నమ్మునట్లు చేయవలసినది.

"అటువలె స్త్రీలారా! మీరు స్వపురుషులకు లోబడి యుండుడి, వారిలో ఎవరైన సువార్తను నమ్మకపోతే, సువార్తమూలముగా కాకుండా వారు భార్యలయొక్క భయభక్తులతో కూడుకొనిన పరిశుద్ధ ప్రవర్తనము చూచి నమ్ముదురు" అని అపొస్తలుడైన పేతురు చెప్పుచున్నాడు. (1 పేతురు, 3: 1, 2.)

భార్య తన పెనిమిటి, యేసుకు శిష్యుడగుటకును తమరిద్దరుకూడా నిత్యము పరలోకమందు నివసించుటకును రహస్యముగా ప్రార్థింపవలసినది.



## ౬౨ పాఠము.

### పొంగును గురించియు ఉబ్బసపు దగ్గును గురించియు.

నులివెచ్చనినీళ్లు. - - గోరువెచ్చనినీళ్లు.

ఉద్దుకుడుచుకొన్నట్లు. - ఊపిరితిరగనట్లు.

పొంగు జ్వరముతో ఆరంభించును; పిల్ల ఇది వచ్చినప్పుడు నిద్ర మత్తుగా ఉండును. కండ్లవెంబడి ముక్కువెంబడి నీళ్లు కారును. అవి ఎర్రగా ఉండును. నాలుగవ రోజున ఒంటిమీద చిన్న పొక్కులు లేచును. విరేచనము కాకపోతే దినము విడిచి దినము చిట్లాముదము ఇవ్వవలసినది. పిల్లను చల్లగా ఉండెడు స్థలమునందు పరుండపెట్టి నిమ్మళముగా ఉంచవలసినది. జావగాని ఇంక ఏమైన చులకని పదార్థముగాని తినుటకు ఇవ్వవలసినది. చన్నీళ్లు ధారాళముగా త్రాగనివ్వవచ్చును.

శరీరమును ప్రతిదినము నులివెచ్చని నీళ్లతో నిమ్మళముగా కడగవలసినది. అయితే స్నానము చేయించునప్పుడు రోగికి గాలి తగలకుండా చేయవలసినది. ఎందుకంటే ఈ వ్యాధియందు చలిగాలి తగిలితే చాలా హాని కలుగును.

సుమారు నాలుగు రోజులలో పొక్కులు అణగిపోవుటకు ఆరంభించును; ఏడవ రోజుకు బొత్తుగానే పోవును. అయితే చర్మము గరగరలాడుచుండి పొట్టు రేగును.

గొంతుదగ్గు జలుబువలెనే ఆరంభించును. సుమారు ఎనిమిది దినములు అయిన తరువాత అసలైన దగ్గు కనుపించును. పిల్ల ఆ దగ్గు పోకమునుపు ఉద్దుకుడుచుకొన్నట్టు ఉండును. ఈ రోగము ఆరవ వారము మొదలుకొని మూడునెలలలోగా పోవును. సర్వసాధారణముగా దగ్గురాని సమయములందు పిల్ల ఎప్పటివలెనే ఆడుకొనును.

ఈ రోగ ప్రారంభమందు జ్వరము ఉండి విరేచనము కాకపోతే కొంచెము చిట్లాముదము ఇవ్వవచ్చును; త్వరగా అరుగు ఆహారము ఇవ్వవలసినది. జలుబు చేయకుండా జాగ్రత చేయువలసినది.

దగ్గు పిల్లను చాలకాలమువరకు వదలిపోనియెడల ఊరుమార్చిన పక్షమందు రోగము కుదురును. రెండు మూడు మైళ్లదూరమునకు తీసుకొనిపోతే తరుచుగా చాలును.

పొంగున్ను గోరింత దగ్గున్ను అంటురోగములు. కుటుంబములో ఒకరికి కనుపించినయెడల అదివరకు రానటువంటివారందరికి కూడా కనుపించును. ఇదివరకు ఇవి ఒకపర్యాయము వచ్చినవారికి రెండవ పర్యాయము అరుదుగా సంభవించును. మంచిజాగ్రత చేసితే వీటివల్ల హాని కలుగదు.

## ౬౩ పాఠము.

### కుటుంబపు ప్రార్థన.

మానసికప్రార్థన. - - మనస్సుతో చేయు ప్రార్థన
సంభవించును. - - కలుగును.
సంగ్రహించును. - - సంపాదించును.

రహస్యప్రార్థన అనియు ప్రకటప్రార్థన అనియు కుటుంబపు ప్రార్థన అనియు మూడు విధములగు ప్రార్థనలు కలవు. మనము రహస్యముగా గదులలో ఉండి మనకు కావలసినవి దేవుని అడుగవలసినది. దేవాలయమందు ఆయనను ఆరాధింపవలసినది; ఇంతేకాకుండా ప్రతి కుటుంబములో అందరు కలసి ప్రొద్దున సాయంకాలమున ప్రార్థింపవలసినది.

మనుష్యుడు పెండ్లిచేసికొనగానే కుటుంబపు ప్రార్థన చేయుట ఆరంభింపవలసినది. వారు పాడగలిగితే కీర్తనలో రెండు మూడు చరణములు పాడవలసినది. తరువాత బైబిలులో ఒక అధ్యాయము చదివి ప్రార్థన చేయవలసినది. ప్రొద్దున పాతనిబంధనలో ఒక అధ్యాయమున్ను

రాత్రి క్రొత్తనిబంధనలో ఒక అధ్యాయమున్ను చదువవచ్చును. మానసిక ప్రార్థనే శ్రేష్ఠమైనది. దేవుడు అట్టి ప్రార్థన, ఎటువంటి అల్పమైన మాటలతో చేసినను వినును. అటువంటి ప్రార్థనలు కావలసిన పక్షమందు ఇదివరకేర్పడిన చక్కని ప్రార్థనలలో కొన్నిటిని ఉపయోగింపవచ్చును.

కుటుంబపు ప్రార్థన చేయునప్పుడు పిల్లలు అల్లరిచేయకుండా వినునట్లు చేయవలసినది. పిల్లలు అలసట పొందుదురు గనుక విస్తారము సేపు ప్రార్థన చేయకూడదు. రాత్రియందు భోజనమైన తరువాత పిల్లలు నిద్రపోదురు గనుక భోజనము కాకమునుపు కుటుంబ ప్రార్థన చేయవలసినది.

ప్రార్థన పగటి మేలుల పెట్టెను తీసి రాత్రి సంభవించు హానుల పెట్టెను వేయు చెవి వలె ఉన్నది. ఏకాకులను కుటుంబములయందు ఉంచువాడు దేవుడే. ప్రతిదినము మనకు ఆయనే ఆధారమని తలంచుకొనవలసినది. కుటుంబపు ప్రార్థన చాలామట్టుకు పాపమును అణచివేసును. తన కుటుంబముతో కలసి ప్రార్థించు యజమాని తన బోధకు వ్యతిరిక్తముగా చెప్పుటకైన చేయుటకైన సిగ్గుపడును. చాలా సంగతులలో పిల్లలకు దీనివల్ల గొప్ప మేలు కలుగును.

కొందరు కుటుంబపు ప్రార్థన చేయుటకు కాలములేదని అందురు. "పాపమువల్ల ఏమిన్ని దొరకదు. ప్రార్థనవల్ల ఏదిన్ని పోదు." "పరలోకమును గురించి మొదట విచారించుటచే భూలోకమందు పని బాగుగా జరుగును" అను నిజవాక్యములను వారు మరుచుచున్నారు. శ్రద్ధాశ్రమములు కలిగిన ప్రతికుటుంబము ప్రార్థనకొరకు సమయము సంగ్రహించును.



# ౬౮వ పాఠము.

## కులమును గురించి.

విభజించుట. - - - ప్రత్యేకించుట.
సందర్శించుట. - - - తటస్థించుట.
తేరబారి చూచుట. - - కన్నులు విప్పిచూచుట.
కులావలంబనము. - - - కులసంబంధము.

హిందువులు అవివేకముగా కులమును అనుసరించినందుకు ప్రసిద్ధి కెక్కియున్నారు. పూర్వము అనేకజాతులవారు కొంతమట్టుకు కులమును అనుసరించిరి గాని దానివలన వచ్చు నష్టములు చూచి దానిని విసర్జించిరి.

దేవుడు "భూమిమీద నివసించుటకై అందరిని ఏకరక్తముచేతనే సృజించెను." అందరున్ను మొదటి తలిదండ్రులైన ఆదాము హవ్వల వలన పుట్టినవారే. మనకందరికి పరలోకమునందు ఒకడే తండ్రి కలడు. ఆయన మనమందరము ఒకరిని ఒకరు సహోదరులవలె ప్రేమింపవలెనని కోరుచున్నాడు. కులమువలన జనులు ప్రత్యేకము విభజించుకొని ఒకరితో ఒకరు కూడి భుజింపక, ఒకరి పిల్లలను ఒకరు వివాహము చేసుకొనక, ఇంక ఎటువంటి సంబంధమున్ను లేకుండా ఉందురు. కొన్నిచోట్ల మాలవాండ్రలో సయితము దాదాపుగా ముప్పది విభాగములు కలిగి యుండును.

కులమువలన నాగరీకత వృద్ధి కాదు. ఇంగ్లాండులో ప్రతివాడు తనకు ఇష్టమైన ఉద్యోగము కోరుకొనవచ్చును. గనుక ప్రతిది శ్రేష్ఠముగానే ఉండును. ఈ దేశమునందుండువారు తమ తండ్రులు చేయు వృత్తులకు తమరు తగినవారైనను కాకపోయినను వాటినే అనుసరించి పోవలసినదని అందరు, ఒకప్పుడు, ప్రయాణము చేయు సమయమందు కొందరు దాహము ఇచ్చుటకు తమ కులమువారు సందర్శింపక పోవుటవల్ల ద్దప్పిచే చచ్చెదరు. కొందరు భోజనము చేయు నప్పుడు ఇతర కులస్థులు చూచెదరేమో అని అడవిమృగములవలె ఇటు అటు తేరబారి చూచెదరు. ఒకప్పుడు ఇంగ్లీషు చిన్నపిల్ల ఒక చెరసా

లలో పోవుచుండగా, ఒక దుర్మార్గుడు కూర్చుండి భోజనము చేయుచున్న చాపను ముట్టుకొనెను. అప్పుడు ఆ దొంగ తక్షణమే అన్నమును పారవేసెను. అనేకములగు తగిన మనువులు కులభేదములవలన ఆగిపోవును. కులమువలన ఒకరిమీద ఒకరు విరోధము కలిగియుందురు. ఒక దీనుడైన క్రైస్తవుడు ఒక గ్రామములో వ్యాధిగ్రస్తుడగును. అప్పుడు వాని కులము ఎరుగమని చెప్పి వానియొద్దకు ఎవరున్ను వెళ్లరు గనుక వాడు చచ్చును.

పిల్లలకు కులావలంబనమువలన బుద్ధిహీనతయున్ను పాపమున్ను వచ్చునని తెలియచేయవలసినది. వారు కులసంబంధమైన పేర్లు పెట్టి పిలువకుండునట్లు చేయవలసినది. ప్రపంచమునందు మంచి కులము అనియు చెడ్డకులము అనియు రెండు కులములు మాత్రము కలవు. మంచివారు గొప్ప కులస్థులు. చెడ్డవారు హీనకులస్థులు. మనము గర్విష్ఠులమున్ను ఇతరులను ద్వేషించువారమున్ను కాక అందరియెడల కనికరము చూపించుదము.

## ౬౫. పాఠము.

### కాలప్రమాణ విధములను గురించి.

ఉదయము. - - - పొడుచుట.
అస్తమయము. - - - క్రుంకుట.
చాంద్రమానము. - - చంద్రసిద్ధాంతము.
ప్రమాణము. - - - మితి.
ఛాయాఘటీయంత్రము. - నీడగడియారము.
నిర్మించుట. - - - - చేయుట.
అమరత్వము. - - - చావులేకపోవుట.

కాలము అనేకవిధములుగా విభజింపబడినది. సూర్యోదయాస్తమయకాలములు పగటినిన్ని రాత్రినిన్ని చేయుచున్నవి. చంద్రుడు ౨౯-దినములలో భూమిచుట్టును తిరుగును. ఈ కాలమునకు చాంద్రమానపు నెల అని పేరు. భూమి సుమారు ౩౬౫-దినములలో అనగా

ఒక సంవత్సరములో సూర్యునిచుట్టును తిరిగివచ్చును. సంవత్సరము కాలములుగా విభజింపబడినది.

సూర్యోదయమున్ను మధ్యాహ్నమున్ను సూర్యాస్తమయమున్ను సులభముగా తెలుసుకొనవచ్చును. అయితే మనము తరుచుగా ఈ మధ్యకాలములను కూడా తెలుసుకొనవలసినది. పిల్లలు కొన్ని వేళల తొమ్మిది గంటలకు బడికి పోవలసి ఉండును, అప్పుడు వారికి కాలము ఎట్లు తెలియుచున్నది?

మొదట సూర్యప్రకాశము గల వస్తువుల నీడయొక్క పొడవును బట్టి కాలప్రమాణమును కనుగొనిరి. సూర్యోదయాస్తమయములందు మన నీడలు మిక్కిలి పొడవుగా ఉండును. మధ్యాహ్నమందు మిక్కిలి పొట్టిగా నుండును. ఒక పలకమీద గంటలసంఖ్య వ్రాసి ఒక పుడకయిన లేక లోహపు తునకైన దానిలో గుచ్చి, ఒక విధముగా నిలుచుండబెట్టితే కొంచెము ఎచ్చు దగ్గుగా కాలము తెలుసుకొనవచ్చును. ఈ పనిముట్టుకు ఛాయఘటీయంత్రమని పేరు.

మబ్బుపుట్టిన దినములలోనయిన రాత్రివేళనయిన ఈ ఛాయఘటీయంత్రమువలన ఉపయోగములేదు; గనుక నీళ్లగడియారములను నిర్మించిరి. ఒక పాత్రలోనుండి నీళ్లు కారుటవల్ల గంటలు తెలుసుకొనవచ్చును. ఉదకమునకు బదులుగా సన్నటి ఇసుకకూడా ఉపయోగించిరి.

ఏడువందల సంవత్సరముల కిందట గుండ్లవలన నడిచే గడియారములను నిర్మించిరి. ఈ గుండ్లవలన ఒక చక్రమునకు చుట్టినదారము క్రమముగ విప్పబడును. అందువలన గడియారముయొక్క ముఖము మీదనున్న ముండ్లు గుండ్రగ తిరుగును. గడియారములు పెద్దవి గనుక చేత పుచ్చుకొని తిరుగలేరు. మూడు వందల సంవత్సరముల క్రింద చేగడియారములను నిర్మించిరి. అవి ఉక్కుచుట్టవలన తిరుగును.

మనము అమరత్వమునకై సిద్ధపడుటకు మనకు ఈ లోకమందు కాలము ఇవ్వబడినది; గనుక కాలము వ్యర్థము పుచ్చకుండా జాగ్రత చేయవలసినది. మన పని నిమిత్తము నిర్ణయకాలములను నియమించుకొనుట మంచిది.



## ౬౬ పాఠము.

ఇరుగు పొరుగువారిని కనికరించుటను గురించి.

నిరాకరించుట. - - - తిరస్కరించుట.
జాడ్యము. - - - - రోగము.
తొణుకుట. - - - - కదులుట.

మనము అందరియెడల కనికరము చూపింపవలసినది. "నీ పొరుగు వానిని నీవలె ప్రేమించుము" అని బైబిలు చెప్పుచున్నది.

యోగ్యులైన పొరుగువారు ఇతరులకు తొందర కలుగచేసెడు ప్రతి దానిని విసర్జింతురు. వారు తమ పశువులను ఇతరుల తోటలలో పడకుండ చేతురు. వారు తమ పిల్లలు రాళ్లువిసిరి తమ పొరుగువారికి తొందర కలుగచేయకుండునట్లు చేతురు. ఏమయిన కలహము సంభవించెనా, తత్క్షణమే విచారించి తప్పు ఉన్నపక్షమందు దిద్దుకొందురు. గుణవంతులైన పొరుగువారు ఒకరితో ఒకరు సమాధానము కలిగియుండుటకు యత్నించెదరు. తమ ఇంటిదగ్గిర ఉన్నవారు తమ్మును తిట్టి నిరాకరించుచున్నప్పటికి అపకారమునకు ఉపకారమును చేసి వారిని తమ స్నేహితులనుగా చేసుకొనుదురు.

యోగ్యులైన పొరుగువారు ఒకరింటికి ఒకరు తరుచుగా వెళ్లి తొందర చేయరు. "నీ పొరుగువాని ఇంటికి (తరుచుగా) పోవద్దు; ఎందుకంటే అందువలన వానికి ఏ విషయమైన అయానము తోచి నిన్ను వాడు అసహ్యించుకొనునేమో" అని సొలొమోను చెప్పుచున్నాడు. ఇంతేకాకుండా వారు ఎదురుబోతులున్ను పరులజోలికి వెళ్లేవారున్ను దూషణవలన ఇతరులకు హాని కలుగచేయువారున్ను బొత్తిగా అయియుండరు.

బుద్ధిమంతులగు పొరుగువారు తమ శక్తికొలది ఒకరికి ఒకరు సహాయము చేసుకొనుదురు. కొన్ని సమయములలో ఒకరి పిల్లలనుగురించి ఒకరు జాగ్రత చేయుచునుందురు. ఇంక ఇతరములైన స్వల్పసహాయములు ఏమైన చేయుదురు. ముఖ్యముగా జాడ్యము సంభవించినప్పుడు సహాయము చేయవలసినది. "దూరమున ఉన్న అన్నదమ్ములకంటే దగ్గి

రమున్ను పొరుగువారు ఎక్కువగా సహాయులై యుందురు." రోగులను వెళ్లి చూచునటువంటియు, దుఃఖించువారిని ఓదార్చునటువంటియు, ఇతరులను ఉపచారము చేయునటువంటియు, ఒక గిన్నెడు చల్లటి మంచి నీళ్లను సయితము ఇచ్చునటువంటియు స్త్రీ, కొనియాడతగినది. అందుకు ప్రభువు ఆమె సంకటపడినప్పుడు ఆమెకు శీఘ్రముగా ఆరోగ్యము కలుగచేయును. మరియు ఆయన ఆమె వ్యాధిలో తీసుకొనుచున్నప్పుడు ఆమెకు ఆధారమై యుండును.

మంచివారైన పొరుగువారు ముఖ్యముగా తమ చుట్టుపట్లనుండు వారిని పరలోకమార్గమందు నడిపించి తీసికొనిపోవుటకై ప్రయత్నము చేయుదురు. అనేకులు తోణకకుండా నిత్యనరకమునకు పోయెడు విశాలమైన మార్గమందు నడిచిపోవుచున్నారు. క్రైస్తవులు అటువంటి వారిని నిజమైన దేవుని ఆరాధించుటకున్ను ఒకడే రక్షకుడైన యేసు క్రీస్తును నమ్ముటకున్ను శాంతముతోను ప్రేమతోను వేడుకొనవలసినది. "మాతో కూడా రండి, అప్పుడు మేము మీకు మేలు చేయుదు"మని వారితో వీరు చెప్పవలసినది. పరిశుద్ధమైనటువంటియు అనుగుణమైనటువంటి ప్రవర్తనము చేతను ప్రార్థనచేతను వారి బోధకున్ను వేడుకొనుటకున్ను బలము కలుగచేయవలసినది.

## ౬౭ పాఠము.

జలుబు చేయుటను గూర్చియు, జ్వరమును గూర్చియు,
వాయువు నొప్పులను గూర్చియు.

ఆరోగ్యము. - - - రోగము లేకపోవుట.
బలహీనులు. - - - సత్తువలేనివారు.
మిక్కుటము. - - - విస్తారము.
పరగడుపు. - - - భోజనము చేయకమునుపు.
విషపుగాలి. - - - బాధకమైన గాలి.

మనము ఆరోగ్యముగా ఉన్నప్పుడు చమట ధారాళముగా బైటికి పోవును; చర్మము కొంచెము తడిగా ఉండును. చర్మమును ఆవరించిన

రంధ్రములు చలివల్ల మూసికొనిపోయినప్పుడు చెమట వెలపటికి రాక పోవుటవలన చర్మము పొడిగా ఉండును. జలుబు ఆరంభమైనప్పుడు మొదట చేయవలసిన పని ఏదంటే చెమట పట్టునట్లు చేయుటే. ఇది వచ్చినప్పుడు పిల్లను పూర్వముకంటే ఎక్కువ వెచ్చగా ఉంచి, పాదశాఖలనున్ను పాదములనున్ను రాత్రిళ్లు పండుకొనక మునుపు వేణ్నీళ్లతో కడిగి కొంచెము వేడిజావ ఇవ్వవలసినది. పిల్లకు చెమట పుట్టినప్పుడు వానిని బాగా బట్టలతో కప్పవలసినది, లేకపోతే జాడ్యము మరింత ఎక్కువగును.

జ్వరము వచ్చినప్పుడు మొదట చిట్లాముదము ఇవ్వవలసినది. జావ మాత్రమే త్రాగనివ్వవలసినది. వానిని చల్లనిస్థలమందు నెమ్మదిగా ఉంచవలసినది. దాహము తీర్చుటకై నారింజపండ్లనున్ను గంజినిన్ని లేదా చన్నీళ్లనున్ను ఇవ్వవచ్చును. గుడ్డలు నీళ్లలో ముంచి తలమీద తరుచుగా వేయవచ్చును. జ్వరము వదలిపోయిన తరువాత రోగి బలహీనుడై యున్నప్పుడు చెరిట అనగా, నేలవేముయొక్క కషాయమైనను, లేక వేపచెట్టుబెరడు కషాయమైనను ప్రతిదినము ఇవ్వవచ్చును.

తరుచుగా మురికినీళ్లు త్రాగుటవల్ల జ్వరము వచ్చును. లోతులేని చెరువులోని నీళ్లున్ను, ఆకులు పడిన చెరువునీళ్లున్ను త్రాగకూడదు. మంచి ఉదకము దొరకనప్పుడు ఆ నీళ్లే కాచి పుచ్చుకుంటే చాలా మంచిది. తడిబట్టలతో నిద్రపోవుటవల్లనున్ను, విస్తారముగా శీతోష్ణములు తగులుటవల్లనున్ను, దట్టమైన మంచులో తిరుగుటవల్లనున్ను, రాత్రిగాలిలో సంచరించుటవల్లనున్ను, ఋతువులు మారుటవల్లనున్ను, మిక్కటమైన అలసటవల్లనున్ను కూడా జ్వరము వచ్చును.

జ్వరము వ్యాపకమగుచున్నప్పుడు కావలసినంత మంచి ఆహారమును భక్షింపవలసినది. పరగడుపున సంచరింపవద్దు; మంచి స్వచ్ఛమైన ఉదకమును జాగ్రతచేసికొనవలసినది. మంచులోకిన్ని రాత్రిగాలిలోకిన్ని వెళ్లకూడదు. ఇంటిలోకి గాలివచ్చు వైపున ఉన్న తలుపులనున్ను కిటికీలనున్ను మూయవలసినది. రాత్రియందు శరీరమును వెచ్చగా ఉంచుకొనవలసినది. జ్వరమును పుట్టించు విషపుగాలి నేలను పోవుచుండును, గనుక వీలైతే మేడగదిలోనున్ను లేదా చివరకు మంచముమీదనైనను పరుండవలసినది.

వాయువు నొప్పులు తరుచుగా తేమ నేలమీద పరుండుటవల్ల వచ్చును. ఎప్పుడు మంచములే వాడుక చేయవలసినది. శరీరమును వెచ్చగా ఉంచగలందులకు తగినబట్టలు కప్పుకొనవలసినది. చెమట తెప్పించెడు సాధనములు ఉపయోగించినపక్షమందు మరీ మంచిది. ఆవిరి పట్టుట మిక్కిలి ప్రయోజనకరము. అటుపిమ్మట పొడిబట్టలతో రోగిని బాగా తుడిచి చలిగాలి తగలకుండా జాగ్రత పెట్టవలసినది.

## ౬౮ పాఠము.

### దినకృత్యమును గురించి.

| | | |
|---|---|---|
| పెందలకడ. | - | - శీఘ్రముగా. |
| ముఖమార్జనము. | - | దంతధావనము. |
| గృహకృత్యములు. | - | ఇంటిపనులు. |
| అంగడి. | - | - దుకాణము. |

పెందలకడ నిద్ర లేవవలసినది. ప్రొద్దున చాలాసేపు పరుండుట లజ్జాకరమున్ను అయుక్తమున్నై యున్నది. లేవగానే దేవుని గురించి ధ్యానింపవలసినది. గడచిన రాత్రి నిన్ను గురించి జాగ్రత చేసినందుకు ఆయనను స్తుతింపవలసినది. దినముపొడుగున ఏమిచేయవలెనో విచారించి తగిన ఏర్పాటులు చేయవలసినది. మోకాళ్లూని ప్రార్థింపవలసినది. ఇదివరకు చేసిన పాపములను క్షమించుమని దేవుని ప్రార్థించి, ఆ దినమందు శోధనలలో పడకుండానున్ను నీవు తినినను తాగినను ఇంక ఏమి పని చేసినను ఆయన మహిమకొరకు చేయునట్లు సహాయము చేయుమని దేవునిని అడుగవలసినది. అటుతరువాత ముఖమార్జనము మొదలైనవి చేసి పిమ్మట గృహకృత్యములను గురించి జాగ్రత చేయుము.

భోజనము చేయకముందు మన ఆహారమును ఆశీర్వదించుమని దేవుని ప్రార్థించి, భోజనమైన పిమ్మట ఆయనను స్తుతింపవలసినది.

ఎవడైనను అంగడినుండి కొన్ని వస్తువులు కొనుక్కొని వాటికైన ఖరీదు ఇవ్వకుండాపోతే వాడు ఎటువంటివాడని అనుకొనుదువు? మనము తినెడువాటిని ఇచ్చిన ఆయనను స్తుతింపక తింటే, కొంచెము ఎచ్చుతగ్గగా ఈ రీతినే ప్రవర్తించినవారమగుదుము. ప్రతి ప్రాతఃకాలమందు పాతనిబంధనలో కొంత భాగము చదువవలసినది. సాయంకాలమువరకు బైబిలులో ఒక వచనమును గురించి ధ్యానించుచు, దానిని ప్రార్థనగా చేసికొంటే చాలా లాభకరమై యుండును. నిన్ను నీవు క్రీస్తుకు అప్పగించుచున్నావని అనుకొనుచున్నాను. నీవు ఆయనవాడవని జ్ఞాపకమందుంచుకొనుము. పరిశుద్ధాత్మ సహాయముచే ఆయనవలె ప్రవర్తించుటకు యత్నించుము. అందరు చదువుకొని తెలిసికొనెడు యేసుయొక్క ఉత్తరమువలె ప్రవర్తింపవలసినది.

రాత్రియందు పండుకొనక పూర్వము నూతన నిబంధనలో ఒక భాగము చదువుకొనవలసినది. పగటియందు చేసిన పనులను గురించి విచారింపవలసినది. ఏ కీడు చేసితివో దానిని గురించిన్ని ఏ మేలు చేయకుండా వదిలిపెట్టితివో దానిని గురించిన్ని ఆలోచింపవలసినది. దేవుడు నీకు చేసినవాటిని గురించిన్ని వాటివలన నేర్చుకొన తగిన ఫలములను గురించిన్ని యోచింపవలసినది. తిరిగి యేసు రక్తమువలన నీ పాపములు తుడవబడునట్టున్ను, ఆయనయొక్క పుణ్యము అనెడు మరకలేని వస్త్రమును నీవు ధరించుకొనునట్లున్ను ప్రార్థింపవలసినది. నీ బంధువుల నిమిత్తమున్ను స్నేహితుల నిమిత్తమున్ను సువార్త, నలుప్రక్కల వ్యాపించునట్లున్ను ప్రార్థింపవలసినది. నీవు రాత్రియంతయు సుఖముగా నిద్రపోవునట్లున్ను ఇహమందైనను సరే, లేక పరమందైనను సరే, సంతోషముతో నిద్ర లేచునట్లున్ను జాగ్రతచేయుమని దేవుని వేడుకొనవలసినది.



## ౬౯ పాఠము.

### కనికరించు స్వభావమును గురించి.

అల్పజంతువులు. - - - - చిన్నజంతువులు.
ఉపకారస్మృతి. - - - - - సహాయమును తలచుట.
వ్యాప్తి. - - - - - - వ్యాపించుట.
మిత్రులు. - - - - - - స్నేహితులు.

యేసు భూమిమీద ఉన్నప్పుడు "మేలు చేయుచు సంచరించెన"ని చెప్పుచున్నారు. ఆయన శిష్యులందరు ఆయన అడుగుల ననుసరించి పోవలసినది.

పిల్లలు, అల్పజంతువులయందున్ను దయాళులై యుండునట్లు నేర్ప వలసినది. ఒకప్పుడు ఒక తల్లి, తన చిన్న కుమారుడు ఒక పిల్లి కూనను బాధించితే, వానిని అది రక్కినమీదట వాడు దానిని కొట్టినప్పుడు అది పడెడుబాధను చూచి నవ్వెను. ఇది మంచిది కాదు. తల్లి తన నవ్వువల్ల పిల్లను క్రూరబుద్ధియందు ప్రేరేపించినది. పిల్లికూనను అక్రమముగా పిల్లవాడు కొట్టెను; ఎందుచేతనంటే అది తనను సంరక్షించుకొనుటకు యత్నించుచుండెను. పిల్లికూనను, రక్కినందుకు కొట్టుటవల్ల పగ తీర్చుకొనుట పిల్లకు నేర్పుటయే. ఒక చిన్నపిల్లకు, పీటమీద గాని లేక ఇంక దేనిమీదగాని పడినందున దెబ్బతగిలితే పిల్లను ఏడ్వకుండా చేయుటకు పీటను కొట్టకూడదు. పైన ఉదాహరింపబడిన తల్లి దయతలచి "ఓహో! ఆ పిల్లికూనను కొట్టవద్ద"ని చెప్పవలసినది.

పిల్లలు తమ అన్నదమ్ములకున్ను అక్కచెల్లెండ్రకున్ను ప్రేమ చూపించునట్లు చేయవలసినది. చిన్నపిల్లను కాపాడి, దానితో ఆడుకొనుమని పెద్దపిల్లతో చెప్పవలసినది. చిన్నపిల్ల నవ్వితే, వారు చూపించిన ప్రేమకు ఉపకారస్మృతిగా అది నవ్వెనని దాని అన్నతోగాని అక్కతోగాని చెప్పవచ్చును. తలిదండ్రుల మెప్పు పొందుటవల్ల, పిల్లలు హెచ్చరికగా నుండి తమకు శ్రమ వచ్చినప్పుడు ఒకరికొకరు సహాయము చేసికొని ఒకరియెడల ఒకరు ఉపకారులై యుందురు.

స్నేహితులను, పొరుగువారిని, ముఖ్యముగా రోగులను వృద్ధులను దయగా చూడవలసినది. పిల్లలు బడికి పోనియెడల బడికి పోవునట్లు చేయవలసినది. నిజమైన దేవుని గురించియు, రక్షణోపాయమును గురించియు తెలియని పిల్లలకు వీటినిగురించి నేర్పవలసినది. ఒకపిల్ల రోగియైన పొరుగువానికొరకు కట్టెపుల్లలు ఏరి తెచ్చి, నీళ్లు తోడిపెట్టి ఇల్లు ఊడ్చి శుభ్రము చేయవచ్చును. రోగులకున్ను ముసలివారికిన్ని చదువులేనివారికిన్ని బైబిలులో కొంచెము చదివి వినుపింపవచ్చును. బీదలకు సహాయము చేయుటయందును సువార్తవ్యాప్తికి సొమ్ము ఇచ్చుటయందును పిల్లలు సంతోషించునట్లు వారికి నేర్పవలసినది. వారు తమ బంధుమిత్రులకొరకున్ను సకల జనులకొరకున్ను ప్రార్థించునట్లు చేయవలసినది.

పిల్లలు పదిమంది మెచ్చుకొందురు అను బుద్ధితో మాత్రమే ఉపకారులు కాక, పరలోకమందుండు తమ తండ్రిని సంతోషపెట్టవలెనను ముఖ్యాభిప్రాయము కలవారై యుండునట్లు జాగ్రత చేయవలసినది.



## ౨౦ పాఠము.

### వెలుతురును గురించి.

తరంగములు. - - - అలలు.
ద్రవపదార్థము. - - - నీరుగా ఉండు వస్తువు.
సరళరేఖ. - - - - తిన్నటి గీత.
ప్రసరించుట. - - - - వ్యాపించుట.

వెలుతురుయొక్క స్వభావము ఇదివరకు బాగా తెలియలేదు. ఒక రాయి తీసికొని చెరువులో వైచితే నీళ్లు పైకి చిందును. వాయు తరంగములు చెవికి తగులుటవల్ల ధ్వని తెలియుచున్నది. పండితులు వాయువుకంటే సన్నమైన ఒక విధముగా నుండెడు ద్రవపదార్థము కదిలి కంటికి తగులుటవల్ల వెలుతురు కలుగుచున్నదని చెప్పుచున్నారు.

వెలుతురు అన్నిదిక్కులను కిరణములవలె ప్రకాశించును. సరళ రేఖలవలె అది బయలుదేరును. కిటికీల అద్దములవంటి పదార్థముల గుండా కిరణములు ప్రసరించును. వాటికి స్వచ్ఛపదార్థములని పేరు. లోహములగుండానున్ను ఇంకా కొన్ని వస్తువులగుండానున్ను వెలుతురు వ్యాపింపలేదు, గనుక వాటికి అస్వచ్ఛపదార్థములని పేరు. బంతిని కిందకొట్టితే అది ఏదో ఒక వైపునకు ఎగురును. ఈ రీతినే కిరణములు కూడ ప్రతిఫలించుచున్నవి. కొన్ని వస్తువులు మరికొన్ని ఇతర వస్తువులకంటే ఎక్కువగా వెలుతురును ప్రతిఫలింప చేయుచున్నవి. అద్దములవలన బాగా ప్రతిఫలించును.

వెలుతురు ఊహింప శక్యముగానంత త్వరతో వ్యాపించును. వెలుతురు సూర్యుని దగ్గిరనుండి భూమిమీదికి వచ్చుటకు ఎనిమిది నిమిషములు పట్టునని చెప్పెదరు. అది ఒక రెప్పపాటులో అనేకవేల మైళ్ల దూరము పోవును.

మనము చూచెడు వస్తువుల రంగు వెలుతురువలన కలుగుచున్నది గాని అది కలుగుటకు వస్తువులలో ఏమియు లేదు. పదార్థముల రంగు, వెలుతురుయొక్క కదిలికలు తరుచుగా సంభవించుటను అనుసరించి యుండును. కిరణములు అణుమాత్రముగా ప్రసరించుటవలన ఎరుపు వర్ణపు కిరణములు కలుగుచున్నవి. కిరణములు ఎక్కువగా ప్రసరించుట వలన పసుపు పచ్చరంగు కిరణములు పుట్టును. అన్నిటికంటె త్వరగా ప్రసరించెడు కిరణములవలన నీలవర్ణము పుట్టును. ఎర్రని కిరణములున్ను పసుపు పచ్చని కిరణములున్ను నీలవర్ణపు కిరణములున్ను కలిపితే తెల్లని కిరణములు పుట్టును. పసుపు పచ్చనైనటువంటిన్ని నీలముగా నుండునటువంటిన్ని కిరణములు కలిపితే ఆకుపచ్చని వర్ణము పుట్టును. నారింజపండు రంగు పసుపు పచ్చకిరణములున్ను ఎర్రనైన కిరణములున్ను కలిపితే కలుగును. బట్టమీద సిరాబొట్టు పడగానే బట్ట పీల్చివేసినట్టు, కొన్ని పదార్థములు కొన్ని కిరణములను పీల్చును. ఇతర పదార్థములు ఇతరకారీతుల కిరణములను పీల్చును. ఎట్లంటే, ఎర్రబట్ట పసుపు పచ్చనైనటువంటిన్ని నీలమైనటువంటిన్ని కిరణములుపీల్చి ఎర్రని కిరణములను విసర్జించును. పసుపు పచ్చనిబట్ట ఎర్రనైన కిరణముల

నున్ను నీలవర్ణమైన కిరణములనున్ను పీల్చి పసుపుపచ్చ కిరణములను విసర్జించును. వెలుతురుయొక్క అన్నివర్ణములు గల కిరణములను ప్రతిఫలింప చేసెడు పదార్థములు తెల్లనివి. అన్నికిరణములను పీల్చు పదార్థములు నల్లనివి.

వర్షపు చినుకులగుండా కిరణములు ప్రసరించుటవలన ఇంద్రధనుస్సులు ఏర్పడుచున్నవి.



## ౭౧ పాఠము.

### బీదలవిషయమై జరిగింపవలసిన విధిని గురించి.

యాత్రాపరులు. - - పుణ్యక్షేత్ర సంచారము చేయువారు.

నిష్కారణముగా. - - అనిమిత్తముగా.

ఉద్యోగించుట. - - యత్నముచేయుట.

నిజముగా బీదలైనవారికి గొప్ప ఉపకారము చేయవలసినది. దుర్మార్గులకు భిక్షము పెట్టినట్టయితే వారిని పాపకార్యములందు ప్రోత్సాహపరచి, వారికి హాని కలుగచేయువారగుదురేమో గనుక, జాగ్రతగా ఉండవలసినది.

ఈ దేశమునందు అనేకవేలకొలది సోమరులు ఉన్నారు. వారు కష్టపడి పని చేయుటకు ఇష్టము లేక, తమ దుర్మార్గకార్యములు తెలిసిపోవునేమో అని యాత్రాపరులవలె తిరుగుదురు. వారికి ఎప్పుడున్ను ఎంతమాత్రము సహాయము చేయకూడదు. కొందరు అటువంటివారు శపింతురని భయపడుచున్నారు. అయితే "కోలంకిపిట్టవలెనే శాపమున్ను నిష్కారణముగా సంభవింపద"ని బైబిలు చెప్పుచున్నది. ఏ శాపమునకైతే మనము అర్హులము కామో అటువంటి శాపమువల్ల, ఒక పక్షి మన నెత్తిమీద ఎగురుటవల్ల, మనకు కలిగిన నష్టముకంటె ఎక్కువ నష్టము కలుగదు. (అనగా మనకు ఎంతమాత్రము నష్టము కలుగదు.)

కష్టపడి జీవనము కలుగ చేసికొనుటకు శక్తి గలిగినంతమట్టుకు "ఎవ్వ నికిన్ని భిక్షము పెట్టకూడదు; ఎవడైనను పని చేయకపోతే వాడు తినను కూడదు." ఒకడు సోమరియై యుంటే వాడు ఆకలివల్ల బాధ పడుటయే మంచిది. ఇందువల్ల వాడు పని చేయుటకు నుద్యోగించును. వాడు భిక్షమువల్ల సొమ్ము సంపాదించుకొంటే వాడు సోమారిగానే ఉండును. మనము అటువంటివానికి చేయవలసినదేమనగా వానికి పనిని సంపాదించిపెట్టుటయే ముఖ్యసహాయము.

కొందరు వారంతట వారే జీవనమునకు కావలసినంత ద్రవ్యము కలుగచేసికొనలేరు. అటువంటివారికి, ఎంతమట్టుకైతే సహాయము చేసితే మంచిదో అంతమట్టుకు సహాయము చేయవలసినది. ఒకడు తన జీవనార్థమై తగినపాటుపడలేనని చెప్పుచు బొత్తుగా ఎందుకు పని చేయ కూడదు?

తమకు తామే సహాయము చేసికొనలేనివారికి కావలసినది యీవత్తు మనము చేయవలసినది. అటువంటివారు శిశువులున్ను రోగులున్ను బలహీనులున్ను ముసలివారున్ను అయియున్నారు.

మనము పరలోకములోకి వెళ్లుదుమను ఆశ కలిగి భిక్షము పెట్టకూడదు. రక్షణ యేసుక్రీస్తుద్వారా మాత్రమే కలుగును.



## ౭౨ పాఠము.

### అతిసారమును, రక్తవిరేచనముల సంకటమును, వమన విరేచన సంకటమును గురించి.

సంకటము. - - - జాడ్యము.
నిపుణుడు. - - - నేర్పరి.
మృత్యుకరము. - - చావునుచేయునది.
బలుపైన. - - - త్వరగా జీర్ణముకాని.

వట్టి విరేచనములు, మితములేని తిండి తినుటవల్లనైన, లేక అరగని ఆహారము భుజించుటవల్లనైన పుట్టును. చిట్లాముదము పుచ్చుకొంటే ఈ సంకటమువల్ల కలిగెడుబాధ సాధారణముగా తీరిపోవును. నూకల

జావ అయిన లేక సగ్గుబియ్యపుగంజి అయిన దీనికి పథ్యము. ఈ సంకటము విస్తారకాలమువరకు శమించకుండా ఉన్నపక్షమందుగాని జ్వరము లేనిపక్షమందుగాని మారేడుపండ్లు గుజ్జు కొంచెము నీళ్లతోనున్ను పంచదారతోనున్ను కలిపి పుచ్చుకొనవచ్చును.

రక్తమిళితమైన విరేచనమైతే దీనికి రక్తవిరేచన సంకటమని పేరు. కడుపు పత్తితే నొప్పిగా ఉండును. దీనివల్ల విశేష హాని కలుగును. సాధ్యమైతే నిపుణుడైన వైద్యుని పిలుపింపవలసినది. విషగోడి గింజల కషాయమున్ను మారేడుకాయల రసమున్ను పుచ్చుకొంటే చాలామట్టుకు ఉపయోగకరమై యుండును. అప్పుడప్పుడు రోగిని చిన్నతొట్టిలో వేణ్ణీళ్లుపోసి అందులో కూర్చుండపెట్టవలసినది. ఈ నీళ్లు చల్లబడిపోకుండా ఇంకా వేణ్ణీళ్లు పోయవలసినది. ఫ్లానల్ గుడ్డతో ఒక పట్టావంటిది కుట్టించి కడుపుచుట్టును కట్టవలసినది. రోగికి పెట్టు ఆహారము విషయమై చాలా జాగ్రత్త చేయవలసినది. నూకలజావ సగ్గుబియ్యపుగంజి మొదలైనవి మాత్రమే ఇవ్వవలసినది. బలువైన ఆహారము తింటే ఈ వ్యాధి తిరిగి వచ్చును.

వమనవిరేచన సంకటము సాధారణముగా అతిసారముతో ఆరంభించును. విరేచనములు గంజివలె ఉండును. అల్పాచమానము బంధించును. తరుచుగా ముందర వమనము వచ్చిన తరువాత శరీరములో నొప్పులు పుట్టును. ఆరంభమందే జాగ్రతచేసితే జాడ్యము సాధారణముగా కుదరవచ్చును కాని, నిర్లక్ష్యముచేసి దాని వదిలిపెట్టితే తరువాత దానికి ఇచ్చిన మందులన్నియు వ్యర్థమైపోవును. ఈ వ్యాధి ప్రబలించిన సమయమందు కావలసినంత మంచి ఆహారము తిని, ఉప్పుకూడా చాలా పుచ్చుకొనవలసినది. చాలాసేపువరకు ఆహారము పుచ్చుకొనకపోతే జాడ్యము వచ్చును. అతిసారముయొక్క ఆరంభము కనిపెట్టవలసినది. వమనవిరేచనములకు ఇచ్చే మాత్రలు చాలా దగ్గిర ఉంచుకొని ఆలస్యము కాకుండా ఇవ్వవలసినది. వేడివేడి మిరియాలచారు పుచ్చుకొంటే చాలా మంచిది. శరీరమును వెట్టగా ఉంచి, దానిని గాటుగల సారాయితోనైన లేక కర్పూరతైలముతోనైన రాయవలసినది. వేడియిసుక సంచులలో పోసి శరీరమును కాయవలసినది. చన్నీళ్లు కొద్దిగా పుచ్చుకొంటే మంచిదే, శరీరము రాయుటవల్ల నొప్పులు శమించును.

వమనవిరేచనసంకటము ఆరంభమైనప్పుడు అది అమోఘముగా మృత్యుకరమై యుండును. చాలామందికి ఈ రోగమువచ్చి కుదురుట వలన ఈ వ్యాధిబలము పోచున్నదని తెలిసికొనవచ్చును.

వమనవిరేచనసంకటము చుట్టుపట్ల ప్రబలముగుచుండగా శుచిగా ఉండుటకు విశేషజాగ్రత చేయవలసినది. చెత్త యావత్తును తీసివేయ వలసినది. ఇంటికి సున్నము కొట్టించుట లాభకరము; పచ్చికాయ లున్ను మిగుల ముగ్గినపండ్లున్ను బలువైన ఆహారమున్ను తిన కూడదు. రాత్రివేళ కొంచెము తక్కువ తినవలసినది. ప్రొద్దున చద్దిఅన్నము తినకూడదు. ఉపవాసమువల్లనున్ను, గాలిలో తిరుగుటవల్లనున్ను, బడ లికవల్లనున్ను శరీరమును అశక్తిపరచకూడదు. రాత్రియందు తగినంత వెచ్చగా ఉండవలసినది. ఫ్లానల్ గుడ్డతో కుట్టించిన పట్కా కడుపు చుట్టూ కట్టుటవల్ల చాలామట్టుకు జాడ్యము రాదు. భయముపడుటవల్ల రెండెంతల నష్టము కలుగును. దేవుని చిత్తమునకు లోబడి ఆయన సంరక్షణను వెతుకుకొనవలసినది. 91 కీర్తనను తరుచుగా చదువవల సినది.



## 23 పాఠము.

### క్రీస్తుమతస్థులు కానివారి దేశములలోనుండెడి స్త్రీల స్థితిని గురించి.

హీనస్థితి. - - - నీచదశ.
అంతఃపురము. - - రాణివాసము.
నిర్బంధము. - - - అంటకపెట్టుట.
భగ్నాశులు. - - పోయినకోరిక గలవారు.

క్రీస్తుమతము తెలియని చోట స్త్రీలు బహు హీనస్థితిలో ను న్నారు. కొన్ని దేశములలో వారిని బానిసెవాండ్రనుగా చూతురు. మగవారు ఇండ్లలోనుండి చుట్టలు తాగి సంతోషముగా తిరుగుచుం దురు. స్త్రీలయితేనో పొలములు దున్ని పని యావత్తున్ను చేతురు. సిద్దీవాడు తన భార్యను తన పక్షని కూర్చుండి తిననివ్వడు. మిక్కిలి

బీదవాడున్ను హీనుడున్నైన సిద్దీవాడు తాను బానిసెవాడైనప్పటి కిన్ని తన భార్య మోకాళ్లూని తనకు సేవచేయవలెనని కోరును.

మహమ్మదీయులు నలుగురు భార్యలను వివాహము చేసికొన వచ్చును; మరియును వారి మనసు వచ్చినప్పుడు వారిని విడిచిపెట్ట వచ్చును. యూవనదేశస్థుడు ఒకడు, నలుబదియైదు సంవత్సరములు వయస్సుగలవాడైనప్పుడు, ఒకతె తరువాత ఒకతెను ఏబదిమంది భార్యలను వివాహము చేసికొనెను. మహమ్మదీయ స్త్రీలు అంతఃపురములలో నిర్బంధింపబడుచున్నారు గనుక, వారు బొత్తుగా బుద్ధిహీనులగుచున్నారు.

హిందూ దేశమునందు కొన్ని స్థలములలో మిక్కిలి క్రూరములైన ఆచారములు, దొరతనమువారు ఆటంకపెట్టువరకున్ను అవి ప్రబలములై యుండెను. అనేకమంది రాజపుత్రులు తమకు కూతుళ్లు పుట్టగానే విషము పెట్టియైనను లేక, ఇంకొక విధముగనైనను చంపేవారు. విధవలు తమ పెనిమిటులతో తమ కొడుకులచేతనే పాడిమీద కట్టబడి తగలపెట్టబడేవారు. విధవలను మొన్న మొన్నటిదాకా వివాహము చేసికొననివ్వరైరి; ఇప్పుడుకూడా తరుచుగా విధవలను కఠినముగా చూతురు. క్రీస్తుమతబోధకులు పాఠశాలలను స్థాపించువరకు హిందూదేశమునందు మర్యాదగల స్త్రీలను చదువుకొననివ్వలేదు. "స్త్రీలకు చదువుచెప్పుట పామునకు పాలుపోసినట్టుగా నుండును; వారు తమ విద్యను విషముగా చేతురు" అని హిందువులు చెప్పుచున్నారు. కొడుకు పుట్టితే సంతోషింతురు కాని, కూతురు పుట్టినదని వార్తవింటే వారు భగ్నాశులగుదురు.

యేసుక్రీస్తు మతము మాత్రమే స్త్రీలను ఘనపరుచును. మన మొదటి తలిదండ్రులు పాపము చేసిన తరువాత స్త్రీకి పుట్టిన ఒకడు సర్పము యొక్క శిరస్సును నలగపొడుచునని దేవుడు వాగ్దానము చేసెను. దేవుని కుమారుడు మనుష్యుని రక్షింప తలచినప్పుడు స్త్రీకే పుట్టెను. బైబిలులో మొదటినుండి చివరవరకు, స్త్రీలను వారి ఘనమైన ప్రథమ స్థితికి ఎచ్చింపవలెనని యున్నది. స్త్రీలు అన్నిటికంటె ఎక్కువగా తమకొరకు ఇంతమట్టుకు చేసిన సువార్తను వ్యాపింప చేయుటయందు ప్రయత్నము చేయవలసినది.



# ౨౪ పాఠము.

## దేవుని విషయమై బోధించుటను గురించి.

విసర్జించుట. - - విడిచిపెట్టుట.
ప్రోద్బలము. - - ప్రోత్సాహము.
ఆసన్నము. - - - సమీపించినది.
భువి. - - - భూమి.
దివి. - - - - ఆకాశము.

తలిదండ్రులు తమ పిల్లలకు తగిన అహారమును బట్టలను కలుగ చేయవలసినది. వారు తమ పిల్లలకు మంచి విద్య నేర్పుటకై తమకు కావలసినవి కొన్ని విసర్జింపవలసినది.[1] తలిదండ్రులు తమ పిల్లలకు తరుచుగా దేవునినిగురించి బోధింపరు. ఒక పిల్ల తాను చచ్చిపోవుచున్నప్పుడు, "ఓ నా తలిదండ్రులారా! మీరు నా మరణమును గురించి ఎప్పుడు చెప్పనులేదు; దానికి సిద్ధముకమ్మని ప్రోద్బలము చేయనులేదు; ఇప్పుడు నాకు మరణము ఆసన్నమైనది; నా యాత్మ నశించెను" అని కండ్లవెంబడి నీళ్లు తెచ్చుకొని ఏడ్చి చెప్పెను. మంచినడత, దృష్టాంతముగా చూపింపక ఎంతో బోధించినప్పటికి వ్యర్థమైపోవును. తల్లి మొదట తాను తన హృదయమును దేవునికి ఇవ్వవలెను.

ఒక పిల్లకు భూసంబంధియైన తన తండ్రినిగురించి గ్రహించుటకు శక్తి కలుగగానే వానికి పరలోకపుతండ్రిని గురించి కూడా నేర్పవలసినది. భూసంబంధి యగువాని తండ్రి వానిని ప్రేమించి, పోషించి, వానికి బట్టలు ఇచ్చి, వానిని కాపాడును; అయితే వాని పరలోకపుతండ్రి ఇంతకంటే ఎక్కువగా వానిని ప్రేమించును. అన్నివేళల వానినిగురించి జాగ్రతపెట్టును. రాత్రివేళ వానియొక్క భూసంబంధియైన తండ్రి నిద్రపోవును కాని, వాని పరలోకపుతండ్రి ఎప్పుడున్ను నిద్రపోడు. ఆయన ఎల్లప్పుడు మనకు మేలుచేయుచున్నాడు.

---

[1] వారికి మాతృకగా ప్రవర్తించుటవల్లనున్ను, వారిని అదుపాజ్ఞలలో ఉంచుటవల్లనున్ను, మోక్షమార్గమునందు వారిని నడిపించుట తలిదండ్రులకు మిక్కిలి విధాయకమై యున్నది.

దేవుడు అన్నిటిని సృష్టించెనని పిల్లలకు చిన్నప్పుడే నేర్పవలసినది. వారి బట్టలున్ను దీపమున్ను వారి చుట్టునుండెడు ఇతర పదార్థములున్ను ఎవరు సృజించిరో వారిని అడుగుడి. వాటిగుండా అవే ఏర్పడలేదుగదా! అటుతరువాత పుష్పములనున్ను ఆకాశమందు అంత ఎత్తుగా ఉన్న సూర్యునిన్ని ఎవరు సృష్టించిరో వారికి ప్రశ్నవేయుడి! భువి దివులను సృష్టించిన దేవుని మహిమనుగూర్చి వారికి నేర్పుడి. ముఖ్యముగా ఆయన ప్రేమనుగురించి తెలియచేయుడి. దివ్యమైన వెలుతురునున్ను సుందరమైన పుష్పాలనున్ను మంచి ఫలములనున్ను మనకు సౌఖ్యకరమైనవన్నిన్ని ఆయన దయచేసినవే అని వారితో చెప్పుడి.

యోగ్యుడైన తండ్రి తన పిల్లలు యుక్తమైనదానిని చేసినప్పుడు సంతోషించును. వారు దుర్మార్గముగా ప్రవర్తించినప్పుడు ఆయన కోపగించుకొనును. వారి పరలోకపుతండ్రి వారి నడతను కనిపెట్టి చూచుననియు, చీకటిలో సయితము వారిని దర్శించుననియు వారు గ్రహించునట్లు చేయుడి. ఆయన వారు క్రమమైనదానిని చేయుటకు కోరును, వారు పాపము చేసినప్పుడు ఆయన శిక్షించును.





## ౭౫ పాఠము.

### సూక్ష్మవస్తుదర్శక యంత్రమును గురించిన్ని, ఓకు, అనగా దూరవస్తుదర్శక యంత్రమును గురించిన్ని.

ద్వివిధములు - - రెండుభేదములు కలవి.
రజము - - - పరాగము, ధూళి.
గుబ్బాలు. - - - { మొగ్గలవలెనుండి, తలుపులు మొదలగువాటికి వేయబడు అలంకారవిశేషములు.

పండితులు ఆశ్చర్యకరములును ద్వివిధములువగు అద్దములను నిర్మించిరి. అందులో ఒకటి అతిసూక్ష్మమైన వస్తువులను చూచుటకు శక్తిని కలుగచేసెడు అద్దము. దీనివల్ల ఇంకొక విధమున మనము చూడలేని వస్తువులను చూడగలము. ఈ అద్దముద్వారా సన్నపాటి సూదిని చూచితే అది పెద్ద ఇనుపకమ్మివలె కనుపడును. మిణ్ణల్లి పెద్ద రొయ్యవలె కనుపడును.

సీతాకోకపురుగు రెక్కలను ముట్టుకొనిన పక్షమందు, ఒక విధమైన రజము చేతికి అంటును. ఈ అద్దపు సహాయముబట్టి ఈ రజమును చూస్తే అది వరసలుగానున్న చిన్న ఈకెలవలె నుండును. వానకాలమందు పుస్తకములకు ఆకుపచ్చని బూజు పట్టును. ఈ అద్దమువల్ల ఈ బూజు, చిన్న మొక్కలై యున్నట్టు కనుపడుచున్నది. ఒక్క నీటిచుక్కలో కోట్లతరబడి చిన్నచిన్న జంతువులుండును. ఈ పైననున్న బొమ్మ ఒక నీటిచుక్కలో ఉన్న ఈ జంతువులను కనపరుచుచున్నది. వాటిలో కొన్నిటి ఆకారము ఆశ్చర్యకరముగా నుండును; మరి

కొన్ని ఎంతో త్వరగా అటుఇటు పోవును. ఉత్తకన్నులతో చూచితే కనుపడనటువంటి ఈ చిన్నజంతువులు అనేక విచిత్రములైన మాదిరులు గలిగినటువంటివిన్ని, పట్టులుగా తీర్చబడిన గుబ్బలచే అలంకరింపబడినటువంటివిన్ని, రాతివలె నుండెడు చర్మములతో కప్పబడియున్నవి.

దూరముననున్న వస్తువులను చూచుటకు పనికివచ్చే అద్దము పేరు ఓకు. ఒకడు రెండు మైళ్లదూరమున నున్నప్పుడు ఉత్తకన్నులతో మనము చూడలేము. మంచి ఓకువల్ల వాని ముఖమును క్షణమాత్రములో గుర్తుపట్టగలము. వాని చేతులో పెద్ద అక్షరములు గల పుస్తకముంటే, రెండు మైళ్లదూరమునుండిన్ని దానిని మనము చదువగలము.




ఈ ఓకువల్ల సూర్య చంద్ర నక్షత్రాదులను గురించి ఆశ్చర్యకరములైన అనేకసంగతులు తెలిసికొన్నారు. చంద్రునియందు దాదాపుగా భూమియందువలె పర్వతములును మైదానములును ఉన్నట్టు కనుగొనిరి. దానిలో ఉండెడు రాళ్లను స్పష్టముగా చూచిరి. గ్రహములలో అన్నిటికంటే పెద్దదైన బృహస్పతిగ్రహము చుట్టును నలుగురు చంద్రులు ఉన్నట్టు తెలిసికొనిరి. శనిచుట్టు ఎనమండ్రుచంద్రులు ఉన్నట్టున్ను, వానిచుట్టు మండలములు అనగా వలయములు ఉన్నట్టున్ను కనుగొనిరి.



## ౭౬ పాఠము.

### చక్కగా జరుపుకొనుటను గురించి.

రెట్టి - - - - రెండంతలు, ద్విగుణము.
నిర్వాహకురాలు - - కార్యమును నెరవేర్చెడిది.
అప్రయోజకులు - - కార్యము నెరవేర్చలేనివారు.
గృహిణి - - - - భార్య.
ఏభ్రాసి - - - తెలివిమాలినది.

కొందరు చాలా కష్టపడి చేసినపనికి రెట్టింపుపని చేసెడు మరి కొందరు కలరు. కొందరు కొంత వచ్చుబడిలో సుఖముగానుందురు. మరి కొందరు అంత వచ్చుబడి ఉన్నప్పటికి చాలా కష్టపడుచుందురు. ఇంత తారతమ్యమునకు చక్కగా జరుపుకొనుటయైనను జరుపుకొనలేక పోవుటయైనను కారణమై యుండవలెను.

మంచి నిర్వాహకురాలు పెందలాడే లేచును. ఆమె తన పనులు ఏది ఎప్పుడు చేయవలసినది, ముందరనే ఏర్పరుచుకొనును. కాలము బంగారముకంటె మిక్కిలి విలువకలది గనుక, దానిని వ్యర్థపుచ్చదు. ఒక పద్ధతిని అనుసరించి పనిచేయుటవల్ల ప్రతిది తొందరలేకుండా క్రమముగా జరిగిపోవును.

యోగ్యురాలైన నిర్వాహకురాలు సొమ్ము, మంచి లాభకరమైన పనులకే ఉపయోగించును. ఆమె నెల ఖర్చుకు ఎంత సొమ్ము ఉన్నదో తన పెనిమిటితో ఆలోచించును. వారు ఇంటి అద్దె విషయమయిన్ని, భోజనము విషయమయిన్ని, బట్టలు విషయమయిన్ని, బడిఖర్చులవిషయమయిన్ని, ఇంక ఈ మొదలైనవాటి విషయమయిన్ని ఎంత సొమ్ము కావలెనో లెక్క చూచుకొందురు. యేసు మతవ్యాప్తికొరకున్ను బీదల కొరకున్ను కొంతసొమ్ము తీసి ఉంచుదురు. బుద్ధిమంతులందరు తమరు సుఖముగానున్నప్పుడు, తమకు వచ్చిన యావత్తు సొమ్మును వ్యయపరచరు; జాడ్యము వచ్చినప్పుడు ఖర్చుచేయుటకయి కొంతసొమ్ము దాచుదురు. అప్రయోజకులు తమరు దాచినసొమ్ము ఏ విధమున ఖర్చుచేయవలసినదో దానినిగురించి ఎప్పుడు ఆలోచించరు. తమకున్న సొమ్మంతయు ఖర్చు కాగానే విస్తారము వడ్డి ఇచ్చి అప్పు పుచ్చుకొందురు.

ఇంటిని బాగా చక్కపెట్టి పరిశుభ్రముగా వంటచేసెడు గృహిణి తన కుటుంబమునకు, ఒక ఏభ్రాసి విస్తారము వస్చుబడి వచ్చినప్పుడు కలుగచేసినదానికంటె ఎక్కువ సౌఖ్యమును, కొద్ది వచ్చుబడిచేతనే కలుగచేయును. ఏదియును ఎంతమాత్రము దుర్వ్యయము చేయకూడదు. ప్రతిది మిక్కిలి యుక్తముగా జరిగింపవలసినది. తోటకూర అన్నమైన బాగుగా వండి పరిశుభ్రముగానున్ను సరసముగానున్ను వడ్డించితే, తినినప్పుడు కలిగెడు సుఖము జబ్బుగావండి అయుక్తముగా వడ్డించిన పంచభక్ష్యపరమాన్నములు తింటే కలిగెడు సుఖముకంటె ఎక్కువగా నుండును.

ముందు జరుగబోవు సంగతులు విచారింపక పోవుటవల్ల గొప్ప నష్టము కలుగును. "ప్రతిదిన్ని చక్కగానున్ను క్రమముగానున్ను చేయవలసినది." మూడు మంచి సూత్రములు కలవు. అవి ఏవనిన:—

ప్రతిదానిని ఉచితస్థానమందు ఉంచుము.

ప్రతిదానిని తదనుగుణమైన పనికే ఉపయోగించుము.

ప్రతిదానిని ఉచితకాలమందు చేయుము.

## ఆ ర వ  నె ల.

### ౨౨ పాఠము.

### పి చ్చ ను గు రిం చి.

| | |
|---|---|
| జపము - - - - | మంత్రపఠనము. |
| భూతోచ్చాటనము - - | దయ్యములయొక్క వెళ్లగొట్టుట. |
| స్మారకము - - - | తెలివి. |
| తటాలున - - - - | ఏమరపాటున. |
| క్రీగడుపు - - - | కిందికడుపు. |

కొన్ని సమయములలో మనుష్యులు స్మారకము తప్పి పిచ్చమాటలు ఆడుదురు. తెలివిహీనులున్ను మూఢులున్ను ఇది దయ్యములవల్ల కలిగినదని వాటిని వదలకొట్టుటకు జపములు మొదలైనవి చేయనారంభింతురు. యేసుక్రీస్తు దయ్యములయొక్క కృత్యములను నాశనము చేయు

టకు ఈ లోకములోకి వచ్చెను; గనుక ఆయన ఇక్కడ ఉన్న దినములలో, సాతాను ఆయన మానవశరీరములను బాధించుటకు అంగీకరించెను. కాబట్టి సాతాను మనుష్యులను పిచ్చివారిని చేయుచున్నదని గాని, అనగా వారి బుద్ధిని నాశనము చేయుచున్నదని గాని, లేక ఇంక ఏ విధమునైన వారి శరీరములను కష్టపెట్టుచున్నదని గాని బైబిలులో ఎక్కడను చెప్పబడియుండలేదు. పిచ్చ పోగొట్టుటకై దుష్టాత్మలకు అర్పణలు అర్పించుట గాని భూతోచ్చాటన మంత్రములు ప్రయోగించుట గాని అవివేకమే కాక పాపముకూడా అయియున్నది.

మెదడు జబ్బుపడుటవల్ల పిచ్చ కలుగును; సారాయి కళ్లల్లో పోసితే అవి ఎర్రబడును. విస్తారము సారాయి త్రాగితే అందులో ఒక భాగము మెదడులో ప్రవేశించి దానిని వికారపెట్టినందున వానికి స్మారకము తప్పును. రోగమువల్ల కండ్లు ఎర్రబడినట్టుగానే మెదడు కూడా చెడిపోవును గనుక మనుష్యులకు పిచ్చ ఎత్తును. తాపజ్వరము వచ్చినప్పుడు ఈ విధము తరుచుగా సంభవించును. తరాలున చెయ్యి ఝాడించుటవలన బెణుకును. ఇటువలెనే హఠాత్తుగా భయపడుటవల్ల మెదడుకు హాని కలుగును. కొన్ని మందులవల్లకూడా పిచ్చ వచ్చినట్టు కనుపడును.

కొందరు స్త్రీలకు క్రీగడుపు నొప్పులవల్ల మూర్ఛ వచ్చును. అప్పుడు రోగి స్మారకము తప్పి విలవిలకొట్టుకొనును. నవ్వును్ను ఏడ్పును్ను సాధారణముగా ఒకటి తరువాత ఒకటి వచ్చును. ఈ రోగము పయికి భయంకరముగా కనుపడినప్పటికి దీనివలన హాని కలుగదు. చన్నీళ్లు ముఖముమీద కొట్టి అధికవాసనగల ద్రవ్యము వాసన చూపింపవలసినది. బద్ధకులును సుకుమారులునునైన స్త్రీలకు ఇటువంటి మూర్ఛలు వచ్చును.

పూర్వమందు పిచ్చవాండ్రను క్రూరముగా చూచేవారు. ఇప్పుడయితే నిపుణులైన వైద్యులు దయవల్లనున్ను, మంచి ఆహారము ఇచ్చుటవల్లనున్ను, ఆరుబయాల తిరుగునట్లు చేయుటవల్లనున్ను అనేకమందిని కుదుర్చుచున్నారు. పిచ్చ బట్టినవారు వినుచుండగా వారిని గురించి మాట్లాడకూడదు. వింటే వారికి నొప్పికలిగి వారి జాడ్యము ప్రబలమగును. పిల్లలు పిచ్చివారిని ఎక్కిరింపకుండానున్ను బాధపెట్టకుండానున్ను చేయవలసినది.



## ౭౮ పాఠము.

### స్త్రీల ప్రేరేపకత్వమును గురించి.

అత్యాదరము - - - మిక్కిలి ప్రేమ.
మూర్ఖుడు - - - - పట్టినపట్టు వదలనివాడు.
దగ్ధము - - - - కాల్పబడినది.
బహుకరింపబడును - - గారవింపబడును.
సార్థకము - - - - ప్రయోజనముతో కూడినది.

మనుష్యుల సుఖానుభవము చాలామట్టుకు తల్లులను అనుసరించి యుండును. చాలా సంగతులలో మొదటి ఆరు ఏడు సంవత్సరములను బట్టి, మనుష్యుడు ఎటువంటివాడో చెప్పవచ్చును. ముప్పాతికమట్టుకు వాని మొదటి శిక్షనుబట్టి వాని ఉత్తరస్థితి ఏర్పడును.

ఒకప్పుడు తల్లికి ఒక కుమారుడుండెను. ఆమె వానిని అత్యాదరముతో ప్రేమించి, వాడు ఏమి అడిగినప్పటికి ఇచ్చెను; గనుకనే వాడు, త్వరగానే తల్లిమీద అధికారము చేయనేర్చెను. వానితండ్రి పోగానే తల్లి ఈ దుర్భాగ్యుడైన కొడుకును కనిపెట్టుకొని ఉండవలసివచ్చెను. ఆమె వాడు చిన్నవాడై యున్నప్పుడు, వానివిషయమై తాను జరిగింపవలసినదాన్ని జరిగింపకపోవుటవల్ల, ఆమె వాని దుర్గుణములను అణచలేకపోయెను. వాడు అతి మూర్ఖుడున్ను తొందర చేయువాడున్ను పగతీర్చుకొనువాడున్ను అయి యుండెను గనుక వాని తల్లికి విశేష బాధను కలుగజేయువాడై యుండెను. ఒక రోజున తల్లిమీద కోపపడి ఇల్లు తగలబెట్టెను గనుక, ఆమెసొత్తు యావత్తున్ను దగ్ధమైపోయెను. ఈ తప్పితము నిమిత్తమై వానిని చెరలో వేసిరి. అయితే వానికి పిచ్చ ఎత్తెను, గనుక వాడు తన కండ్లను ఊడపెరుకుకొనెను.

తల్లి ప్రేరేపకత్వముకంటే ఎక్కువదైన భూసంబంధ ప్రేరేపకత్వము ఏదియులేదు. చాలామట్టుకు తనయొక్కయు తన పిల్లలయొక్కయు ముందు సౌఖ్యము తన శిక్షను అనుసరించి యుండును. పిల్లలను

క్రమముగా నడిపించకపోవుటవల్ల వచ్చేడు నష్టములను గురించి చెప్పితిమి. రెండవ పక్షమున తల్లి తన ధర్మమును క్రమముగా నెరవేర్చితే మిక్కిలి బహుకరింపబడును. ఎట్లనగా తన పిల్లలు ఒకరియెడల ఒకరు ప్రేమగా నుందురు. తన కుమారులు మర్యాదగలవారున్ను పనికివచ్చే వారున్ను సుఖవంతులున్ను అయియుందురు. తన పిల్లలు తన పెద్దతనమందు తనకు ఉపచారముచేసి తాను చనిపోయినప్పుడు దుఃఖింతురు; తనను ఎప్పుడు జ్ఞాపకముంచుకొందురు. తాను చనిపోయిన చాలా కాలమువరకు తన ప్రవర్తనము బహు సార్థకమైయుండును.

## ౭౫ పాఠము.

### యేసుక్రీస్తు విషయమై బోధించుటను గురించి.

| | |
|---|---|
| పారంపర్యము - - - | వంశక్రమము. |
| ప్రోత్సాహము - - - | హెచ్చరికచేయుట. |
| దాక్షిణ్యము - - - - | ఔదార్యము. |
| పునరుత్థానము - - - - | తిరిగిలేచుట. |

పిల్లలు, తమకు పారంపర్యమువలన దుష్టస్వభావము కలిగియుండుటకు, వ్యసనకరములైన కార్యములచేత ప్రతిదినము సాక్ష్యమును ఇచ్చుచున్నారు. గనుకనే దుష్టత్వమును గురించియు పాపశిక్షను గురించియు వారికి చిన్నప్పుడే బోధింపవలెను. తలిదండ్రులు, పిల్లలు దుర్మార్గముగా ప్రవర్తించినప్పుడు అప్పుడప్పుడు వారిని శిక్షింతురు. అయితే పరలోకపుతండ్రి వారికి ఇంతకంటె మిక్కుటమైన శిక్ష విధించగలడు.

పిల్లలకు తమరున్ను ఇతరమగు యావజ్జనమున్ను దేవునికి విరుద్ధముగా పాపముచేసి, ఆయన కోపమునకు పాత్రులైయున్నారనిన్ని అయితే దయదాక్షిణ్యభరితుడైన దేవుడు వారిని కనికరించి, వారికి బదులుగా శ్రమపడి చనిపోవుటకు తన ప్రియకుమారుని దయచేసినాడనిన్ని కూడా వారికి నేర్పవలసినది. ఆ రక్షకుడు తన కృపను పొందు

టకు అందరినిన్ని ముఖ్యముగా పిల్లలనున్ను తన దగ్గరకు రమ్మనియు, ఈ భూమిమీద తనను ప్రేమించి సేవించెడువారందరు తుదకు తనతో కూడా పరలోకమందు ఎల్లప్పుడు సుఖముగా నివసింతురనియు ప్రోత్సాహపెట్టుచున్నాడనిన్ని వారికి నేర్పుడి.

క్రొత్త నిబంధనలోనుండెడు యేసుచరిత్రమును బట్టి, తలిదండ్రులు తమ పిల్లలకు యేసు ప్రపంచములో జరిపిన జీవితకాలసంబంధులగు మధురములైన కథలు చెప్పుటకు శక్తిగలవారగుదురు. ఆయన ఆశ్చర్యకరమైన పుట్టుకయు, చిన్నవాడైనప్పుడు దేవాలయమునందు ఆయన ప్రవర్తించిన రీతియు, ఆయన పొందిన బాప్తిస్మము (స్నానమున్ను) ఆయన బోధయు, ఆయన చేసిన అద్భుతములున్ను, ముఖ్యముగా ఆయన మరణమున్ను, పునరుత్థానమున్ను, పిల్లలకు బోధించుటకు దివ్యమైనటువంటిన్ని ఉపయోగమైనటువంటిన్ని విషయములుగానుండును.

ఈ రక్షకుని ప్రవర్తనను అనుసరించి నడువవలెనని పిల్లను ప్రోత్సాహపెట్టవలసినది. ఆయన తన తలిదండ్రులకు విధేయుడై యుండెను, ఆయన అందరికి మేలుచేసెను, అపకారమునకు ఉపకారమే చేసెను, తనను చంపినవారి విషయమై కూడా ప్రార్థించెను.

యేసుమాత్రమే రక్షకుడనియు పరలోకమునకు వెళ్లవలెనని కోరితే ఆయన ద్వారామాత్రమే వెళ్లవలెననియు పిల్లలకు స్పష్టముగా తెలియ చేయుడి. యేసు చూపిన దయను పొందుడని వారిని బతిమాలుకొనుడి.



## ౮౦ పాఠము.

### తంతి టపాను గురించి.

దృఢము - - - - గట్టి.
ప్రవాహము - - - ఎడతెగకపోవునది.
చలనము - - - - కదులుట.

ఈ దేశములో అనేక స్థలములయందు ఇనుపతీగెను మోయుచున్న పెద్ద స్తంభములు కనుబడుచున్నవి. అవి తంతిసంబంధమైనవిశ్లే అనగా




మెరుపు టపాసంబంధమైనవి అయియున్నవి. ఇది కనుకొ్కనుటవల్ల మెరుపు మూలముగా సమాచారము ఒకచోటునుంచి మరియొక చోటునకు బహు త్వరితముగా వచ్చును.

ఒకచోటునుంచి మరియొక చోటుకు తంతిమూలముగా సమాచారము పంపవలసినప్పుడు, దృఢమైన ఒకొ్కక్క స్తంభమును ౨౦ గజములదూరము పాతి వాటిమీద ఇనుపతీగెను సాగవేతురు. గిరగిర తిరిగెడు ఇనుపసూది ఈ తీగెకు రెండు చివరలను అంటింతురు. రాగి రేకులును, తుత్తినాగపు రేకులును చాలామట్టుకు చిరకవలెనుండు ద్రవములో ఉంచుటవల్ల, మెరుపుయొక్క కొద్ది ప్రవాహము ఈ తీగెగుండాపోవును. మెరుపువల్ల రెండు చివరల ఉండు సూదులున్ను కదు

లును. అక్షరములు ఈ సూదుల చలనములను బట్టి, గ్రహింతురు. సూది కుడివైపునకు తిరుగుటవల్ల A అవును; ఎడమవైపునకు తిరుగుట వల్ల B అను అక్షరము అని తెలుసుకొనవచ్చును; తక్కినవి కూడా ఈ రీతినే ఈ క్రిందనుండు బొమ్మలో కనుబడు పిళ్లవల్ల సూదులు చలించును. ఈ తీగె చివరలనుండెడు మనుష్యులకు సూదులు చలించుటకు సిద్ధములు అయియున్నవని తెలుపుటకై, మెరుపు ప్రవాహము వల్ల, మొదట చిన్నగంట కొట్టుకొనునట్లు చేతురు.

ఈ తంతిమూలముగా ఇప్పుడు కొన్ని నిముషములలో కలకత్తా నుండి బొంబాయికి గాని చెన్నపట్టణమునకు గాని కబురు పోవును. నీళ్లను లోపలికి రాకుండా చేసెడు పదార్థముతో తీగెను చుట్టినట్ట యితే దానిని సముద్రములో కూడా వేయవచ్చును. హిందూదేశ సింహళములను కలిపెడి ఒక తీగె ఉన్నది. ఇప్పుడు హిందూ ఇంగ్లాండు దేశములకు తంతిటపా ఉన్నది. ఒక్క రోజులో హిందూదేశమునుండి ఇంగ్లాండుకు కబురు పోవును.

## ౮౧ పాఠము.

### అప్పులపాలు అగుటను గురించి.

దులాబీఖర్చు - - - అనిమిత్తవ్యయము.
అబద్ధాలకోరు - - - బొంకులమారి.

ఈ దేశప్రజనుల గొప్ప తప్పు ఏదంటే, అప్పుచేయుటకు వారు సిద్ధపడుటయే. కొందరు దాదాపుగా ఎల్లప్పుడు ఒకరిదగ్గిరనుంచి తెచ్చి మరియొకరికి అప్పు తీర్చుటకు ప్రయత్నము చేయుటయందు శ్రమపడుచుందురు. పెండ్లిళ్లసమయములందు దులాబీఖర్చులు చేయుటకై అప్పుచేయుదురు. అరబాగ్యులను సంతోషపెట్టుటకై అప్పు చేసి సొమ్ము ఖర్చు చేయుదురు; ఆ అప్పు తీర్చుట చాలా సంవత్సరము లవరకు పెద్దబరువై యుండును.

అప్పులు చేయువాడు చేతిలో ఏమియు లేకపోవుటవల్ల లాభకరమైన ఏ వర్తకము చేయలేడు. దుకాణదారుడు అరువిచ్చిన వస్తువు

లకు ఎక్కువ ఖరీదు పుచ్చుకొనును. వ్యవసాయదారుడు అప్పు చేసిన పక్షమందు అప్పులవాడు కోతకాలమందు వచ్చి, దాదాపుగా యావత్తు పంటను తీసికొనిపోవును. ఒకప్పుడు బాకీపడ్డవారు తమ అప్పులవాండ్రకు కనుపడకుండా పారిపోదురు. వారేమి వారి కుటుంబములేమి సుఖమును అనుభవింపలేరు.

"ఎవరికిన్ని ఋణస్థుడవై యుండకుము" అని దేవుడు చెప్పుచున్నాడు. అవివేకముగా అప్పుచేసెడువారు ఈ ఆజ్ఞను మీరుచున్నారు. ఋణస్థుడు తరుచుగా అబద్ధాలకోరగును; ఎట్లంటే వాడు 'ఫలానప్పుడు ఇచ్చెదనని వాగ్దానము చేయును; కాని సమయము రాగానే మరియొకప్పుడు ఇచ్చెదనని చెప్పును. "మీరు దొంగిలింపకూడదు; అసత్యముగా వ్యాపారము చేయకూడదు; ఒకరితో ఒకరు అబద్ధము ఆడకూడదు" అని బైబిలు చెప్పుచున్నది.

జాగ్రతలేనివాడును మోసగాడునునైన ఋణస్థుడు పరలోకములోకి పోనేరడు. "మీరు అక్రమస్థులున్ను మోసగాండ్రున్ను అయియున్నారు. మరియును మీరు మీ సహోదరులను సయితము అన్యాయముచేసి మోసపుచ్చెదురు. అనీతిమంతులు పరలోక రాజ్యమును స్వతంత్రించుకొనలేరని మీరు ఎరుగరా!"

అందరు అప్పులు చేయకుండా ప్రయత్నము చేయవలసినది. అప్పుచేయుటకంటే కొంతకాలమువరకు కష్టపడుట మేలు. పండుగలవిషయమయిన్ని భూషణముల విషయమయిన్ని సొమ్ము వ్యయపరచకూడదు. ప్రతిదినము చేసెడు ఖర్చులను కనిపెట్టుచుండవలసినది. పని చేయునప్పుడు బహుశ్రద్ధగానుండి దేవుని ఆశీర్వచనమును వెతుకవలసినది.



## ౮౨ పాఠము.

### కళ్లకలకను, కాలుటలను, గాయములను గురించి.

తరుచు - - - దట్టము.

శమనము - - - తగ్గుట.

నేత్రములు కొద్దిగా మంటపెట్టుచున్నప్పుడు వాటిమీద తడిపట్టె వేయుటవల్ల సాధారణముగా ఆ మంట కుదురును. కండ్లు కలిగి

నప్పుడు పుసిని తీసివేయుటకై వాటిని తరుచుగా కడుగుచుండవలసినది. మరియును వాటిని పటికనీళ్లతో కూడా కడుగవలసినది.

పిల్లలు నిప్పుదగ్గిరకు వెళ్లకుండా జాగ్రతచేయవలసినది. ఒక ఆడపిల్ల బట్టలు కాలుచున్నప్పుడు, అది తత్క్షణమే క్రిందపడి పొర్లాడవలసినని. మంట పయికి లేచును గనుక ఆ పిల్ల నిలుచుంటే దాని బట్టలన్ని కాలిపోవును. పొర్లాడుటవల్ల మంటలు ఆరిపోవును; మరియును కాలుచున్నప్పుడు తరుచైన బట్ట, గట్టిగా శరీరమునకు చుట్టితే కూడా మంటలు ఆరిపోవును. కొద్దిగా కాలినగాయము చన్నీళ్లు పోయుట వల్ల కుదురును. చర్మము కాలితే మెత్తటిదూది కాలిన చోట వేయుట వల్ల అది కుదురును. క్రొత్తచర్మము పట్టేవరకు ఆ దూదిని ఒంటిమీది నుండి తీయుకూడదు. బొబ్బలు, తమ క్రిందనుండెడు పచ్చిచర్మమును కాపాడును గనుక, వాటిని చిదపకూడదు; కత్తిరించను కూడదు. దూది దొరకనిపక్షమందు నూనెపట్టిస్తే మంచిది.

గాయములు పెద్దవి కాకపోతే రక్తము తుడిచివేయకుండా గుడ్డపీలికతోగాని జిగురు ప్లాస్త్రితోగాని కట్టవలసినది. ఆ గాయమందు మన్నేమైనను ఉన్నపక్షమందు నులివెచ్చనినీళ్లు ధారగా పోసి మొదట కడగవలసినది. గాయములు తీపుతీయుచున్నపక్షమందు బట్ట ఐదారు వరసలు చుట్టి నీళ్లతో తడుపుచుండవలసినది. శరీరముయొక్క ఏ అవయవమునకైన గాయము తగిలి రక్తము కారుచుంటే ఆ గాయమును కట్టుటవల్ల రక్తము కారుట ఆగిపోవును.

కీళ్లలోనుండెడు బొమికలను చుట్టుకొనెడు నరములు తెగిపోవుట వల్ల బెణుకుట సంభవించును. ఆ బెణికిన భాగము కదలకుండా చేయవలసినది. మొదట కొద్దిరోజులవరకు చన్నీళ్లుపోయుట బహు మంచిది. ఇట్లు చేసిన తరువాత నొప్పి ఇంకా ఉన్నపక్షమందు వేణ్నీళ్లవల్ల చాలా శమనము కలుగును.

కీళ్లు మామూలుచొప్పున కదలకపోవుటచే కలిగెడు బెణుకుడు నొప్పివల్ల నరములు చెదిరిపోయినవని గ్రహింపవచ్చును. ఇట్లు సంభవించినప్పుడు తత్క్షణమే రోగిని వైద్యునిదగ్గిరకు తీసికొని పోవలసినది.

బొమికలయొక్క చివరలు ఒకదానిని ఒకటి రాచుకొనుటవల్ల అవి విరిగిపోయినట్లు కనుగొనవచ్చును. ఇట్టి సమయమందు శస్త్రవైద్యుని పిలుపింపవలసినది.

## ౮౩ పాఠము.

### ఆపదవల్ల కలుగు లాభమును గురించి.

| | |
|---|---|
| నిజస్వభావము. - - - | స్వకీయమైన నైజము. |
| ప్రారంభము. - - - - | మొదలు. |
| సొత్తు. - - - - - - | ఆస్తి. |
| పీడింపబడుట. - - - - | బాధింపబడుట. |
| భారము. - - - - - | బరువు. |

ఉంగరములో మెరసెడు కెంపునైన లేక రవ్వనైన ఎప్పుడైనను చూచినావా? రవ్వ మొదట గనిలోనుంచి తవ్వబడినపుడు సాధారణపు రాయివలె నుండును. అప్పుడు నీవు దానిని చూచితే అది రవ్వ అని తెలిసికొనలేక పోవువాడవే. చాలాసేపు కష్టపడి దానిని సానపెట్టుట వల్ల అది అన్నిప్రక్కల మెరసి ప్రకాశమానమైన రత్నమై యుండును. అప్పుడు అది రాజహస్తమును అలంకరించుటకు తగినదై యుండును. దేవుడు తనపిల్లలను ఆపదలవల్ల తరుచుగా ఎందుకు శోధించుచున్నాడో, అది పయిన ఉదాహరించిన సాదృశ్యమునుబట్టి చెప్పవచ్చును. నిజస్వభావమువల్ల క్రైస్తవులు ఇతరులకంటె యోగ్యులు కారు. దేవుని పరిశుద్ధాత్మవల్ల వారి హృదయములు నూతనపరచబడ్డప్పుడు మాత్రమే వారు క్రొత్తపురుషులగుదురు. అప్పుడే సాధారణముగా కనుపించిన రాయి ప్రశస్తమైన రత్నమగును. అయితే ప్రారంభమందు క్రైస్తవుడు సానపెట్టని రత్నమువలె నుండును. సానపెట్టుటవల్ల అది ఏ విధముగా ప్రకాశించునో అలాగుననే దేవుని జనులు సాధారణముగా శోధన వల్ల పరిశుద్ధపరచబడుచున్నారు. ఒకప్పుడు వారి యావత్తు సొత్తు పోవును, జాడ్యము సంభవించును, వారికి ప్రియులైనవారు చచ్చిపోదురు. పేరుకుమాత్రమే క్రైస్తవులైనవారు తరుచుగా ఇటువంటి సంగతులతో

బైటపడుదురు. కొందరు ఇతర మతాచారములవల్ల తమ ఆపదలను పోగొట్టుకొనుటకు యత్నముచేయునంత వివేకశూన్యులును, దుర్మార్గులును అయియున్నారు. మరికొందరు "సర్వశక్తిగల దేవుని సేవించితే ఏమి ప్రయోజనము? ఆయనను ప్రార్థించినందువల్ల ఏమి లాభము?" అని చెప్పుచున్నారు. అప్పుడప్పుడు దేవుని నిజమైన పిల్లలున్ను కష్టము తరువాత కష్టము సంభవించినప్పుడు చాలామట్టుకు వెనుకకు తీయుదురు. వారు యాకోబువలె "ఇవి అన్నియు నామీదికి వచ్చుచున్నవి" అని చెప్పుదురు కాబోలు. వారు పడిపోయినప్పటికిని నాశనమును పొందరు. వారి పరలోకపుతండ్రియొక్క జ్ఞానమందును ప్రేమయందును విశ్వాసము ఉంచుటవల్ల, మిక్కిలి భయంకరములైన కష్టములలో దావీదువలె "నేను కష్టములవల్ల పీడింపబడుట నాకే మంచిది" అని చెప్ప శక్తిగలవారగుదురు.

ఈ పుస్తకము చదివెడువారు చిన్నవారు; మరియును వారు తమకు ముందు జరగగలవి అన్నియును బాగుగా నుండునని తలంపవచ్చును. అయితే వారు చాలాకాలము జీవించి సుఖములను అనుభవించినప్పటికి, విస్తారములగు చీకటిదినములు (అనగా దుఃఖదినములు) తమకు సంభవించునని జ్ఞాపకముంచుకొనవలసినది. వారు నిజమైన క్రైస్తవులయితే ప్రతికష్టసమయమందున్ను "క్షణమాత్రముండు మన చులకని శ్రమ, మనకొరకు మిక్కిలి గొప్పదిని శాశ్వతమునైన మహిమయొక్క భారమును కలుగచేయుచున్నది" అని చెప్ప శక్తిగలవారగుదురు.

## ౧౮ పాఠము.

### పిల్లలకు ప్రార్థన నేర్పుటను గురించి.

పదార్థములు. - - - వస్తువులు.
విసర్జించుట. - - - - విడిచిపెట్టుట.
పరిక్రయకుడు. - - తిరిగికొన్నవాడు.

పిల్లలకు ఏమైనను కావలసి యున్నప్పుడు, తమ తలిదండ్రులను అడుగుదురు. వారి భూలోకపు తలిదండ్రులు ఇవ్వలేనటువంటెన్ని

వారి పరలోకపుతండ్రి ఇవ్వకలిగినటువంటివిన్ని అనేక పదార్థము లున్నవని వారికి నేర్పవలసినది. ప్రార్థన అనగా దేవుని వేడుకొనుట అని వారు గ్రహింపవలసినది.

దైవభక్తికి ప్రార్థన మొదటిమెట్లలో ఒకటి. పిల్ల చాలాకాల మునకు చదువుటకు శక్తికలుగుననగానే అది తల్లితోకూడా మోకా ళ్లూని, తల్లి చెప్పినట్టుగా చిన్నమాటలతో ప్రార్థనయున్ను కృతజ్ఞ స్తుతులనున్ను ఉచ్చరింపవచ్చును. పరలోకమందుండెడు తన తండ్రి తో మాట్లాడినట్టుగా భక్తి ప్రేమ పూర్వకముగా ప్రార్థన చేయునట్లు వానికి నేర్పవలసినది. వారు రోజుకు రెండు పర్యాయములైన ప్రా ర్థున సాయంకాలము ప్రార్థన చేయునట్లు చేయవలసినది. తల్లినోట నుంచి విని నేర్చుకొనిన ప్రార్థన వారు చాలాకాలమువరకు జ్ఞాపక ముంచుకొందురు. అనేకమంది ముసలివారు చిన్నప్పుడు ఎక్కడ మోకాళ్లూనిరో అదియును, ఏమి ప్రార్థన చేసిరో అదియును ఇప్పుడు చెప్పగలుగుదురు.

ఆహారము తినక పూర్వము దానిని ఆశీర్వదించుమని దేవుని అడు గుటకున్ను తినిన తరువాత ఆయనను స్తుతించుటకున్ను పిల్లలకు నేర్ప వలసినది.

రువా ప్రభువు దినమును (అనగా సబ్బాతు దినమును) ఆచరించు నట్లు వారికి ఉపదేశింపవలసినది. వారి తలిదండ్రులు వారి ఎదుట బహు జాగ్రతగా నడుచుకొనవలసినది. ప్రపంచ సంబంధమైనపని అంతయును, అనగా కొనుటయును అమ్ముటయును ఆ రోజున విస ర్జింపవలసినది. పిల్లలను దినమును ఆడుకొనునట్లు ఆడుకొన నివ్వకూ డదు. ఆదివారము అయాసకరమై యుండకుండా చాలా జాగ్రత చేయవలసినది. బైబిలుకథలు మనోహరముగా చెప్పితే పిల్లలకు సంతోషము కలుగును, బుద్ధి కలుగును. పిల్లలు సంగీతము పాడు టకు ఇచ్ఛయింతురు. ఆదివారము రోజున వారును వారి తలిదండ్రు లును కలసి, తమ దేవునియొక్కయును పరిక్రయకునియొక్కయును స్తుతివచనములను పాడవచ్చును.

కొంచెము పెద్దవారైనప్పుడు పిల్ల నలుగురితోకూడా కలిసి ప్రా ర్థన చేయుటకు గుడికి వెళ్లవలసినది. దేవుని గృహమునందు వారు నిమ్మళముగా కూర్చుందునట్టున్ను మాట్లాడకుండను నవ్వకుండను ఉండు

నట్టున్ను చేయువలసినది. తరువాత ఇంటిలో వారి వయస్సునుపట్టి దేవుని గృహమునందు వినిన అంశములనుగురించి వారికి ప్రశ్నములు వేయవలసినది.



## ౭౫ పాఠము.

### భూకంపమునుగురించియు, అగ్నిపర్వతమును గురించియు.

మాగాణము. - - - దేశము.

భూమిలో రాళ్లతో కూడికొనిన అగ్ని విస్తారముండును. అనేక మైళ్లవరకు దట్టమైన, గట్టి రాతిచిప్పలచేత ఈ భూమికింద ఉన్న

అగ్ని కప్పబడి యున్నది; ఆ రాతిచిప్పగుండా కాక నిమ్మళముగా పైకి వచ్చును. లోతుకు తవ్వినకొద్దీ భూమి అంతకంతకు వెచ్చగా ఉండుటవల్లనున్ను, ఉష్ణధారలవల్లనున్ను, మండెడు పర్వతములవల్లనున్ను భూకంపములవల్లనున్ను ఈ కరిగిన పదార్థమున్నదని కనుగొనవచ్చును. నీళ్లు నిండా ఉన్న బిందెను నిప్పుమీద పెట్టి కాచితే పైమూత ఆవిరివల్ల ఒకప్పుడు కదులును. ఈ రీతినే అప్పుడప్పుడు భూమి పైభాగము, కింద ఉన్న అగ్నిబలమువల్ల కదులుచున్నది. ఈ కదిలికకు భూకంపమని పేరు. చాలా పర్యాయములు ఈ కదిలిక మిక్కిలి స్వల్పమైనప్పుడు తెలిసికొనుటకు కష్టము-గాకుండును. ఇతర సమయములలో కొన్ని భూభాగములు, ఇండ్లు క్రిందపడునంతగా కదులును. ౧౮౧౯-సంవత్సరమునందు కచ్చిమాగాణములో భూకంపమువల్ల ౭౦-మైళ్లు దూరమువరకు ౧౦-అడుగుల ఎత్తుగా భూమి పైకి లేచెను. మరిన్ని కొంతభాగము దిగిపోవుటవల్ల కచ్చి సింధు శాఖ ఏర్పడి అది ఉప్పు పర్రాయెను. అప్పుడప్పుడు భూమి విశేషముగా బద్దలగును.

ఒకప్పుడు బిందెలో నీళ్లు పొంగును. అలాగుననే భూమికింద ఉన్న అగ్ని, అప్పుడప్పుడు భూమియొక్క పలచని పైభాగముగుండా త్రోవచేసికొని బైటకు వచ్చును. ఈ అగ్నిపోయెడు మార్గములకు అగ్నిపర్వతములని పేరు. కొందరు నీళ్లు భూమిలోకి పోయినప్పుడు, అగ్ని పైకి లేచునని అనుచున్నారు. ధూమమున్ను బొగ్గునిప్పున్ను రాళ్లున్ను గొప్పధ్వనితో పైకి ఎగయును. ఈ వడివల్ల, పెద్దరాళ్లు ౫-మైళ్లదూరమువరకు పోయి పడినవి. బూడిద అయితేనో వందలతరబడి మైళ్లవరకుపోయి పడినది. అప్పుడప్పుడు కరిగినరాళ్లు పర్వతముల ప్రక్కలనుండి ప్రవాహములవలె బయలుదేరి వాటి మార్గమునందున్న వాటిని తగలబెట్టును.

కొన్ని సమయములలో భూకంపములవల్ల జీవనష్టము కలుగుచున్నప్పటికీ విలువగల రాళ్లున్ను, పెద్ద శిలలున్ను, ఈ భూకంపముచేతనే కొంతమట్టుకు భూమి పైభాగమునకు తీసికొని రాబడుటవల్ల మనుష్యులు వాటిని తవ్వుదురు; అగ్నిపర్వతములవల్ల ధూమము మొదలైనవి వెలపటికి వచ్చును; అవి అటుల రాకపోయినపక్షమందు గొప్ప నష్టము సంభవించును.

# ౮౯ పాఠము.

## పని చేయుటకు కావలసిన బలమును గురించి

శిలామయము. - - - - రాళ్లతోనయినది.
పాంథుడు.- - - - - మార్గస్థుడు.
కంపము. - - - - - వణకుట.

శిలామయమైనటువంటియు కష్టతరమైనటువంటియు మార్గమున ఒక పిల్ల తన తండ్రితో నడుచునప్పుడు, అది తనకు ఆధారముగా తన తండ్రి చెయ్యి పట్టుకొని నడుచును. తాము బలవంతులమని అనుకొనెడు పిల్లలు అటువంటి మార్గమునందు నడుచునప్పుడు సయితము కొన్నివేళల తమరు స్వంతముగా నడువనుద్యోగింతురు. అట్లా నడుచునప్పుడు పెద్దపాటు పడుటవల్ల తమతప్పు తామే తెలిసికొందురు; అప్పుడు వారు వినయముతోను, సంతోషముతోను, తమ బలముకంటె ఎక్కువబలము కలిగినవారి సహాయమును అంగీకరింతురు. తమ తండ్రి చెయ్యి పట్టుకొనుటవల్ల మార్గము ఎంత వరకాటముగా నున్నప్పటికీ తమకు ఎంతమాత్రము హాని లేకుండా సురక్షితముగా తమ ప్రయాణము ముగింతురు.

మనమందరము పాంథులము. మన జీవితకాలము ప్రయాణము వంటిది. చాలామట్టుకు మార్గమునందు నడుచుటకు మనకు కష్టముగా నుండును; మనము నడుచుటకు శక్తిలేని చిన్నపిల్లలవలె ఉన్నాము. మనము చేయవలసిన ముఖ్యకార్యములు చాలా ఉన్నవి. భయకంపములతో మన రక్షణను మనము కలుగచేసికొనవలసినది. మన చుట్టుపట్లనుండెడువారి రక్షణార్థము మనచేతనైనది యావత్తు చేయుటకు మన విధి. ప్రతిదానియందు మనము దేవుని మహిమపరచవలసినది. ప్రతి వైపున శోధనలు మనలను ఆవరించుకొని యున్నవి. మన దుష్టహృదయములవల్లనున్ను, మన స్నేహితుల చెడునడతలవల్లనున్ను, వారి బతిమాలుటవల్లనున్ను, సైతానుయొక్క శోధనలవల్లనున్ను తప్పుదారిని నడుచుచున్నాము. "వీటికి తాళెడువాడెవడ"ని మీరు బాగా చెప్పవచ్చును?

మనకు కావలసినంత బలము దయచేయబడి యున్నందుకు దేవుని నామము స్తుతించబడును గాక. "నా కృప నీకు చాలును"ని ఆయన వాగ్దానము చేసియున్నాడు. మనము అడుగగలదానికంటెనున్ను యోచించగలదానికంటెనున్ను ఎక్కువగా ఆయన మనకు దయచేయుటకు శక్తిగలవాడున్ను ఇష్టముగలవాడునైన్ను యున్నాడు. భయపడకుడి నమ్ముకొనిమాత్రముండుడి. యేసుక్రీస్తునే రక్షకునిగా భావించుకొని ఆయననే కేవలము నమ్ముకొనుడి; మీరు ఏమైన చేసినదానిగాని చేయగలిగిన దానిగాని నమ్ముకొనకుడి, ఆయనయందు స్థిరపడి యుండుడి. అన్ని సమయములందు ఆయనచేత నడిపింపబడి ఆయన సహాయమును వెతుకుడి. విశ్వాసపూర్వకముగా మీ మనవులు ఆయనకు తెలియచేయుడి, ఆయన మీ ప్రార్థనలు విని మిమ్మును బలపరుచును. ఇహలోకమందు మీ కష్టతరమైన బ్రతుకు ముగించిన తరువాత పరలోకమందు ఆయనతో కూడా ఆయన తండ్రిగృహమందు ఎల్లప్పుడు మీరు నివసించుదురు.

## ౮౭ పాఠము.

విషములను గురించియు, మునిగిపోవుటను గురించియు.

వమనము. - - వాంతి.
పిల్లగోడ. - - చిన్నగోడ.

ఒకడు తాచుపాముచేతగాని పిచ్చికుక్కచేతగాని కరవబడినప్పుడు, విషము శరీరములోనుండెడు రక్తమంతటిలో కలియకుండా కరిచినచోటుకు పైన తాడుపెట్టి కట్టవలసినది. అటుతర్వాత కరిచిన స్థలమును కోయనైనను కోయవలసినది, లేక ఎఱ్ఱగా కాలిన ఇనుముతో బాగా కాల్చనైనను కాల్చవలసినది. కరిచిన జంతువుయొక్క పల్లులు దిగిన దానికంటె, ఎక్కువ లోతుగా గాయమును కోయనైనను కోయవలసినది, కాల్చనైనను కాల్చవలసినది. రక్తము బాగా కారిపోవునట్లు చేయవలసినది. పాము కరిచినప్పుడు మంత్రించినను లాభము లేదు.

ఒకడు విషము పుచ్చుకొనిన ఎడల, మొదట చేయవలసిన పని ఏదంటే, కక్కుకొనడమువల్ల అది కడుపులోనుంచి పోవునట్లు చేయు

టయే. చిన్నగరిటెడు ఆవాలపొడియైన ఉప్పైన నీళ్లలో కలిపి ఇచ్చిన పక్షమందు సాధారణముగా వమనమవును. పక్షియీకెయొక్క సన్న పాటికోనచే కంఠములోపల త్రిప్పి వేణ్ణీళ్లు త్రాగనివ్వవలసినది.

నల్లమందున్ను ఉమ్మెత్త రసమున్ను ఇచ్చిన ఎడల నిద్రమత్తున్ను స్మారకము తప్పుటయున్ను సంభవించును. ఇవి చాలా ఇచ్చిన పక్షమందు మరణమే సంభవించును. వమనమైన తరువాత కాఫీనీళ్లు ఇవ్వవలసినది. ఆ మనుష్యుని అటుఇటు నడిపించవలసినది. చన్నీళ్లు ముఖము మీద కొట్టవలసినది. ఇత్తడిపాత్రలకు పట్టిన పచ్చనిచిలుమువల్ల కలిగెడు విషము పుచ్చుకొంటే వమనములున్ను కడుపునొప్పియున్ను పుట్టును. అప్పుడు చాలా వమనములు అయ్యేటట్టు చేయవలసినది. కోడిగుడ్డులో తెల్లనిసొన, నీళ్లలో కలిపి ఇచ్చితే అది దివ్యౌషధము. కోడిగుడ్డు దొరకకపోతే పాలున్ను నూనెయున్ను ఇవ్వవచ్చును.

ఆడపిల్లలు నీళ్లు తోడుచున్నప్పుడు కొన్ని సమయములలో నూతిలో పడుదురు. అప్పుడు చేతనైనంత త్వరగా నూతిలోనుండి వారిని తీయవలెసినది; కొన్ని నిమిషములుమాత్రము నీళ్లలో ఉండినట్టయితే ప్రాణము తిరిగివచ్చు ప్రయత్నము చేయవలసినది. చచ్చినట్టు పడిపోయిన అనేకులు మంచి నేర్పరుల ప్రయత్నమువల్ల తెప్పరిల్లిరి. నీళ్లలోనుండి శరీరమును తీయగానే పొడిబట్టలతో చుట్టి దగ్గిరనున్న ఇంటికి నిమ్మళముగా తీసికొని వెళ్లవలసినది. వెచ్చనిబట్టలతో దానిని బాగా తుడిచి, తలపైకి ఎత్తిపట్టి, శరీరము వేణ్ణీళ్లలో ఉంచవలసినది. ముక్కుమూసి చిన్న వెదురుగొట్టము నోటిలో పెట్టి, ఆ గొట్టము చుట్టు పెదవులు దగ్గిరగా అణచిపట్టి ఊపిరితిత్తులలోకి గాలి పోయవలసినది. అటుతరువాత ఎదురొము అణచితే గాలి తిరిగి వెలపటికి వెళ్లును. గాలి తిత్తులలో పోసి తిరిగి వెలపటికి పోనివ్వవలసినది. సంచులలో వేడిఇసుక పోసి శరీరముచుట్టూ పెట్టవలసినది. ఈ విధముగా సుమారు ఒక గంటవరకు చేయవలసినది.

ప్రతి నూతిచుట్టు పిల్లగోడలు పెట్టించవలసినది. చిన్నపిల్లలు వాటి దగ్గిర ఆడుకోకుండా బుద్ధి చెప్పవలసినది.

## ౮౮ పాఠము.

### క్రొత్త, పాత, ఇండ్లను గురించి.

శిథిలము. - - విడిపోయినది.
అకస్మాత్తు. - - హఠాత్తుగా.
చిహ్నము. - - గుర్తు.
తీరము. - - - ఒడ్డు.
హీనము. - - నీచము.

భూసంబంధమైన ప్రతి ఇల్లు కొంతకాలమైన తరువాత శిథిలమై పోవును. ఒకప్పుడు అది ఎంత దిట్టముగా కనుపడినప్పటికీ క్రమ క్రమముగా వాసములు మొదలైనవి పుచ్చిపోవును. గోడలకు చవుడు పుట్టి కొంచెము కొంచెము రాలిపోవును; తుదకు ఇల్లు యావత్తున్ను పడిపోవును. అటువంటి ఇంటిలో కాపురమున్న బుద్ధిమంతుడు పాతది నశించక మునుపు, తాను కాపురముండుటకు ఇంకొక ఇంటిని విచారించుకొనును. మన శరీరములు భూసంబంధమైన ఇండ్లవంటివి. అవి చాలా కాలమువరకు ఉండునట్లుగా రాళ్లతో కట్టబడలేదు. మనము భూమిలో పునాదివేసిన మంటిఇండ్లలో నివసించుచున్నాము. చాలా కాలమునకు ఇంటికప్పు పడిపోవనారంభించును; వాసములకు పురుగు పట్టును. మట్టిగోడలు చవుడుపట్టి పోవును. సాధారణముగా అది అకస్మాత్తుగా పడిపోవును. అది కాలిపోతే కాలిపోవచ్చును; బలమైన వర్షమువల్లగాని వరదవల్లగాని అది కొట్టుకొని పోవచ్చును. ఒక నిమిషములో సుడిగాలిచే అది నాలుగుప్రక్కలకు ఎగిరిపోవచ్చును. అలాగుననే బలాఢ్యులకు తుదకు ముసలిచిహ్నాలు కనుపించును. వెంట్రుకలు నెరుసును; దృష్టి మందగించును; కాళ్లు క్షీణకును; మృత్యువు ఎప్పుడో ఒకప్పుడు అకస్మాత్తుగా ఈ శిథిలమైన ఇంటిని పడగొట్టును.

పాతఇల్లు పడిపోయినప్పుడు అందులో కాపురమున్నవాడు ఇంకొక నివాసమునకు పోవలసివచ్చును. నీవు నీ ఇంటిని కుదుర్చుకొన్నావా? అది సముద్రతీరమందుండెడు ఇసుకమీద కట్టబడినదా,

లేక కొండమీద కట్టబడినదా? వరద దానిమీదికి ప్రవహించినప్పు డున్ను వర్షము దానిమీద కురిసినప్పుడున్ను అది నిలుచునా, లేక పడి పోవునా? నీవు కోరునది హీనమైనటువంటిన్ని త్వరగా నశించున టువంటిన్ని భూసంబంధమైన ఇల్లా! లేక "పరలోకమందు శాశ్వ తముగా నుండునటువంటిన్ని చేతులతో కట్టబడనటువంటిన్ని ఇల్లా!"

వీటినిగూర్చి నీవు ఆలోచించితే నీవు జ్ఞానవంతుడవే; మరి యును ఇదివరకును నీవు వీటినిగూర్చి ఆలోచించకపోతే ఇప్పుడైనను ఆలోచించుము. నిపుణుడైన మేస్త్రిని ఆలోచన అడుగుము; పిమ్మట పాతఇంటివలె నుండెడు (ఈ శరీరము) నశించిన తరువాత, క్రొత్తగా నుండునట్టియును శాశ్వతముగా నుండునట్టియును గృహములోకి నిన్ను చేర్చుకొందురు.



## ౮౯ పాఠము.

### మతబోధ నేర్చుకొనుటకు తగిన కాలములను గురించి.

| | |
|---|---|
| అనుచితకాలము. - - | తగనివేళ. |
| కోపాగ్నిరుద్రుడు. - | కోపముచేతను అగ్నివలె భయంకరుడు |
| ఉత్పత్తి. - - - - | పుట్టుట. |
| సిద్ధించును. - - - | దొరుకును. |
| నిశ్శబ్దము. - - - | చప్పుడు లేకపోవుట. |

అనుచితకాలములయందు మతమునుగురించి బోధించిన పక్షమందు, మంచికి బదులుగా నష్టము కలుగును. పిల్ల ఆటయందు సంతోషము తో హెచ్చియుండగా, పాపమునుగురించిన్ని పశ్చాత్తాపమును గురిం చిన్ని వినుటకు వానికి ఇష్టముండదు. వాడు కోపాగ్నిరుద్రుడై యు న్నప్పుడు, ఈ కోపపడుటవల్ల కలిగెడు పాపమునుగురించిన్ని, అందు విషయమైన దేవుని ఆగ్రహమును గురించిన్ని, వానితో మాట్లాడితే నిష్ప్రయోజనము అగుటయే కాకుండా, ఇంతకంటే ఎక్కువ నష్టము కూడా కలుగును. ఏ పాఠము చెప్పుటకున్ను మంచి సమయములను ఏర్పరచుకొనుము.

మన చుట్టుపట్లనుండెడు పదార్థములే మాట్లాడుటకు మనకు తగిన సమయములను కలుగజేయునవై యుండును. పొలములో నుండెడు పువ్వులును, ఆకాశపక్షులును, విత్తనము విత్తెడువాడును, ఫలించని అంజూరపుచెట్టును, ప్రభువైన యేసుక్రీస్తుచేత జ్ఞానోత్పత్తిసాధనములుగా చేయబడెను. ఆయనను అనుసరించి మనముకూడా ప్రవర్తింపవలసినది. వర్షాకాలము ప్రారంభము కాగానే వర్షవాయువులను దయచేయువాడు దేవుడే యని పిల్లకు నేర్పవలసినది. మరియును తనను కాపాడెడువాడు దేవుడే అనియు నేర్పవచ్చును. పిల్లలకు రోగము సంభవించునా? అప్పుడు దుఃఖమున్ను ఏడ్పున్ను ఏ బాధయున్ను లేని మంచి భూమినిగురించి వానితో చెప్పవచ్చును. వాని స్నేహితుడు ఎవడైన చచ్చును; అప్పుడు వానిని సమాధియొద్దకు తీసికొనివెళ్లి, దానివల్ల గ్రహింపవలసిన దుఃఖకరమైన మాటలను వానితో చెప్పవచ్చును. తన స్నేహితుడు ఏలాగు చనిపోయెనో అలాగుననే తానుకూడా ప్రపంచమును విడిచి, విమర్శింపబడుటకు యేసు యెదుట కనపడవలసి యుండుననిన్ని, ఏదో ఒక శాశ్వతమైన బ్రతుకు సిద్ధించుననిన్ని వానికి తెలియచేయవలసినది.

పిల్లవాడు ఏ దినమందైన అక్రమముగా ప్రవర్తించితే వానికోపము అణగినదాకా ఊరకుండి, అటుతరువాత వాని చెడునడతవల్ల చేసిన పాపము వానికి తెలియచేయుడి. రాత్రివేళ అంతయు నిశ్శబ్దముగా ఉన్నప్పుడు, వాడు నిద్రపోకమునుపే వాని మనస్సు స్తిమితపడి పశ్చాత్తాపముతో కూడినప్పుడు, వానితో మాట్లాడితే అప్పుడు వాడు మీరు చెప్పినది విని తప్పును ఒప్పుకొనును.

దీర్ఘములైనట్టియు ఆయాసకరములైనట్టియు సంభాషణలు మానుడి. పిల్లవాని మనస్సు విసుకకుండా దీర్ఘకాలమువరకు ఒక సంగతిమీదనే ఉండనేరదు. జాగ్రతగా మాట్లాడుటకు మంచిసమయములను వెదుకుడి. విత్తిన మంచి విత్తనము పరిశుద్ధాత్మవల్ల ఆశీర్వదింపబడునట్టును, అది దేవుని మహిమార్థము విస్తారము ఫలించునట్టున్ను ఆసక్తితో ప్రార్థించుడి.





## ౯౦ పాఠము.

### నక్షత్రములను గురించి.

మిణుకు, మిణుకు. - - - మిక్కిలి సూక్ష్మము, ఉండి లేనట్టు.

సమూహము. - - - - గుంపు.

దీప్తి. - - - - - - వెలుగు, కాంతి.

విస్మయము. - - - - ఆశ్చర్యము.

రాత్రి వేళ ఆకాశమునున్ను రవలవలె మెరయుచున్న నక్షత్రముల నున్ను నీవు చూచియుందువు, నీవు వాటి వంక జాగ్రతగా చూచితే అవి రెండు విధములుగా నున్నవని నీవు కనుగొందువు. కొన్ని పెద్ద [illegible] నీ [illegible] డగా ప్రకాశించుచున్నట్టున్ను, మరికొన్ని మిణుకు [illegible] న్నట్టున్ను కనుపించును. స్థిరముగా ప్రకాశించెడు [illegible] త్రములు ఆకాశమందు నిమ్మళముగా పోవుచుండును, వాటికి [illegible] అని పేరు. అవికూడా కొంచెము ఎక్కువ తక్కువగా ఈ [illegible] వలె ప్రపంచములు అయియున్నవి. మనము ఒక గ్రహము

మీద నివసించుచున్నాము. ఎనిమిది పెద్ద గ్రహములున్ను నూరు చిన్న గ్రహములున్ను ఉన్నవి. మిణుకు మిణుకుమనెడు నక్షత్రములు వీటి కంటే చాలాదూరమున్నవి. అవి పెద్ద సూర్యులే. అవి అంతదూరముగా నుండుటవల్ల, వెలుగు చుక్కలవలె మాత్రమే కనుపడుచున్నవి. మనము చూచెడు సూర్యుని చుట్టును ప్రపంచములు తిరుగుచున్నట్టుగానే వాటిచుట్టును కూడా ప్రపంచములు తిరుగుచున్నవని కొందరు ఊహించుచున్నారు. ఓకువల్ల పరీక్షించి చూచితే కొన్ని సమయములలో ఒకటిగా కనుపడెడు నక్షత్రములు ఒకదానిచుట్టు ఒకటి తిరిగెడం రెండుమూడు నక్షత్రములైనట్టు కనుపడుచున్నవి. మిణుకు మిణుకను నక్షత్రములలో ఈ భూమికి దగ్గిరగానున్నదానికి, ఇక్కడనుంచి తగినమార్గము ఏర్పడి యుంటే, వడిగాపోవు గుర్రమునకు ఇక్కడనుండి అక్కడికి పోవుటకై అనేకకోట్ల సంవత్సరములు పట్టునంత దూరముగా అవి యున్నవి.

రాత్రివేళ ఆకాశము నిర్మలముగానుండి చంద్రుడు ప్రకాశించనప్పుడు, ఆకాశమునకు అడ్డముగా ఒక పలచనగానుండు తెల్లమబ్బు (అనగా నక్షత్రవీధి) కనుపించును. అది మేఘము కాదు. దుర్భినివల్ల పరీక్షించిన పక్షమునకు దానిలో లెక్కకందని నక్షత్రములు కనుపించును. ఆకాశమందంతట నక్షత్రసమూహములు అనేకము లక్కడక్కడ నుండును; వీటిలో ప్రతిదానియందు లక్షతరబడి సూర్యులుండవచ్చును.

నక్షత్రములు రాత్రియందువలెనే పగటియందును ప్రకాశించుచున్నవి; అయితే పగటివేళ సూర్యునిదీప్తిచేత అవి కనుపించవు. ... లో పెద్దవి పగటియందున్ను ఓకుతో చూచినట్టయితే కనుబడునట్టును, తోకలుగల కొన్ని విచిత్ర నక్షత్రములు అప్పుడప్పుడు చూడబడును. వీటికి ధూమకేతువులని పేరు; పామరులు ఇవి యపాయ చిహ్నములని అందురు. అయితే ఇట్లు తలంచుట పిచ్చితనము; "ఆకాశచిహ్నములను

చూచి విస్మయమొందకుము. ఎందుకంటే మతాంతరులు వీటివల్ల విస్మయ మొందిరని" దైవవాక్యము బోధించుచున్నది.

ఆకాశమునున్ను భూమినిన్ని సముద్రమునున్ను సృష్టించిన వానిని మాత్రమే ఆరాధించి సేవింపుము. ఆయన కుమారునియందు విశ్వాసముంచి ఆయన పరిశుద్ధాత్మవలన పవిత్రురాలవగుటకు ప్రయత్నము చేయుము. ఈ తీరున ప్రవర్తించినట్టయితే ఇహమందు సౌఖ్యమున్ను పరమందు నిత్యానందమున్ను పొందుదువు.

స మా ప్త ము.

S. P. C. K. PRESS, VEPERY, MADRAS. 1886.

